# అభయప్రదానము

(చరిత్రాత్మక నవల.)

గ్రంథకర్త:

మహాకవి, సరస్వతీపుత్ర

పుట్టపర్తి నారాయణాచార్యులు

ప్రకాశకులు:

రాజశేఖర బుక్ డిపో.

ఆళ్ళగడ్డ.

(కర్నూల్ జిల్లా)

# ౧

అరుణారుణములైన యామె వ్రేళ్ల కాంతులు వీణాతంత్రులపైఁబడి యింగిలీకపు వింతరంగుల నీనుచున్నవి. ఆమె ధరించినది సంజ కెంజాయలీను నెరపట్టు. ఊదిన బొఱు నావలువలో నుండి తెల్లని యంగ దట్టపు కాంతులు బయటికి మిట్టించుచున్నవి. ఆ రెండు రంగుల సమేళమే యామె గూర్చున్న మేరకు చంద్రకాంత శిలా సౌధమున ప్రతి ఫలితమైన గొజ్జగుల కాంతి. ఆమె యా వీణను మీటుచున్నట్లు లేదు. ప్రేమంపుఁ జెలికత్తె చెక్కిలి గీటుచున్నట్లున్నది. క్షేత్రయ్య రచించిన జావళి కొక దాని కామె స్వరము గూర్చుకొను ప్రయత్నములో నుండెను. ప్రక్క నొక దాసి నిలిచినది. దాని హస్తమున వీవన. వీవన పిడికి దాపినది వజ్రకరూరులో దొఱకు మగరాలు. ఒకప్పుడు కృష్ణరాయల తమ్ముఁడైన యచ్యుతుఁడు తన మఱదలికా వీవన పుట్టినింటి యుడుగరగా నొసగెను. దాని నా యంతఃపుర మల్లె యొక్క మహాభాగ్యముగ సంరక్షించుకొని వచ్చుచున్నది. దాసి దాల్చిన వీవన నుండి బయలు దేరు గాలులు ప్రక్కనున్న కరండ పాంచాలికలలోని యగరు వాసనలచే సురభిళము లగు

చుండెను. చాలని దానికి ప్రక్కనున్న వాతాయనముల నుండి వీచు మల్లికల తావులు. కాని...రాగ భావములో సంపూర్ణముగా నిమగ్నమైన యా యువతి యీ హాయిని గమనించు చున్నట్లే లేదు. క్షేత్రయ్య నాటి కింకను తంజావూరు రాలేదు. కాని .... యాతని పదములు మాత్రము దక్షిణదేశ మందంతయు నావరకే యలమి కొని యున్నవి.

ఆమె పాడుచున్న పదమిది—

"అందగాడ వౌదు లేర! అది వరాహా!
"అందుకైతే జాణవు - అల్లందుకైతే జాణవు"

—ఇదియా పదము యొక్క పల్లవి. ఆతఁడు దీనిని శంకరాభరణమున గూర్చెను, కాని దానినామె ప్రతిమధ్యరాగమగు సారంగలో జోడించుటకు యత్నించు చున్నది. సారంగమును బట్టినప్పుడు వీణె తుమ్మెదల బారువలె మ్రోగుచున్నది. మ్రోగినపు డంతయు "సారంగరాగ భ్రమన్మద భృంగీరుతి" యను వసు చరిత్రలోని చరణ మామె యెదలో సంగీతముతో బాటు చుట్టుకొనుచున్నది. సారంగ కా పదముల కూర్పు సరిపోలేదు. శంకరాభరణమే కావలసి వచ్చెను. కాని యెత్తుగడ! దానికే యామె యోచించు చున్నది. యువరాజు రఘునాథరాయ లరుదెంచు చున్నారన్న వార్త వచ్చినది. దాసి యీ మాట రెండు-మూడు సారులనెను. ఆమె వినుపించు కొన్నట్లే లేదు. ఇంతలో రఘునాథరాయలు లోనికి రానే వచ్చెను.

"మహారాణి లేదో పనిలో నున్నట్లున్నది"

కళావతి తలనెత్తి చూచెను. ఆమె ముఖమున పొన్నపూల గుత్తివంటి చిఱునవ్వు దోచినది. దానిలో మనాక్సూచిత మగు లజ్జయు నొదిగి యుండెను. ఆ యెల సిగ్గు తానింత మైమఱచి నందులకు కళావతీ దృంగతములు రాజుపై నీలోత్పలములు జలెను.

"ఏమియులేదు క్షేత్రయ్య పదమునకు స్వరము కట్టుకొను చున్నాను. అందుచేత మీ రాకను గమనించ లేదు. క్షమించవలెను"

"మంచి సమయములో విఘ్నము కలిగించి నామన్నమాట ఏది! ఆ స్వరము మేము వినవచ్చునా?"

ఆమె తిన్నగా పాడ నారంభించెను.

రఘునాథరాయలు తల పంకించుచు నిట్లన్నాఁడు " మరి కొంత విలంబకాలమున రావలెను. క్షేత్రయ్య గారి పదములు భరతమున కుద్దేశింపఁ బడిన వనుట మీరు మఱచి పోరను కొందును. ప్రథమ కాలమున కంటెను కొంత యెక్కువగా యీడ్చి పట్టినచో రాగ భావము చక్కగా వ్యక్తమగును. హస్తములు స్పష్టముగా పట్టుటకు వీలుండును. "అన్నమయ్యగారు శంకరాభరణములో వ్రాసిన యొక కృతి మనసులో మెదలాడి దాని పోకడలో పాడుదమని ప్రయత్నిం

చితిని" అదే మీరు చేయుచున్న పొరపాటు. అన్నమయ్య గారి రచనలు మధ్యకాలములో పాడుకొన వచ్చును. క్షేత్రయ్య గారి పాటలు విలంబకాలములో తప్ప రక్తి కట్టవు. ఆ యెత్తుగడను పంచమ స్వరముతో నారంభించినచో బాగుండును.

ఆమె యట్లే పాడెను. పల్లవి వింతగానదికికొని పోయినది. పైఁగా కళావతీ కంఠమున పంచమము పలికి నప్పుడు కొదమ కోయిలలు కూసినట్లే యుండెను. ఆమె పాడుచున్నప్పుడు రఘునాథుఁడు చక్కగా భరత ముద్రలు పట్టి చూపించినాడు. "అవునవును హస్తములకును సాహిత్యమునకును ఎంతచక్కగా పొత్తు కుదురు కొన్నది. కళావతి సెలవివార నవ్వినది.

రఘునాథుఁ డిట్లనెను.

"కళావతీ! మనస్సున నేవో వ్యూహములు మెదలాడు చున్నవి. కొంచెము సేపు చదరంగ మాడుకొన్నచో.... .... ........

ప్రక్కనే నిలిచి యున్న దాసి అమ్మగారి ముఖము వైపు జూచెను. కళావతి తన వామ నేత్రము యొక్క బొమ్మ నల్లార్చినది. సమ్మతిని దెలుపుట కది యభినయము. భరత శాస్త్రమున గూడ నంతే. చదరంగపు బల్ల తెచ్చిన వెంటనే మరియొక దాసి వచ్చి బంగారు తీగలల్లినవీణె ప్రక్కకుఁ బెట్టినది. కళావతి పాచికల నందికొనుచునే—

"ఈ నాటి చదరంగములో పందెమేమి?"

"ఏమున్నది? మోహనరాగములో నేను క్షేత్రయ్య గారి

పదమున కల్గిన స్వరములు మీకు బంపించి వేతును"

"అంతమాత్రము చాలదు"

"మరింకేమి గావలెను?"

"ఈ చదరంగమున మీరోడి పోయినచో పెద్దన్న గారి కవిత్వమున కంటెను ముక్కు తిమ్మన్న గారి రచన మధురమైనదని మీరంగీకరించ వలెను."

"అట్లే గును. పెద్దన్నగారిది మధురవాణి."

ఈముక్కతో కళావతి ముఖము కించి దరుణమయ్యెను. మధురవాణి రఘునాధరాయలకు ప్రియురాలు. సంగీత సాహిత్య భరతములలో నారి తేరినదియును. ఆమె కన్న నన్నిటిలో దాను గొప్ప యనిపించుకొన వలెనని - కళావతి నిరంతర ప్రయత్నము. ఇది గూఢముగ వారిద్దరి మనస్సులలోని ద్వంద్వ యుద్ధము. కళావతి ముఖముపై యేర్పడిన మార్పును రఘునాథుఁడు గమనింపక పోలేదు. ఆమెను రెచ్చగొట్ట వలెనని యే యాతఁడామాట లనెను. మధురవాణి చదరంగమున గూడ నెఱజాణ.

ఆట ఆరంభమైనది. రెండు పక్షముల లోను యెత్తులు పై యెత్తులు సాఁగుచున్నవి. సంధ్య మాఁగిపోవొచ్చినది. అంతఃపురములోని కాచదీపములు క్రమముగ వెలిగింప బడుచుండెను. కాని వారి యాట ముఁగియలేదు. రఘు

నాథుఁడుత్సుకుఁడై సైన్యమును నడుపు చున్నాఁడు. అతని మనస్సులో కదన కుతూహల రాగము సుళ్లు జుట్టుకొను చున్నది. కళావతి మాత్రము వెనుకకు తగ్గునా యేమి? ఆమెకును వ్యూహముల నేర్పఱచుటలోని చాతుర్యమెంతయో కద్దు. జయము వారిరువురి నడుమ నుయ్యాల తూగుగా నుండెను. ఇట్లెంతయో సేపు గడచెను. కాని క్రమముగా రఘునాథుని చేయి క్రిందగు చున్నది. తిమ్మనగారి కవిత్వమే గొప్పదని వలసి వచ్చునని యాతఁడు భయపడు చుండెను. అతనికి పెద్దన్న గారన్న ప్రాణము. కాని లాభమేమున్నది? రఘునాథుఁడు నడపుచున్న దారను కళావతీ సైన్యములు చుట్టివేసినవి.

" ఇంక నడపుఁడు " ఆమె గద్దించెను.

ఆ గద్దింపు వీణపై కళ్యాణరాగమును నొక్కిపట్టి యారోహణ క్రమమున దైవత నిషాదముల జట్టి నట్లున్నది. అంత వఱకును కదన కుతూహలమును మననము చేసికొనుచున్న రఘునాథుఁడు ఆ నిషాద దైవతముల కెంతయో సొక్కిపోయినాఁడు. రాజును విడిపించు టెట్లు? తనలోని కళాభిరుచి లాలసతగా బరిణమించి కర్తవ్యమును మఱచునా యేమి? ఇంతలో నమాత్య గోవిందదీక్షితులు వారున్నచోటికి వచ్చిరి. " అమ్మా! యువరాజులకు సాయ మొనర్చినచో దమ యాక్షేపణ యేమియు లేదు గదా!

పరిస్థితిలోని విషమతను గమనించి యన్నమాట యిది.

" కావచ్చును యువరాజులు తమ యాశ్రితులను మీ సహాయముతో రక్షింప దలచుకొన్నచో నా యాక్షేపణ లేదు "

" మొన్న మీరేదో శ్రీరంగనాథునిపై చక్కని కృతి వ్రాసినారని దాసి చెప్పినది.

" దానికేమిలెండు. ఇప్పుడు మే మాటలో నున్నాము. నా మనస్సు నన్యాయత్త మొనర్చి యువరాజులను గెల్పించుటకు బ్రయత్నించకుడు. నన్ను క్షమించ వలెను "

ఈ మాటతో రఘునాథుని యాత్మగౌరవము దెబ్బతిన్నట్లయినది.

" మంత్రిమణీ! దయచేసి మీరు ఊరకుండుడు. తమ సాహాయ్యముతో నేను గెల్చినప్పటికి కళావతి నా గెలుపును పూర్తిగ నంగీకరింపదు. ఎట్లును యుద్ధమున తేదూర్చినాను దీనిలో నోడినను సరే. ఒంటరిగనే పోరాడెదను. నేనీనాడు రఘునాథుని చాతుర్యములోని హద్దులను కళావతికి చూపించి తీరెదను. "

అతడు ముఖమును గంటువెట్టుకొని తిరస్కార ముద్రతో నామెపై పు జూచెను. అతని కోపరంజితమైన యా ముఖము ఎదుటనున్న చంద్రకాంత స్తంభములో ప్రతిఫలించినది. అది జపాసన్నిధిని స్ఫటికమట్లున్నది. ఆయందము నైన యాతడు గమనింప లేదు.

" ఇంకను మీకు గెలుపుపై నాశ పోలేదన్నమాట "
కళావతి సాకూతముగా నాతని ముఖములోనికి జూచినది.

" అనగా "

" మీ రాజు సైన్యమంతయు నశించినది. అతఁడు పరదేశి యైనాఁడు. అతనిని నాశ్రయించుట కంటె మీకింక వేరు మార్గము లేదు. అట్లు గాకున్నచో నేదో యొక రీతిని సంధి గావించుకొనవచ్చును. తిమ్మన్నగారి కవిత్వము గొప్పదని యంగీకరించినచో యిక నే బాధయు లేదు "

" ఏమి? యెందుకు ఆట ముందు సాగినచో నెక్కడ నోడి పోవుదుమో యని మీకు భీతి యన్నమాట "

" మా కా భయమే లేదు "

" అట్లయినచో మరి సంధికై యింత తొందర పాటేల?

" ఏమియును లేదు. మీ రాజు అవస్థజూచి దయ బుట్టినది. మీవంటి యసమాన్య విక్రములను నమ్ముకొన్నను అతని కాయవస తప్పలేదేయని మా చింత "

"మాటలతోగాక కౌశల్యమును చేతలతో జూపుట మంచిది"

" కానిండు "

కళావతి కాయను ముందుకుజరిపెను. గోవిందదీక్షితు లాటను జూచుచునే యున్నారు. రఘునాథుఁడు గెల్చు సూచనలే కనుపింపలేదు. ఇంతలో నొక చేటి యరుదెంచినది. ఆమె ముఖమును గమనించిన గోవిందదీక్షితులు యేదో వార్తను

కొని తెచ్చినదని యూహించినారు. ఎట్లయినను ఈ చదరంగ
ము నిలిచినచో జాలునని యాతని యూశ. తొందరగ నడ
తెంచిన యాచేటి యువరాజుముందట నమస్కరించి నిలిచినది

" తమ కడ్డువచ్చినచో క్షమించ వలెను "

" ఏమి విశేషము "

ఆటలో నిమగ్నుఁడైన రఘునాథరాయకుఁడు తల
నెత్తకయే ప్రశ్నించి నాఁడు.

" మిమ్మును అమాత్య శేఖరులను వెంటనే పిలుచుకొని రమ్మని
ప్రభువుల వారి యాజ్ఞ "

" అచ్యుతరాయనింగారు వెంటనే రమ్మన్నారా! విశేషమేమి

అంతవఱకు తిమ్మనను రచించిన బాలభారత వ్యాఖ్యా
నములోని యేదో సంగతి నాలోచించుచున్న గోవిందదీక్షి
తులు తెప్పరిల్లుకొని ప్రశ్నించిరి. వారింతకు ముందే యచ్యుత
రాయలతో మాటలాడి వచ్చియుండిరి. అప్పుడు మహాప్రభు
వు లే యవసర కార్యమును గూర్చియు ప్రస్తావించలేదు.
ఇంతలో నవసర కార్యమేమి గల్గినది?

" ఇద్దరిని గూడ రమ్మన్నారా యేమి? " గోవిందదీక్షి
తులు మరల ప్రశ్నించినారు "

" అవును ప్రభూ! వారు తమకొఱకై యంతఃపురము లోని
చంద్రశాలలో వేచి యుండుమని చెప్పినారు "

గోవింద దీక్షితులు ఆసనమునుండి లేచిరి. ఆయన రఘునాథుని ముఖమున జూపులు నిల్పినారు.

"దీక్షితులు గారూ మీ రొక్కరే పోయినచో..."

రఘునాథరాయల మనస్సు ఆట విడిచి పోవుట కయిష్టమును సూచించెను.

"నే నీ యాటను ముగింపకయే వచ్చినచో ఓడిపోవుటకు జంకి ఆట నిలిపితినని కళావతీదేవి భావించును. మీరే పోయి అప్పాజీ గారిని చూడుడు. నేను వచ్చుట తప్పనిసరి యైనచో వెంటనే వత్తును."

"ప్రభూ అట్లుగాదు. యేదో గొప్ప విషయమును గూర్చి యాలోచించుటకే సామ్రాట్టు మనలను బిలిపించి నట్లున్నది. నే నిక్కడకు వచ్చుటకుముందు వారిని దర్శించియే వచ్చినాను. మరల నింతలోఁ బిలుపు వచ్చిన దన్నచో దానికేదో గొప్ప కారణ ముండియుండును. మీ రిప్పుడు రాకున్నచో... ... దీక్షితులు యువరాజును లాలించు చున్నట్లు పలికినారు"

ఆమాటలకు రఘునాథనాయకుఁడు కళావతి ముఖము వైపు జూచెను. ఆమె ముఖముపై చిఱునవ్వు తొణికిసలాడు చుసేయున్నది.

"మీకు పోవలసిన యవసర మున్నచో నా యాక్షేపణ య్యేమియును లేదు. కాని యిప్పు నార్యుల కవిత్వము సర్వాతి శాయి యని నిశ్చయించుకొందును"

ఆమె మఱల నవ్వెను.

" ఆ పని మాత్రము నా చేత కాదు. ఆట పూర్తి యగు వఱకు నీవు గెలిచినట్లు కాదు. ఈ బెదరింపులకు బెదరి మా రాజును నీ కొప్పించలేము.

" అయినచో నాటను ముందుకు సాగించుటయే మార్గము "

" తల్లీ! జీవనములో వలెనే యాటలోఁ గూడ గెలు పోట ములు మారుచుండును. ఈ సారి తమచేయి పైఁగా నుండ వచ్చును. అంత మాత్రమున కే మిన్నుఁటివిపో రాదు. రేపు యువరాజులే గెల్వవచ్చును. అప్పుడు మీ యున్ని ప్రశ్నలును యేమి గావలెను.? ఇంతకు నిది భార్యాభర్తల నడుమ జరిగిన క్రీడ. ఈ విషయము ను మీరు మఱువరాదు. "

" దీక్షితులు గారూ! యువరాజుల మనస్సు నొప్పించుటకు నే నీ మాట లనలేదు. ఎప్పుడును గెలుపు తమదే కాదని ఋజువు చేయుట కే యింత పని చేసితిని. నే నోడినపుడు వారు మాత్రమూరక విడిచిరా యేమి? మొన్న 'సప్తతాళ ముల' కీర్తనను బాడుటలో గొంత తప్పితిని. వారు నన్న ప్పుడు కన్నీళ్ళపర్యంత మేడ్పించినారు "

" కళావతీ! నేను నీ కృపాభిక్షతోఁ బ్రదుకదలచి కొనలేదు. ఆటను పూర్తిగ సాఁగిఁచక పోవుచున్నానను కారణముతో నీ వీ మ టలాడు చున్నావు. కాని యీ పలుకు నిట్లే యుండ నిమ్ము. అప్పాజీ గారితో మాటలాడి వచ్చి మరల ఆట

సాగింతము," రఘునాధుఁడు బిగుమానముతో లేచి నిలు చున్నాఁడు.

" అంతలోనే అంత కోపమా! ఏమి? "

కళావతి రఘునాధనాయకుని జూచి మరల నవ్వినది.

" కళావతీ! ఆత్మగౌరవము లేని యొక పిరికివానిగా నన్నను కొన్నావా యేమి? నీవు జింజిక్రృష్ణప్పనాయకుని పేర్మియైక పుత్రివి గావచ్చును. కాని నేను తంజావూరు రాజవంశము నకుఁ జెందిన పురుష సింహము అను విషయము నీవు మఱువ రాదు సుమా! "

" ఇప్పటి కైనను నేను కృష్ణప్పనాయకుల కుమార్తె నని గ్రహించి నారు కదా! " యామె నవ్వి మరల నిట్లనెను.

" మీరు రిట్టివారని తెలిసినచో మా తండ్రి నన్నొసగి యుండెడి వాడే గాఁడు.

" నిన్ను నేను మెచ్చి వివాహమాడలేదు. మీ తండ్రియే విజయ పణముగా మాకర్పించెను. ఈ విషయమును నీవు జ్ఞాపక ముంచుకొనుట మంచిది. "

" మీరు నన్ను చదరంగములో జయించలేక మాటలతో నొప్పించు చున్నారు. ఇదేనా పౌరుషలక్షణము "

కళావతి ముందున్న చదరంగపు బలకను దూరముగా నూకినది ఆమె కవమానమైనది. కన్నుల నిండ నీరొలికెను. ఆమె బిరబిర వెడలిపోయెను.

" కళావతీ! కళావతీ! "

రఘునాథుఁడు వెంటబడినాడు.

హఠాత్తుగ నతఁడీ పద్యమును బాడెను.

"నను భవదీయదాసుని మనంబున నెయ్యపు గిన్కఁ బూని తా
చినయది నాకు మన్ననయ చెన్నగు నీ పద పల్లవంబు మ
త్తను పుల కాగ్రకంటక వితానము సోకిన నొచ్చునంచు నే
ననియెద నల్కమానవు గదా! యికనైన నరాళకుంతలా! "

ఆరసిక దంపతుల ప్రణయకలహమును జూచుచు దీక్షితు
లు నోట మాటలేక యట్లే నిలిచినాఁడు.

అంతఃపురమున దంపతుల దిఱునగవులు వినిపించినవి. తళ్లికోట
యుద్ధము తర్వాత " విజయనగర సాహిత్యములో సత్యా
దేవి వంటి నాయిక లగుపించుట లేదు. "

"అవునవును అట్టివారిని మరల సృష్టించుటకే నా యీ
ప్రయత్నము. "

రఘునాథ నాయకుఁడు పలికెను.

"మరి యిప్పుడు గొప్పకవు లెవరు? తిమ్మనామాత్యులేనా? "

అతఁడు నవ్వెను.





౨

తంజావూరును బాలించుచున్నది అచ్యుతప్ప నాయకుఁడు. ఇతఁడు విజయనగర సామంతుఁడు. అమాట యౌపచారికమే. స్వతంత్రుఁడగు మహారాజున కుండవలసిన యన్ని యధికారములును నాతని కుండెడివి. అచ్యుతప్ప నాయకుఁడు విద్యానగరాధీశుఁడైన యచ్యుత రాయనికి సమీప బంధువు గూడ. అచ్యుతరాయని పత్ని తిరుమలాంబిక. ఆమె చెల్లెలు మూర్తిమాంబ. ఆ మూర్తిమాంబ మగఁడు శివప్పనాయకుఁడు. ఇతఁ డచ్యుతప్ప తండ్రి; సమాశ్రితుల యనుగ్రహమునకుఁ బాత్రుఁడగు వఱకను శివప్ప జీవిత మంత చెప్పుకొనఁ దగినది గాదు. అచ్యుత రాయల యనుగ్రహము వాని జీవితముపై కస్తూరి వాసనలు జల్లినది. వాని కీర్తి సామ్రాజ్యమున మల్లెతావిగా మసరినది. తంజావూరునకు మండలేశ్వరుఁ డైనాఁడు. ఆ పదవి ననుగ్రహించిన దచ్యుతరాయలే; శివప్ప తంజావూరు నాయకుల యింటికి మూలపురుషుఁడు. శివప్ప నాయకుఁడు బ్రసిద్ధికి వచ్చుటలో గోవిందదీక్షితుల యౌదార్యమును కొంత

యున్నది. శివప్ప మరణానంతర మచ్యుతప్ప సింహాసన మెక్కెను. అతనికిని గోవిందదీక్షితులే మహామంత్రిగా నుండి తంజాపూరునకు తనసేవఁ జెల్లించినాఁడు.

గోవిందదీక్షితులు కర్ణాటక బ్రాహ్మణుడందురు. వారిది వశిష్ఠగోత్రము. ఆశ్వలాయన సూత్రము. అతని తలిదండ్రు లాతని చిన్నతనమునందే గతించిరి. ఎవరో దూరపు బంధువుల యాశ్రయమున నాతఁడు చదువు కొనెను. వారిది మొదటి నుండియు. పండిత వంశము. ఆ గుణ మాయనరక్తము లోనుండెను. వారి తండ్రి తాతలు వేద పండితులు. సాహిత్యమున పారంగతులు. అంత మాత్రమే గాదు. సంగీతము గూడ వారు కూలంకషముగా నభ్యసించిరట ! ఇది విచిత్రముగదా! ఈ గుణము లన్నియు గోవింద దీక్షితుల కుగ్గుపాలతో వచ్చెను. అతఁడు చాల చిన్నవయసునందే చాల గొప్ప పండితుఁడను గౌరవమును సంపాదించు కొన్నాడు. తర్క-వ్యాకరణ శాస్త్రము లాయనకు గొటిన పిండి. సంగీత సాహిత్యముల కాయన నిధి. జ్యోతిశ్శాస్త్ర మాయనను వలచి వచ్చినది. జను లాపాండిత్యమును జూచి యబ్బుర పడిరి. కాని గోవిందదీక్షితుల సరస్వతిపై లక్ష్మి కోపగించినది. ఆమె దీక్షితులను మొగమెత్తి చూడలేదు. అతనికి సంక్రమించిన పిత్రార్జితము దారిద్ర్యము. ఇది యిట్లుండగా నాశ్రయ మొసఁగిన బంధువు గూడ మరణించెను. ఇంక నేమున్నది?

గోవిందదీక్షితులు మరల ననాథుడైనాడు. కాని హతాశుఁడుగాలేదు, దేహమున నిండుకొన్న యౌవనము, తలలో పుంజుకొన్న పాండిత్యము, తనకు భగవంతుఁ డనుగ్రహించిన పాండిత్యమును గొప్ప పనికి వినియోగింప వలెనను మహత్వాకాంక్షయు నాతని కుండినది. ఆ కాలమునందు రాజులే పండితులకు పట్టుగొమ్మలు. తన కాశ్రయ మొసఁగజాలు మహారాజును వెదకి కొనుచు నాతఁడు దేశదేశములు దిరిగెను ఆ నాడు విద్యానగర సామ్రాజ్య వైభవము మూడు పువ్వు లాఱుకాయలుగ నుండినది. అది యానాటి హిందూసంస్కృతి కాలవాలము. నాగరికతకు నిలయము. కళలకు గాణాచి. సాహితీ పరులకు రత్నామణి. విజయనగర రాజుల కీర్తిని విని గోవింద దీక్షితులు విద్యానగరపు దారిని బట్టెను.

దీక్షితులు విజయనగరమునకు వచ్చువేళకే అపర భోజుఁడైన కృష్ణరాయఁడు గతించి యుండెను. నాటి విద్యానగరాధిపతి యచ్యుతరాయలు. అప్పటి కింకను సమ్రాట్టుల యంతఃపురములో ముసలము పుట్టలేదు. సలకము తిమ్మఁడు ప్రశస్తికి రాలేదు. దీక్షితులు విజయనగరము జేరినప్పుఁడు అచ్యుతరాయలు పుత్రోత్సవములో నున్నాఁడు. అతనికి తిరుమలాంబిక యందు లేక లేక యొక కొడుకు గలిగెను. సమ్రాట్టుల యానందమునకు మితిలేదు. విద్యానగర మానందడోలికలలో నూగుచున్నది. సుహాసినులకును,

బ్రాహ్మణ ముత్తైదువలకును, బీదసాదలకును యథేచ్ఛ ముగ నన్నదాన వస్త్రదానములు సాగుచుండెను. దేవాల యములో విశేష పూజలు. రాత్రింబవళ్లు భరత నాట్యము లలో మ్రోయుగజ్జల గలగలలు; విద్వజ్జనుల సన్మానములు ఆస్థానములో పాండిత్య చర్చలు, కవుల రసగానములు ఆ నాటి కవులందఱు నించుమించు గాయకులే. రాజుల ఖురళికా ప్రదేశములలో మల్లయుద్ధ ప్రదర్శనలు గూడ నుండెను. దానిలో స్త్రీలు గూడ పాల్గొనుచుండిరి. ఒకనాడు గోవింద దీక్షితులు కొలువునకేగెను. దానికి పూర్వరంగమంతయు నాతడెంతయో కష్టపడి యేర్పఱచికొనెను.

అచ్యుత రాయల కుమారుడు చినవెంకటపతి రాయల జాతకముపై జర్చలు సాగుచుండెను. అనేకులు జ్యోతిష్కులా చర్చలో పాల్గొనుచుండిరి. సభలోని విద్వాంసు లందఱును కుమారుని జాతక మతిప్రశస్తముగా నున్నదని తలలు పంకించుచున్నారు. ఆతడు చక్రవర్తియై తీరునని వారనుచుండిరి. ఈ మాటలతో నచ్యుతుని మనస్సున నమృ తము బంశినటు లైనది. ఆ సమయమున దీక్షితులక్కడ నుం డెను. ఆతడా విద్వద్గోష్ఠిని మౌనముగ నాలించుచుండెను. పండితులందఱును చెప్పినవాక్యములు ముగిసినపిమ్మట గోవింద దీక్షితులు లేచి నిలువబడెను.

" ప్రభూ! నాదొకవిన్నపమున్నది. మీరాలింపవలెను. విద్యానగర రాజులు విద్వత్పక్షపాతులు. "

సభయంతయును నాతనివైపు జూచినది. ఆతని మొగమున మీసకట్టయినను రాలేదు. పెట్టిన విభూతి మాత్రము త్రినేత్రుని యపరావతార మనిపించుచున్నది. కట్టిన వస్త్రములాతని దారిద్ర్యమును సూచించుచున్నవి. విద్వజ్జను లందఱు నాతని నొక్కసారి దిగ్భ్రాంతులై జూచిరి. ఆ చూచుట యాతని ధైర్యమునకు నివ్వెఱపోయి...

" మీరేమి చెప్పదలఁచికొన్నారో చెప్పవచ్చును. "

ప్రభూ! మీరు విద్యాపారంగతులు. గుణ పక్షపాతులు. నేను చెప్పబోవు విషయము బహుజన సమ్మతముగ నుండదని నా యనుమానము. అది యప్రియవార్తయును గావచ్చును. కాని వినువారి కప్రియముగ నున్నను సత్యమున కపవాదము రారాదని నా నిశ్చయము. నాకుదోచు సత్యమును తమ సన్నిధానమున నివేదింతును చిత్తగింపవలెను

ఆస్థానమున దిగ్గజములట్లు గూర్చున్న పండితులు గోవిందదీక్షితుల వైపు మరియొక సారి జూచిరి. ఆ చూపులలో నసూయయు గోపమును బెనగొని యుండెను.

" మీరు చెప్పఁదలచి కొన్నది నిశ్శంకముగ జెప్పవచ్చును. ఆ విషయము మా కప్రియమైనను సరే. విజయనగర రాజుల కొలువులో సత్యమున కపచారము మాత్రము రారాదు."

ఈ మాటలనుచు నచ్యుతుఁడు గంభీరముగ తల నూచినాడు. ఆ యూచుటతో నాతని తలపెని తురాయికి వేలాడదీసిన ముత్యముల జాలరులు దమకాంతులను " ఝళిచ్చు " మని కొట్టినవి. ఆతనిప్రక్క నిలుచుండి వీచోపులిడుచున్న చామర గ్రాహిణుల కన్నులాకాంతులకు మిఱుమిట్లుగొనెను.

"ప్రభూ నే నిప్పుడు విన్నవింపఁబోవున దప్రియమైన సత్యము. నా సత్యముతోఁ దమ మనస్సు చివుక్కుమనవచ్చును. కాని తమరు నాపై కోపగింపరాదు.

గోవిందదీక్షితు లొక్క నిమేషము మౌనముగ గడిపిరి. ఆ మౌనము విజయనగరాధీశుల నాలోచించుకొన నిచ్చుటకు —

" ప్రభూ మీ కుమారుల జాతకమేమో ప్రశస్తమైనదే కాని. యది యల్పాయుష్యమును సూచించుచున్నది. ఇది మాయందరి దౌర్భాగ్యము. వారి కెనిమిదవయేట నపమృత్యు యోగమున్నది. అది గడచి బ్రతికినచో నాయుష్యమున కొదువలేదు.

" ఏమీ! చిన్న వెంకటపతి యల్పాయుష్కుడా! "

రాజు కన్నులలో సంభ్రమ విషాదాశ్చర్యము లొక క్షణములో దిరిగిపోయెను; అతని స్వర్గసౌధమొక్కసారిగా గూలినట్లయినది. అతఁడు మగరాల సింహాసనమున వెన్కకు తగ్గెను. ఆ తరుట " హా తోస్మి " యన్నట్లుండెను.

" అవును ప్రభూ! కుమారులు జన్మించిన కాలము నందలి గ్రహగతులను బట్టి చూచినచో వారల్పాయుష్కులే అది నిజము

" మీ మాట యసత్యమైనచో ",

రాజు కన్నులు స్తిమితములైనవి. ఆ కొల్వుకూటమున జెక్కఁబడిన సూచీ ముఖహస్తమును బ్రదర్శించు శిలా ప్రతిమల కన్నులకును—రాజు కన్నులకును భేదమే లేకుండెను. అచ్యుతరాయలు చాల యందగాఁడు. అప్పటి యతని యందమును దిలకించి ప్రక్కనే నిలిచికొనియున్న కరండ వాహిని యొడలు జల్లుమనెను.

" నాతల నుత్తరించి వేసికొందును "

" మీ నిశ్చయము సత్యమనుట కాధారమేమి? "

" మహారాజులకు బ్రమాణమే గావలసినచో దప్పక యిత్తును. తమరు యువరాజును పరీక్షించుటకు గృపసేయవలయును. అతని యెడమ తొడపై నొక సన్నని మచ్చయున్నది. అది యువరాజుల యాయుఃప్రమాణమును సూచించును. ఇప్పు డది గురిగింజ యంతమాత్రమే యున్నది. అది యంతతో నాఁగదు. క్రమక్రమముగ బెరుగుచు బోవును. ఆ మచ్చ యెనిమిది గురిగింజల యంత వృద్ధిజెందిన నాఁడు యువరాజుల కపమృత్యు వున్నది. ఈ మాట సత్యము "

" దీనికి పరిహారము లేదా యేమి? "

అచ్యుతుని ముఖమున దైన్యము స్పష్టముగ తాండవించుచున్నది. తలపాగలోని యన్ని ముత్యాలకాంతులు గూడ నాతని మొగమునకు బ్రకాశము దేలేకపోయెను"

"ఉన్నది; అదియొక పంపాపతియనుగ్రహముమాత్రమే. ఆగండము తప్పినచో నా బాలకుడు చిరంజీవియే.

" ఇతని మాటలు నమ్మకుడు. మేము కుమారుని జన్మకుండలిని సమగ్రముగ పరిశోధించినాము. అపమృత్యువున్నచో మాకు దెలియదా యేమి? ఈ యువకుడు మతి చెడిన వాడై యుండును."

సభలోని జ్యోతిష్కు లడ్డువచ్చినారు.

" నా మాట నిజమో కాదో - పరీక్షించుటకు స్వయముగా సమార్పిట్టులే పూనుకొన్నారుగదా! మరి మీతో వాదించి ఫలమేమి? నేను మీకన్న నెంతో చిన్నవాడను గావచ్చును. కాని నాకును జ్యోతిష్యములో గొంచెము జ్ఞానమున్నదని మీతో నమ్రముగ నివేదించుచున్నాను. నా యోగ్యతను నా వయసునుబట్టి తూచవలదని మనవి. నేనిచ్చిన ప్రమాణమును మహారాజులు బరీక్షించి తేల్చుకొనవచ్చును. నా మాట యసత్యమైనచో పంపాపతి రథము క్రింద బడిపోయెదను.

అనవాలునకు విద్వాంసులమనస్సులలో విద్యుత్సంచారమైనది.

అచ్యుతుఁడు సభనుండి లేచెను. బంగారు బెత్తములవారు "శ్రీరంగరాజు" నాధిపత్యమున వెంటవచ్చుట కతఁడాగలేదు. "ముద్దుకుప్పాయి" నీ రాజన నాట్యము నామతింపలేదు. ఆతని మనస్సు సంశయా సంశయముల మధ్య తూగాడుచుండెను. పగటి దివ్వెలుఁగాంజట్టలేదు. వెంటనే "హజారరామస్వామి" యాలయమున దూరి పెడమార్గమున నంతఃపురమున బడినాఁడు. అంతి పురములోని యా తెల్లని పాలగచ్చుపై మహారాజు నడచి పోవునప్పుడు ఒక మహారాజు పోవుచున్నట్లే లేదు. దైవోపహతుఁడైన యొక మానవుని యూహ వలె నాతఁడు పోయెను.

సభలోనున్న పండితులందఱు గోవిందదీక్షితుల వైపు జుఅజుఅ చూచిరి.

అంతమంది విద్వాంసుల వాక్యములను ఆ యువకుడాక్షేపించినందులకు మొదట నచ్యుతున కాగ్రహమే గల్గెను. కాని కలిగిన యాగ్రహము ఆ యువకుని ముఖవర్చస్సును జూచి మాయమైపోయినది "రూపాంతరమున వచ్చిన పంపేశ్వరుఁడు కాఁడు గదా! యితడు? విద్యారణ్యుల తపశ్శక్తిచే బరిపాలించెడు రాజవంశముల కీ గతి పట్టిన దేమి? అవును. నాటిరాజులకు ధర్మము ప్రధానము. తమకో? సౌఖ్యము ప్రధానము. ధర్మము దాని కంగము. ఈనాఁడా యేమి? సంగమ వంశపు కడపటి రోజులలోనే ధర్మము

పోయినది." ఇంతలో నెవ్వరో వీణవాయించుచున్న ధ్వని యాతని చెవిలో పడినది. అతని భావన వీణానాదమున లీనమయ్యెను. అదియు నొక్కక్షణమే. మరల నాతని మనస్సున చింతలేవో యలముకొన్నవి. పుట్టిన కుమారుని దానెన్నియో సారులెత్తికొని ముద్దాడెను. ఒక్కసారియు నామచ్చ కంటబడలేదే? తాను గమనించి యుండక పోవచ్చును. అయ్యో! దైవమా! తిరుమలాంబ తన పట్టమహిషి. ఆమె కన్న కొడుకే సామ్రాజ్యమున కర్హుఁడు. వాని సంగతి యిట్లగుచున్నదే. విజయనగర సింహాసనముపై తుళువంశదీప మారిపోవునా! అతని కన్నులలో నారవీటి రామరాజు మెఱసెను.

ఎవ్వతెయో బరువెత్తిపోయి తిరుమలాంబికకు రాయల యాగమనమును దెల్పినది. "వార్తలేదేమే" యని రాణి యనుచునేయున్నది ఇంతలో రాయలంతఃపురములో బ్రవేశించినాఁడు. అతఁడు తొందరగా నంగలు వేయుచు శిశువును దరిసెను. ఇంకేమున్నది. వాని యెడమ తొడపై గురిగింజ యంతటి మచ్చ — యుండనే యున్నది. దానిరంగు గోధుమ నాగువంటి రంగు. రాగ రాగ నది కృష్ణసర్పమై కఱచును. నేటి కామచ్చ బాల్యమున నున్నది. అది పెరిగి పడగనెత్తిన నాడు......నచ్యుతుని కన్నుల నిండ నీరు నిల్చినది. అతని శరీరము కంపించుచుండెను. తిరుమలాంబయు నామచ్చ నంతకు

ముందే చూచినది అది నానాటి కెదుగుచున్న విషయము గూడ నామె యెఱుంగును. ఆమె దాసీల నడిగెను. వారేదో యదృష్టపు మచ్చ యన్నారు. రాజవంశమున నదృష్టము గాక మరేమగునని వారియూహ. కొందరు దానిని గరుడ మచ్చయనిరి. అదియున్నచో సర్పభయముండదని మరి కొందరు వ్యాఖ్యానించిరి. ఈ మాటలన్న దాసీల కందఱ కామె యుడుగరలిచ్చెను. ఆ మచ్చవిషయము నింత పెద్దచేసి రాయలు యోచించుట తిరుమలాంబ కాశ్చర్యమే యైనది. కుమారుని యంగముపై నున్న మచ్చను గూర్చిన చర్చ వెంటనె కృష్ణదేవరాయల యంతఃపురమునకు వెళ్ళెను. రాయల పత్ని "తిరుమలాదేవి" యీ వార్త నాలించి మనమున గొంత సంతసించెను. దుఃఖమును సూచించెను. చిన్నాదేవి కీ వార్త దెలిసినది. ఎవరు రాజులైన దనకేమిటెమ్మని యామె దానిపై నేమియు వ్యాఖ్యానింపలేదు.

"ఈ మచ్చనింతకు ముందే గమనించినాను. ఇదేదో గరుడ మచ్చయన్నారు."

తిరుమలాంబయన్న మాటల కచ్యుతుం డేమియు బ్రత్యుత్తర మివ్వలేదు. అతని నిట్టూర్పు మాత్రము పిల్లని యెదపై నొక వాడికత్తివలె బ్రాకిపోయినది.

"ఇంత చిన్న విషయమునకై తమరేల కళవళపడుచున్నారు?" తిరుమలాంబయన్నది. కాని యచ్యుతుని ముఖము సహజ

స్థితికి రాలేదు. ఏదో ప్రేతమును జూచినట్లాతడు కళవళ
పడుచుండెను. అజ్ఞాతమగు నే యాపదనో యాతఁ డూహిం
చుకొనుచున్నాఁడు. మహారాణి ప్రాసాదమునకు ముందు
[illegible]గము తిమ్మయ్య పాద ముద్రలు వేయుచుండెను. అతఁడు
రాయల కంగరక్షకుఁడు

ఇంకేమున్నది ఆ యువజ్యోతిష్కుఁడు చెప్పిన మాట
నిజమే యైనది ”

ఈ మాటలనుచు నచ్యుతుఁడు మహారాణికి జరిగిన కథ నం
తయు విన్పించెను. తిరుమలాంబకును భయమైనది. ఆమె
దీక్షితుల నంతఃపురమునకు బిలిపించికొనెను. కుమారు నాతని
పాదములపై బడవేసినది

స్వామీ! మీ రెవ్వరో మహాత్ములుగ నగపడుచున్నారు.
ఈ సంతానము మీది. దీనిని రక్షించుకొను భారముమీది.”

ఆమె గట్టిగా నేడ్చినది

“ తల్లీ! నేను మహాత్ముఁడను కాను. తపస్వినిగూడ గాను.
నేనును మీ వంటి యొక మనుష్యుడనే. నన్ను దుస్సాహసి
యన్నను దప్పులేదు. ఈ మాట నేను చెప్పగూడనిదై
యుండెను. కాని [illegible] లోనున్న యుత్సా
హము నా బుద్ధిని గెలిచినది. నా మాటలు [illegible]న్ను
నింతగా గలచునని నే నూహింపలేదు. తల్లీ! నన్ను తమరు

మన్నింపవలెను. నే నరిషడ్వర్గమునకు బలియైన యొక యజ్ఞానిని. లేకున్నచో నీ కీర్తికామన నాలో నేల గల్గవలెను. ఈ యపచారమేల చేయవలెను?

గోవిందదీక్షితులు గూడ వాపోయినాఁడు. కాని యతఁ డేమిసేయును? పంపేశ్వరుఁడట్లు బల్కించినాఁడు.

గోవిందదీక్షితులు మరల నిట్లనెను.

“ తల్లీ! మానవులల్పశక్తులు. దైవేచ్ఛ ముందు మనయాట సాగదు. పంపాపతి యిచ్ఛలేనిదే తృణముగూడ చలింపదని మనమంద రెఱిఁగినదే. ఇప్పుఁడు కుమారుని విషయమున నా మాట సత్యమే యైనను అది జరిగియే తీరవలెనను నియమము లేదు. జగదీశ్వరుని యనుగ్రహ మున్నచో కొండలై వచ్చిన యాపదలు మంచువలె విరిసిపోవును. తమరు నామాటలకు వెల యెక్కువ కట్టరాదు. ఇతోధికముగఁ బంపాపతి సేవలొనర్చి యీ సంతానము నాతని పాదములపైఁ బడవేయుఁడు. మానవులము మనమింతకన్న నేమి చేయగలము? “ నీ యిష్టము వచ్చినట్లు నడుపు”మని సర్వమును దైవమున కర్పించుటయే మానవుల పరమాదర్శము. కలిగిన యపాయమును ధైర్యమున నెదిరించుటయే పురుషకారమునకు ప్రయోజనము ”

గోవిందదీక్షితు లామె నోదార్చెను. కాని యా దంపతుల మొగములపైఁ దొలుతటి మందహాసము తాండవించ

లేదు. దీక్షితులు రాయలతో ననెను.

" ప్రభూ! నా మాటతో బెదరవలసినది లేదు. దైవానుగ్రహమున మీకున్నది పూర్ణ ఫలము. కాని కర్మ ఫలముతో జాతకుఁ డపూర్ణాయుష్కుఁడై జన్మించెను. దీనికి కారణము జన్మకారకములైన గ్రహములు. సూక్తహవన హోమములతో జప తపములతో గ్రహములను తృప్తి పఱుప వచ్చును. వారి యనుగ్రహమును సంపాదింప వచ్చును. మృత్యుంజయ జపముతో మృత్యుహరుఁడైన పంపాపతి నారాధించినచో మీరు కుమారుని యపమృత్యువును నివారింప వచ్చును.

ఈ ఘటన యచ్యుతరాయలను గోవిందదీక్షితుల నొక్కటఁ జేర్చినది. దినదినమునకును దీక్షితుల ప్రభావము విజయనగర సామ్రాజ్యమునఁ బెరుగజొచ్చెను. కొంత కాలమునకే యాతఁ డచ్యుతరాయని యాప్తమిత్రులలోఁ నొక్కడైనాఁడు. రాజకీయములలో నాతని పలుకుబడి మించినది. సంగీత సాహిత్యములలో నాతని కీర్తి క్రమముగా నెచ్చెను. ఆతని జీవనము గూడ నల్లరి కందర్పప్రాయముగ నుండెను. రాజానుగ్రహముతో దీక్షితుల సాంపత్తిక స్థితియు మారినది. అతఁడు గృహస్థుడయ్యెను. అధ్యయనాధ్యాపనలతో దినములు గడచుచున్నవి. విద్వాంసులు కళావిదులు దీక్షితుల నాశ్రయించుచుండిరి. సాహిత్యసంగీత సమాలోచనములు

సాగుచుండెను. అతని ఋజుజీవితము సమార్త్రిట్టుల కెంతో ప్రీతి పాత్రమైనది. కాని రాయల కుమారుడు మాత్రము జీవింపలేదు. వాని తలపై సలకము తిమ్మన కత్తి యూడినది. ఇవి తరువాత నడచిన గాథలు. గోవింద దీక్షితుల యాశ్రయముతో గద్దెకువచ్చిన వారిలో శివప్ప నాయకుడు గూడ నొక్కడు.

గోవిందదీక్షితులు దారిద్ర్యము రుచి బాగుగా జూచినవాడు. అందుచే నతడు తన యదృష్ట కాలమున ననేకమంది కాశ్రయమిచ్చి రక్షించుట మఱువలేదు. దీను లన్నచో దళితు లన్నచో దీక్షితులకుండిన యనుకంప యసామాన్యము. శివప్పనాయకుడు తంజావూరు మండలేశ్వరుడగుటకు గోవిందదీక్షితులే కారణ మనవచ్చును,

శివప్ప తండ్రి తిమ్మప్పనాయకుడు కృష్ణరాయల కాలమున నంతఃపురమున నడపము బట్టువాడుగా నుండెను. రాయల కాతడన్నచో గొప్ప యభిమానము. తిమ్మప్పనాయకుడు రాయచూరి యుద్ధమున కత్తిబట్టిపోయెను. ఆతడా యుద్ధముననే మరణించెను. తండ్రి చచ్చునాటికి శివప్పకు నాలుగేండ్ల వయస్సు. ఆతని తండ్రి కిర్వురు కుమారులు. శివప్ప పెద్దవాడు. రెండవవాడు చిన్నమల్లప్ప. రంగాజమ్మ యను బిడ్డ గూడ నుండెను. వీరందరి పోషణము జరుగుటెట్లు? ఆమె విజయనగరమందే యొక శ్రీమంతుల

యింటిలో పనికిఁ గుదురుకొన్నది. ఆమెయును గొంతకాల మునకుఁ జచ్చెను. సంసారభారము శివప్పపైఁ బడినది. ఆ సమయమున గోవిందదీక్షితులు వానికి సహాయపడిరి. తమ పలుకుబడితో శివప్పకు "ఆరెము నెలో" నడపమువృత్తి గల్పిం చినారు. క్రమక్రమముగా శివప్పనాయకుఁడు ధైర్యసాహస ములు బ్రదర్శించుచు వచ్చెను. వాని స్వామినిష్ఠ యచ్యుత రాయల మనస్సున కెక్కినది. శివప్ప సైన్యమున దళ వాయియైనాఁడు. ఆతని ముఖముపై రాజతేజస్సుండెను. వాని కన్నులలోఁ బౌరుషము దొలుకాడుచుండెను. ఆ దేహ మునిండ యౌవనము-శౌర్యము, ఎక్కడఁజూచినను వాని పొగడ్తలు మేలుమీరినవి. దైవము గలసివచ్చునపుడట్లే యౌను. మూర్తిమాంబ వానిని గూర్చిన కథలు విన్నది. ఆ సొబగుని రూపమును గన్నది. ఆమె వానిపై మనస్సు నిల్పెను. మూర్తిమాంబ యచ్యుతరాయల మఱదలు.

శివప్పనాయకుని యున్నత కులము, హృదయ గాంభీ ర్యము మహారాజు మనస్సును ముందేలోగొన్నవి. వాని ధైర్య సాహసములు సామ్రాజ్య క్షేమమునకు నెక్కువగ వినియోగ పడవలెనని యాతఁడెంచెను. అచ్యుతరాయలకు మూర్తిమాంబ ప్రేమోదంతము తెలిసినది.

అతఁడు వారి వివాహమును శాస్త్రోక్తముగ నెఱ

వేర్చినాఁడు. శివప్పనాయకునకు గ్రొత్తగ స్థాపింప బడిన తంజావూరి "మండలేశ్వర" పదవి ననుగ్రహించెను. అది యంతకుముందు చోళులది. చోళరాజు సామ్రాజ్యముపై దిరుగ బడినాఁడు. అందుచే నచ్యుతుఁ డాతని పదవి నుండి తొలఁగించి శివప్పను మండలేశ్వరుఁడుగ నొనరించెను. తానీ పదవికి వచ్చుటకు గారణమైన దీక్షితులను శివప్ప మఱువ లేదు. తాను మండలేశ్వరుఁడైననాడే శివప్ప గోవిందదీక్షితుల యింటికి నడచి వచ్చినాఁడు.

" స్వామీ! నేను మీరొనర్చిన బొమ్మను. మంటి ముద్దయైన నాకుఁ బ్రాణప్రతిష్ఠ యొనర్చితిరి. ఇంత వానిని జేసితిరి. ఈ రాజ్యము, కోశము మీ యనుగ్రహ ఫలమే. వీనిని మీరు స్వీకరింప వలెను. "

ఛత్రచామరములు, ముద్రాంగుళీయకము, కిరీట రాజదండములు దీక్షితుల యెదుటనుంచి శివప్ప నమస్కరించెను

భావోద్రేకముతో దీక్షితుల కంఠము గద్గద మైనది. వాని నాతఁడు లేవనెత్తి శరీరమంతయు దడవినాఁడు. "శివప్పా! నీవు నాయందుంచిన సద్భావమునకు నే నెట్లు కృతజ్ఞత దెలుప వలెనో తెలియుటలేదు. నీ వీ స్థితికి వచ్చుటకు నీ స్వామి నిష్ఠ కారణము. నిన్ను రక్షించు శక్తి యదే. ఈ మండలేశ్వరత్వము మా యనుగ్రహ మనకుము నీ యోగ్యతకుఁ దగిన పురస్కృతి యనుట మంచిది. దైవానుగ్రహమున

దొరకిన భాగ్యవిశేషము. దైవ మనుగ్రహించిన నూత్న పదవిని స్వీకరించి అచ్యుతరాయలు నీయందుంచికొన్న నమ్మకమును సార్థక పఱచికొమ్ము. న్యాయము – సత్యనిష్ఠ యివి నీ యంగబలమై ప్రజా వాత్సల్యమును సంపాదించు కొమ్ము. ఇంతకంటెను గొప్పకీర్తికి నీవు పాత్రుడవు గావలెను. అని దీవించినాఁడు.

“ స్వామీ! మీరు నన్ను చేపట్టకున్నచో నాకీ స్థితి వచ్చి యుండెడిదిగాదు. మీ వంటి మహాత్ములను గురువులుగఁ బడసిన నేను ధన్యుఁడను. మీరన్యథా భావించక నా యొక్క కోర్కెను నెఱవేర్చవలెను ”

“ ఏ మది? ”

“ మిమ్మిక్కడ నేనవదలి వెళ్లుటకు నాకుమనసొప్పలేదు. తమరు దయచేసి నా వెంట రావలెను. మీరు లేని నా జీవనము లేదు. జీవితోత్సాహమును లేదు. మీరు నాకు మిత్రులై గురువులై, హితైషులై నిలిచి మార్గదర్శకులు గావలెను. తమరు నా వెంట తంజాపురికి దయచేసి యమాత్య పీఠము నలంకరింపవలెను. ” అని వేడు కొన్నాఁడు.

“ తమకధికారము గాబట్టదనియు సద్భావ మొక్కటియే చాలు” ననియు దీక్షితు లెంతయో చెప్పిరి. కాని శివప్ప

వినలేదు. వాని దాక్షిణ్యమునకు కట్టుబడక తప్పలేదు. గోవింద దీక్షితులు తంజాపురికి ప్రయాణించిరి. అమాత్య పదవిని చేపట్టిరి.

శివప్ప తాను బ్రతికినంతకాలమును గోవిందదీక్షితులకు విధేయుఁడై మెలఁగెను. అచ్యుత దేవరాయల హితైషియు నై యుండెను. ఆతని కచ్యుతరాయలు "కర్ణాటకసింహాసన కార్యధురంధర" అను బిరుదమును నొసఁగెను. శివప్ప తన ప్రజలను తండ్రివలె రక్షించెను. దైవము వలె కాపాడెను. తల్లివలె నుపచరించెను. భార్యవలె ప్రీతిజూపెను. వాఁడు తన పేరుతో 'శివగంగ' కోటను కట్టించినాఁడు, తంజాపూరి చెఱువును చక్కజేయించెను. నేటికిని గూడ నా చెఱువున్నది.

వాఁడరుణాచల దేవాలయము నకు గోపురమును నిర్మించినాఁడు. కంచి, వృద్ధాచలము, తిరుపతి, శ్రీశైలము మొదలగు దేవాలయములకుఁ బ్రాకార గోపురములను నిర్మించెను. అతఁడత్యంత సహిష్ణువు ఆ రాజ్యమున నన్ని జాతులును సుఖముగఁ బ్రదికెను. క్రైస్తవులును నివసించిరి, ఇంతలో శివప్ప మరణించినాఁడు. అచ్యుతప్ప నాయకుఁడు రాజయ్యెను వానికి తండ్రిమార్గమే యనుసరణీయమైనది, గోవిందదీక్షితులనే యమాత్యులుగ నిర్ణయించి కొన్నాఁడు. అచ్యుతప్ప నాయకుఁడు గూడ ప్రజలకు పరమ బంధువు. ప్రజలపై దన

కున్న విశ్వాసమును దేల్చి చూచుకొన వలసిన సన్నివేశ మొక్కటి యీ నాడు గల్గినది. మంత్రాలోచనకు రఘునాథ రాయనిను, గోవిందదీక్షితులను అచ్యుతప్ప యంతిపురికి బిలిపించుకొన్నాఁడు.



# 3

ఆమె వానికిఁ దగిన భార్య. అవిడ వానికి దొఱకుట యదృష్టమని కొందఱనుచుండిరి. చక్కని రూపము. దానికిదగిన గుణసంపద. మఱేమి కావలెను? బంగారమునకుఁ దావి యబ్బినట్లున్నది. ఆమె తండ్రి "కోఁరూన్" నదీ తీరమున వసించు నొక జమీందారు. వాని యేకైక పుత్రి మంగమ్మ. తల్లిదండ్రులామెను చెప్పరానంత గారాబమునఁ బెంచిరి. ఆమెకు వివాహ మొనర్చుటకు వారు వెదుకని సంసారము లేదు. కొందరు వరులకు గుణమున్న రూపముండదు. రూపమున్న బుద్ధి యుండదు. ఇవి యన్నియు నమరి యున్నచో ధనముండదు. ఆ బిడ్డ కవి యన్నియు నున్నవి. అట్టివాఁడే వరుఁడు గావలెనని వారు కట్టిన యూరంతయు వెదకినారు. కడకు చిన్నప్పనాయకుఁడు దొఱకెను. వారి దాంపత్యము పూవును తావియు వలె నదికినది. అనుభవింప దగిన యెల్లసుఖములను వారనుభవించిరి. వారికి నిత్య సంతృప్తి కాని యిది జీవలక్షణము గాదు. జీవున కేదో యొక యసంతృప్తి నొసఁగనిది - పరమేశ్వరుని క్రీడ ఫలింపదు. వారికి

గూడ తృప్తి యేర్పడినది. కాలమెంత గడచినను వారికి సంతానమేగా లేదు. చిన్నప్ప నాయకుని తండ్రి వరదప్ప నాయకుఁడు. తల్లి కల్యాణమ్మ. ఈ దంపతులకు వాఁడొక్కఁడే కుమారుఁడు. రామిసెట్టికి భాగ్యమ్మకు మంగమ్మ యొక్కతెయే కుమార్తె యంటిమిగదా! ఈ రెండు వంశములును వారి సంతానమునకై వేయికన్నులతో గని పెట్టుకొని యుండెను. పుత్రి భాగ్యమునకై వారు చేయని దాన ధర్మములు లేవు. చూడని పుణ్యక్షేత్రములు లేవు. కన్న దేవతలందరి కాళ్లపైఁ బడినారు. చెప్పిన వ్రతము లన్నియుఁ జేసినారు. కొడుకో- కూతురో- ఎవరో యొక నసుగు గలిగినచో నా శిశువెత్తు బంగార మొసఁగుదుమని తిరుపతి వెంకటేశ్వరునకు మొక్కుకొనిరి. మధుర మీనాక్షికి రత్నజటిలమగు కిరీటమును జేయింతుమనియు బ్రార్థించినారు. కాని వారి కోర్కె యీడేరలేదు. మంగమ్మ కాపురమునకు వచ్చి యాఁరేండ్లయినది. ఈ జన్మమున సంతాన భాగ్యము లేదని యామె నిశ్చయించి కొన్నది. కల్యాణమ్మకున్న సమయమంతయు గోడలి నోదార్చుటకే సరిపోవుచుండెను. "మీకు తెలియదత్తా! ఈ జన్మమున కా యోగములేదు. ఉన్నచో నొకసంతానమైన! ఇన్నేండ్లు గాచికోవలెనా! ఇంతకు ఆ పుణ్యము నేను చేయలేదు. మీకుమారుని చేయివట్టి మీకు గలిగించిన

నిరాశను దలఁచి కొన్నచో నా గుండె చెఱువైపోవును. నేను నిర్భాగ్యురాలను."

ఆమె చెఱఁగుతోఁ దన కన్నీరు దుడుచుకొన్నది. "బిడ్డా! నీవిట్టి యమంగళపు మాట లనరాదు. ఇంతలో మించిపోయిన దేమున్నది? ఇకమీఁద గలుగ వచ్చును. సంతానమయ్యెడు వయస్సింకను మీరిపోలేదు గదా! దైవ మొక్కసారి కన్నువిప్పి చూచినచో నెంతసేపు గావలెను? మన యిల్లంతయు చిన్న పిల్లల చిఱునవ్వులతోఁ బుష్పింప వచ్చును. నీవు వృధాయోచన చేయకూడదు."

"ఆ పుణ్యము నేను తెచ్చికొనలేదు. ఇంత వఱకు నాయాశ యుండినది, కాని యీనడుమ నది మాయమైనది. నాదొక ప్రార్థన యున్నది. దానిని మీరంగీకరించినచో నామనస్సునకు శాంతి దొఱకును."

"ఏమిటది"? కల్యాణమ్మ తొందరగానడిగినది. "నాకీజన్మమున సంతాన యోగము లేదు. నాతో-నాతో మీవంశము నిలుచునట్లు కనుపించదు. కనుక దయచేసి మీరు నా కోర్కె నెఱవేర్చవలెను. మీ కుమారునికి వేఱు వివాహము చేయుఁడు. ఆ భాగ్యవంతురాలి పుణ్యమున నైనను మనయిల్లు నిలుచునేమోనని నాయాశ. మన యిల్లు నందగోకులమైనచో నాకదియే పదివేలు"

కల్యాణమ్మ కన్నులలో నీరు పొరలాడెను. బిడ్డా!

ఇకమీఁద నీ వెప్పుడు కూడ నిట్టి మాటలనకు, ఈ మాటలతో నా మనస్సునకు చాల బాధగలుగును. నా బాధను నీ వేమియు గమనించి నట్లు లేదు. ఇకమీఁదనైనను నీవిట్లు మాటలాడకు. ఇట్టి యాలోచనలును చేయరాదు సుమా"

అని కొంచెము కోపముగ బలికెను.

"నేనన్న మాటకు గోపము వచ్చెనా యేమి?"

"కోపము రాక మరేమగును? ఇటువంటి మాటలు వినుటకు నేను సిద్ధముగాలేను. నీవు నిశ్చింతగా నుండుము, నమ్మినవారిని దేవుడెన్నడును చెఱుపఁడు. మనము చేసిన దానధర్మములే మనలను రక్షించును. ఎల్లకాల మిట్లేయుండదు. నీతోనే యీ యింటిదీపము వెలిగి తీరవలెను. నామాట జూడు" కోడలి మనస్సును నొప్పించరాదని - ఈ మాటలన్నదే గాని - కల్యాణమ్మకు గూడ యీ చింతకద్దు.

ఆమె యెంత భావగోపనము చేసికొన్నను - దాచుటకసాధ్యమైన నిట్టూర్పుమాత్రము దాచికొనలేక పోయినది. అత్తగారి ముఖమును జూచినదే కోడలి వదనము ... దీపములేని యిల్లయినది. ఆమె నిట్టూర్చెను.

ఇంతలో కల్యాణమ్మ మనసులో నేదో మెఱుపు వలె మెదలాడెను. అదియొక స్ఫురణ. అట్టివాక్కు లంతశ్చేతన నుండి వచ్చును. అక్కడ తర్కము పనిచేయదు. ఆస్ఫురణ

బాలెంతకు వ్రిజ్ఞవంటిది. ఆమె వెంటనే యిట్లన్నది.

“ అమ్మాయీ! నీ కడుపున శిశూదయమగు దినము చాలదూరమున లేదని తోచుచున్నది. ”

ఇట్లని ఆమెను సమాధాన పఱచెను.

కొన్ని దినములు గడచినవి. గురువుల యాశీర్వాదము ఫలించెను. వైవాహుగ్రహము పాకమునకు వచ్చెను. రెండు వంశములను బహుకాలముగ నిరీక్షించుచు వచ్చిన యాశ నెఱవేరినది. మంగమ్మ ఆరు వర్షముల తర్వాత మొట్టమొదటి సారిగ గర్భమును ధరించినది. మూడు నాలుగు నెలలు వచ్చను – కల్యాణమ్మ ఈ విషయమును బయటికి పొక్కనివ్వలేదు. తరువాతనే యీ సుద్దిమంగమ్మ తల్లిదండ్రులకు తెలిసినది. ఆ దంపతులు సంతోషముతో స్వర్గము నంటిరి. వారప్పటి నుండియు బిడ్డను పిలుచుకొని వచ్చు సన్నాహమున నుండిరి. కాని ఆ విషయమంత సులభముగ తేలునట్లుగ లేదు. మంగమ్మ లేక లేక గర్భిణి యైనది. ఆమె బాలింత తనము తమ యింటిలోనే నడచిన బాగుండు నని యత్తమామల యభీష్టము. తమ కోడలికి రాజకుమారి వలె నుపచారములు జరుపవలెనని కల్యాణమ్మయాశ; ఆమెకు కోడలును – గూతురును నొక్కటెయే. తన యభిప్రాయము వరదప్పతో ననెను. అతని కంతకంటె గావలసిన దేమున్నది? చిన్నప్పనాయకుడు తల్లిదండ్రుల యభిప్రాయమును విన్నాడు

వానికిని మనసులో నదేకోర్కె. వాని కా పత్నిజీవన సర్వస్వము. ఆ ప్రేమవల్లి పూవు విడుచు కాలమందు. తాను దగ్గఱ నుండవలెనని వాని సంకల్పము. దానిని వాఁ డెవ్వరితోను జెప్పనులేదు. చెప్పకుండనులేదు. ఈ స్థితిలో వానికి దన తల్లిదండ్రుల నిశ్చయ మొక మహాభాగ్యముగఁ బరిణమించినది. కాని తమ యభిప్రాయమును స్పష్టముగ జెప్ప ధైర్యమెవ్వరికిని లేదు. మొదటి బాలెంతతనము పుట్టినింట సాగుట లోకాచారము. దాని నెట్లు కాదనుట? పైగా మంగమ్మకుఁ బుట్టినింటికి బోయిరావలెనను ఆశ - యెక్కడో అంతరాంతరములలోఁ గద్దు. ఆ కోర్కెను కళ్యాణమ్మ గమనించినది. పుట్టినిఁటికిఁ బోవలదని చెప్ప ధైర్య మత్తకు లేదు. కోడలి మనస్సు నొచ్చునేమోయని యామెభయము.

నెలలు క్రమముగ గడచినవి. సీమంతము మొదలైన శాస్త్రవిధులన్నియుఁ జెల్లినవి. బ్రాహ్మణులు - బ్రాహ్మణ ముత్తైదువులు - మంగమ్మ నాశీర్వదించిరి. భాగ్యమ్మ బిడ్డను బిలుచుకొని పోవుటకువచ్చినది. వచ్చి మూఁడురోజు లయ్యెను. ఆమె యెన్నిసారులో అడిగెను. అత్త మామ లౌననలేదు. కాదనలేదు. తన బిడ్డను తప్పక పిలుచుకొని పోవలెనని భాగ్యమ్మ పట్టు బట్టినది. ఆమె కోర్కెను దిరస్కరించుట న్యాయము గాదు. వరదప్ప నాయకుఁడు కోడలిని పుట్టినింటికి బంపుటకే నిశ్చయించెను. భార్యను పుట్టినింటిలో విడిచి

వచ్చు భారము చిన్నప్పనాయకుఁడే వహించినాఁడు. ఆమె వెంట నాయుడును బ్రయాణ మయ్యెను. వాని యుత్సాహమునకు మేరలేదు. ప్రయాణము సుకరముగ నుండుటకుఁ గావలసిన యన్ని యేర్పాటులను వాఁడు జాగ్రత్త జేసెను. ఆ కాలమున దూర ప్రయాణములు మేనాలపై సాగుచుండెను. మేనాలు మోసికొను వచ్చుటకు వాఁడు రెండు మూఁడు గుంపులను దయారుచేసినాఁడు. ప్రయాణములోఁ గావలసిన వస్తువులను మోసికొని పోవుటకు కొందరు సేవకులు సిద్ధమైరి. వారి రక్షణకు శస్త్రములు ధరించిన గుఱ్ఱపు దళము. చిన్నప్ప నాయకుఁడొక జాత్యశ్వముపై నెక్కినాఁడు ప్రయాణ మారంభ మైనది.

మంగమ్మ పుట్టినిల్లు హరగోవింద పురము. ఆ యూరు కోలరూన్ నది గటుననే యున్నది. అది వారికి వంశ పారంపర్యముగ సంక్రమించిన జమీను. పూర్వము అచ్యుతరాయులకుఁ బాండ్య - చోళ - రాజులతోఁ బోరాట మేర్పడినది. అప్పుడు రామిసెట్టి ముత్తాతలు విజయనగర రాజులకుఁ బదార్థములు సరఫరా చేసి సాయపడిరి. ఆ యుపకారమునకై వారి కా గ్రామము మాన్యము వెట్టిరి.

ఈ గ్రామమునకు వచ్చుటకు నడుమ నొక పెద్దయడవి దాటవలసి యుండెను. ఈ యడవిని బయనించుట కొంత యపాయకరమే. జనులా దారిన వచ్చుటకు భయపడు చుండిరి.

ఆ భయమునకు మూడు కారణములు.

ముఖ్య కారణము సోలగప్పనాయకుని భీతి. వాఁడా ప్రాంత మంతటికిని నరరూప రాక్షసుఁడు. వాని పేరన్నచో శిశువులు గూడ బెదరుచుండిరి. వీఁడు పోర్చుగీసులకు హితుడు జంజిక్రిష్ణప్ప నాయకుని యధికారమునకు లోఁబడిన యొక చిన్న పాళెగాఁడు. కృష్ణప్పనాయకునికి-పోర్చుగీసు వారికి బెదరి వానిపై నెవ్వరును చేయి జేసికొనకుండిరి.

సోలగుఁడు 'కోలరూన్' నదీ ముఖమునందున్న దేవ కోటలో నివసించు చుండెను. అదొక ద్వీపము. వాఁడా కొండపై నొక పెద్ద కోట గట్టెను. ఆ కోటలో వాని యంతఃపురము. దానిలో నేమి జరిగినను ఎవ్వరికిని దెలియదు. వాని దుష్కార్యములకా యంతఃపుర మనుకూలముగ నుండెను. ఆ కోట చాల బలిష్ఠమైనది. ఈగ గూడ లోనికి ప్రవేశించుటకు వీలులేదు. జనలీ కోటను దేరిచూడను గూడ వెఱచుచుండిరి.

వాని కా ప్రాంతములలో నెదురులేదు. సుమారు ముప్పదేండ్లనుండి వాని దుష్కృత్యములు నిరాటంకముగ సాగుచుండెను. వయసు చెల్లినను ఇప్పటికిని వాఁడు దుష్కృత్యములు మానలేదు. వాడు మానభంగము లొనర్చిన స్త్రీలకు లెక్కలేదు. చంపిన నిరపరాధు లెందరో!

వాని హృదయమున దయకు చోటులేదు. మానవత్వము లవ లేశమును లేదు, వాని రూపము గూడ రాక్షసుని వలెనే యుండెను. పొడవైన దేహము. కసరత్తుతో ఇనుప గుదియల వలెనున్న కాళ్లు - చేతులు; ముఖమున గొట్టవచ్చిన కార్శ్యము - మొగముపై పెద్దరక్తపు బొట్టు. వాని కన్నులు రక్తమును జిమ్ముచుండెను. వాడు భైరాగి వస్త్రములు ధరించును. చేతిలో నొక దండము. దాని పిడి పాము పడగ వలెనుండును. ఆ దండములో నెవ్వరికి నొక విషపూరితమగు కటారి యుండును. వాడు బయటికి వెళ్లినచో వెంట వేట కుక్కలు. వేటకుక్కలవంటి మనుష్యులు.

సోలగుని పరివారములో - చాలమంది జాతిచెడిన హిందువులు. వారు క్రైస్తవులై యుండిరి. వాడు వారి నేమియు ననడు. పోర్చుగీసువారితో ద్వేషము వచ్చునని వాని భయము. కాని—వాడు మాత్రము హిందువుగనే యుండెను. సోలగుడు భైరవోపాసకుడు. చైత్ర శుద్ధ పున్నమనాడు వాడు నరబలి యొసగుచుండెను. ఆ నాటికి వాడొక గర్భిణీ స్త్రీని వెదకి తెచ్చెడివాడు. వాడిట్లెందరు గర్భిణీస్త్రీలనో తెగటార్చెను.

సోలగుని కనేకులు శత్రువులుండిరి. వారిచేత చిక్కకుండుటకే వాడా కోటను గట్టెను. ఆ కోట చుట్టను నీరు, పిదప భయంకరమైన యడవి. ఆ తోవల వానికే చక్కగా

తెలియును. కోటను వాఁడు కొండపై గట్టెనఁటేమి. యంతయు నొక్కటే శిలయైన పెద్దగుట్ట. దానిపై గడ్డిగూడ మొలచుటకు వీలు లేదు. వాని యంతఃపురము దారి నెఱుగుట మహా కష్టము. ఆ యంతఃపురము చిన్నదైనను దానిలో నన్ని సౌకర్యములుండెను. దాని యుగ్రాణమున భయంకరములైన మారణాయుధములు. కొండపై నొక చెలమ యున్నది. దానిలో నిరంతరము నీ రూరుచుండును. దాని నీరు సమీపములోని భైరవ సరస్సులోనికి వదలుచుండిరి. ఈ సరస్సున్నది యంతఃపురమునకు వెనుకవైపు. దాని దగ్గరనే భైరవాలయము. అంతఃపురములో నుండి యే దానికి దారికద్దు. ప్రతిదిన మొక్క పూజారి యా భైరవునకు పూజచేసిపోవును. విశేషదినములలో మాత్రము సోలగుండే పూజ సేయును. నరబలి యక్కడే సాగును. భైరవ సరస్సును గూర్చి మరి యొక విశేషము గూడ నున్నది. ఆ సరస్సునకు 'బైరేనికొల' ననియు పేరు. బైరేని కొలనులో నీరు నిరంతర ముండును. దానినిండ మదించిన మొసళ్ళు. వానిని సోలగుండే సాకెను. మొసళ్లకు వేయు దుర్మాంసముతో నీరు కంపుగొట్టుచుండెను మొసళ్లప్పుడప్పుడు కలహించుచుండెడివి. అప్పటి యాధ్వనితో నా కొలను మరింత భీతావహముగ నుండెడిది. తన్ను దిరస్కరించిన స్త్రీని వాఁడా కొలనిలో బడద్రోయును. విరోధించిన పురుషులకు గూడాన దేగతి. దానిలోని మొసళ్లా నిర్భాగ్యు

లను ప్రాణములతో నుండగనే జీల్చుకొని తినును ఇట్టి దృశ్యములను జూచుటలో సోలఁగుని యుత్సాహము విపరీతము. వానిచేతికి జిక్కినవారు బ్రతికినదియే లేదు.

సోలగుఁడు కామాంధుఁడు. దురాచారి దుర్వ్యసని. వాని కన్నులెప్పుడును మద్యపు మత్తుతో - గంకేళీ గుచ్ఛములవలెనుండును, దినదినము వాని దినెడి మాఁసమునకు మితి లేదు. ఒకప్పుడెవ్వఁడో బ్రాహ్మణుఁడు వానిని తిరస్కరించెను, అతనితో వాఁడు గో మాంసమును దినిపించెను. మరి కొందరు విప్రులు దిరస్కరించిరి. వాఁడు వారి చర్మము లొలిపించెను. వారిపై నుప్పునీరును జల్లించి కడకు మొసళ్ళకాహారముగ వేసినాఁడు అందగత్తెయైన యాడుది వాని కంటబడరాదు, వాఁడు వారినెత్తికొని పోయి బంధించుచుండెను. బంధించుట యనగా - వాని కామమునకు బలియగుట. సమ్మతింపని వారికి బైరేని కొలను తప్పదు. స్తన్యపాన మొనర్చెడి బిడ్డల నాతఁడు తల్లుల యెదుటనే నఱికెను. మరొక్క తల్లి యెదుటనే కుమారుని గానుగలోఁ ద్రిప్పించెను. పిల్లలను పైకెగురవేసి చంపుట యన్నచో - వాని కెంతో యిష్టము.

ఉన్నట్లుండి వాఁడు పల్లెలపైఁబడును. చేతికి దొఱికిన వస్తువును దొంగలించికొని పోవును. నూర్లకొలది స్త్రీలను చెఱదీసికొని పోవును. పల్లెవారు పల్లు గదిపినచో - చావు తప్పదు. జనమేమి చేయును? వారు నిస్సహాయులు. కాని

బాధలన్నియు మౌనముగ సహించుచుండిరి. జనులు జింజి కృష్ణప్పనాయకునికి మొఱపెట్టికొన్నారు. వాఁడు వానిని దండింపలేదు. తమమైత్రి చెడునని వాని భయము. జనులంతతో నూరకుండలేదు. వారు - అళియరామరాయలకు విన్నవించికొనిరి. దేవకోట యతని సామ్రాజ్యము లోనిదే. రామరాయలు తన దళవాయియైన రామరాయవిఠ్ఠలుని వానిపైకంపెను. సోలఁగుఁ డాతనికి జిక్కలేదు. ఎచ్చటనో దాగికొనెను. వాని కోటను రామరాయవిఠ్ఠలుఁడు పట్టుకొన్నాఁడు. అతఁడా కోట నాశ మొనర్చెను. కాని విఠ్ఠలుఁడు వెనుదిరుగుటయే తడవు ; సోలగుఁడు 'దేవకోట' జేరుకొనెను. కోటను మరమ్మతు చేయించినాఁడు. ఈ సారి వాఁడు రెండింతలు విజృంభించెను. పల్లెలు మల్లెపట్టిన చేలైనవి.

వీని చేతికి మంగమ్మ - చిక్కప్పనాయకులు దొఱకిరి. వారి దుర్విధి వారినక్కడ కీడ్చికొని వచ్చినది. వీరు ప్రయాణమొనర్చెడి సమయమున సోలగుఁడా పైపుల వేటాడుచుండెను. వారి వస్తువుల నన్నిటి నా క్రూరాత్ముఁడు చూఱగొన్నాఁడు. ఆశ్రితులలో గొందరిని వాఁడుచంపెను. కొందరు ప్రాణభీతితోఁ బరువెత్తిరి. వరదప్పనాయకునికి దన కొడుకును - గోడలు - సోలగునికి జిక్కిరన్న వార్త దెలిసినది. వాని ప్రాణము పై కెగిరిపోయినది. కల్యాణమ్మ మంచము

పట్టెను.

ఈ దుష్టుని చేతికిఁ దనకొడుకు జిక్కినాఁడు. ఇక తన వంశము నిలుచుట కుండేటికొమ్మ. అయ్యో! దైవమా! ముసలి తనమున నా కెట్టి కష్టము గల్గించితివి? వరదప్ప యొక్క ఈ యేఁడుపు. ఏమి చేయుటకు నెవ్వరికిని దోచలేదు. వరదప్ప ప్రభువుతోఁ బోయి మొఱపెట్టికొనెను. అచ్యుతప్ప నాయకుఁడు ధర్మవత్సలుఁడు, అతఁడే తన కష్టమును నీడేర్చుటకు దగిన వాఁడని యాతని విశ్వాసము. వరదప్పసెట్టి నివాసము తంజావూరే! అతఁడు వర్తకులలో శ్రేష్ఠుఁడు. రత్నముల వ్యాపారము మొదలుకొని – ఏలకులు మొదలైన వాసనా ద్రవ్యముల వ్యాపారము వరకు నాతఁడు సాగించుచుండెను. విదేశములతో గూడ నాతనికి వ్యాపారముండెను. డచ్చివారు – పోర్చుగీసులు – ఫ్రెంచివారు ఒక్కరేమి? అందఱితోను వరదప్పకు లావాదేవీలుండినవి. అతనిపై విదేశ వ్యాపారులకు మోసము చేయఁడను నమ్మకము. వరదప్ప కొట్లు 'నాగపట్టణము'న నుండెను. 'జాఫ్నా'లో నుండెను, 'మలాకా' – 'మస్కట్టు'లలో నుండెను, 'మంగళూరు' 'బిదనూరు' 'పెనుగొండ'లలో గూడ నుండెడివి. దేశీయ వర్తకులతో నాతని స్నేహసంబంధము లెంతో గాఢముగా నుండెను. అతఁడు విదేశీయులకు వాసనా ద్రవ్యములు, బియ్యము, పట్టు, సింహళపు ముత్యములు, గోల్కొండ

వజ్రికరూరు వజ్రముల నమ్ముచుండెను. వారినుండి పెట్లుప్పు వెల్వెట్-అద్దములు- గజ్జములు మొదలగునవి కొనెడివాఁడు. వానిని లాభముతో నమ్ముచుండెను. వ్యాపారమున నాతఁ డెక్కువ ధనమును సంపాదించెను. కాని-వరదప్ప గర్వము నెఱుఁగఁడు. అతని జీవనము చాల సరళమైనది. తన యౌదార్యముతో నాతఁడందఱకుఁ గావలసిన వాఁడైనాఁడు. జనులందరాతనిని వరదప్పనాయకుఁ డని పిలుచుచుండిరి. ఆ నాఁడది గౌరవవాచకము.

"ప్రభూ ! నాకు సర్వనాశమైనది. బ్రదుకుటకు గూడ మనసొప్పలేదు. నా జన్మఫలమైన కుమారుడుఁ లేనిది నేనింక బ్రదికి-మూటకట్టున దేమికలదు ?. లేక లేక యొక కొడుకు గలిగెను. వానిని - ఈనగాచి నక్కలపాలు జేసినట్లైనది. అయ్యో ! యీ శివుఁడు నాకెంత ద్రోహము చేసెను? పండబారినకాయ సిద్ధముగ నుండగా - కసుగాయ గోయ నుంకించెను. అయ్యో ! శివా ! నీవేల యింత నిర్దయుఁడ వైతివేల"! వరదప్పశెట్టి తలబాదుకొన మొదలు పెట్టెను. "వరదయ్యా ! గడచిపోయిన దుర్ఘటనకై యేడ్చుచు గూర్చున్న లాభ మేమి ? నీవు సమాధాన పడవలెను. నీ కొడుకు రసాతలములోనున్నను - వెదకించి తెప్పించు భార ము నాది. నీ కోడలిని గూడ విడిపించి తెప్పింతును. నీచుఁడైన యాసోలగుఁడు - వాని నెచ్చట

దాసినో - మొదట పత్రాదీయవలెను. వారిని విడిపించు దారి మరల నాలోచింతము. ఇఁక కాలము వ్యర్థము చేయ రాదు. నాశక్తి కొలఁది బ్రియత్నింతును . ఆ పైని దైవేచ్ఛ !. ”

ఆ సమయమున గోవిందదీక్షితులును - రఘునాథుఁడును - అరుదెంచిరి.

“ అప్పాజీ! మమ్ములను వెంటనే బిలిచికొని రమ్మని యాజ్ఞ యయ్యెను. మేము తీర్పఁదగిన కార్యమేదో సెలవిండు . ”

అవనత మస్తకుఁడైన రాజాతని శాసనము జూపించెను. అతఁడు తలవంచికొనియే యిట్లన్నాఁడు.

“ గోవిందదీక్షితుల వారు రాలేదా ! ”

“ చిత్తము ప్రభూ ! వచ్చి యున్నారు.

అచ్యుతప్ప తల పైకెత్తి చూచెను. ఆతని యాజ్ఞతో గోవిందదీక్షితు లాసనముపై నుపవిష్టులైనారు. వరదప్ప యమాత్యులకు నమస్కరించి - గోడుమని యేడ్చెను. ఆ యేడ్పుతో - మహామంత్రులు చకితులైరి. రఘునాథున కీ సన్నివేశ మేమియు నర్థముగా లేదు. అచ్యుతప్పనాయకుఁడు వరదయ్య నోదార్చి - జరిగిన వృత్తాంత మంతయు మహామంత్రులకు విన్పించినాడు. వరదప్ప నిట్టూర్పువిడిచి క్షణకాలము మౌనముగ గడపెను. తరువాత మంత్రిశేఖరులతో

నిట్లనెను.

" ప్రభూ ! కుమారుని మొగము జూచు మదృష్టమీ నిర్భాగ్యున కున్నదా లేదా! ఆ నరరాక్షసుని చేజిక్కిన నా కొడుకును కోడలును బ్రతికివచ్చుట సంభవమే గదా! అయ్యో ! నాకంతటి పుణ్యమే యున్నచో వారిట్లేల యగుదురు? దేవుఁడు మామీద నిర్దయుడైనాఁడు. మా యదృష్టము పూర్తిగ వక్రించినది. నాకింక బ్రదుకుపై నాస లేదు. కాని - చచ్చుటకు ముందు ఆ నీచుఁడైన పోలగునిపైఁ బగదీర్చి కొనవలెను. ఆ ద్రోహికి దగిన శిక్ష విధించిననే నాకుమారుని యాత్మశాంతిని బొందును. ఆ ప్రతీకారమునకే - నేనిక్కడికి వచ్చితిని. నా యాశ లన్నియు దగ్ధములై పోయినవి. నాకు గావలసిన దిప్పుడు ప్రతీకారమే.

వరదప్ప పకపక నవ్వెను. ఆ నవ్వు పిశాచపు నవ్వు. దానినిజూచి దీక్షితులు బెదరెను. దుఃఖముతో వానికి బిచ్చిపట్టినదని భావించినారు. వాఁడు నవ్వుచునే యుండెను.

—//o//—



కొంత తడవు ముగ్గురును మౌనముగ నుండిరి. పిదప నచ్యుతనాయకుఁడే సంభాషణ కారంభించెను.

" ఇప్పటి మన కర్తవ్యమేమో మహామాత్యులే నిర్ణయింపవలెను. వరదప్ప దుఃఖమునకు శిలలేడ్చుచున్నవి. వజ్రములు బగులుచున్నవి. మన రాజ్యము నందలి ప్రజల దుఃఖములను పరిహరింపక పోయినచో - ఈ శ్వేత ఛత్రరాజ దండములు విడంబనా మాత్రము.

" ప్రభూ ! ఇది చాల జటిలము - సూక్ష్మమైన సమస్య. మనము తొందరపడి యేమిచేసినను - సోదరుఁడు తనచేత జిక్కినవారి నిర్వురను బాధించును. చాల మెలఁకువతోఁ బనిచేయవలెను."

" నిజమే, మీనమేషములు లెక్కించుచు నూరక కూర్చున్నను - ఆ యపాయము జరుగవచ్చును. ఏదో ఒక నిశ్చయమునకు తొందరగ రావలెను. ఆ దంపతులను ప్రాణములతో విడిపింపవలెను."

అచ్యుతప్పనాయకని నిశ్చలమైన కన్నులు మఱింత

పెద్దవై నవి.

"ప్రజల దుఃఖమును నివారించుటలో – తమకున్న తొందర యెట్టిదో నే నెఱుఁగుదును. కన్న సంతానము కన్నను – ప్రజల నెక్కువ దయతో జూచితిరి. వారి దుఃఖముల బోగొట్టుటకు – ఎంతటి సాహసముల నైనను చేసితిరి. మీ హృదయమును నేను శంకించుటలేదు. కాని యీ విషయము చాల జటిలమైనదని మాత్రమే మనవిచేయు చున్నాను. జాగ్రత్తగా – చూచికొని యడుగు వేయవలెను."

"దీనిలో నంతగా విచారింపవలసిన యంశ మేము న్నది? కుమార రఘునాధునకు సైన్యముల దోడిచ్చినచో – నాతఁడుపోయి – సోలగుని వధించి – వారిని పిలుచుకొని వచ్చును."

"ఆ పని యంత సులభమైనచో – నేనింతగా నాలో చింపవలసిన పని యేమున్నది? సోలగుని వెనుక మరికొన్ని భూతము లాడుచున్నవి. వీనినేమి కదలించినను – అవి మనపైఁ బడును; వాడొక మ్రానిబొమ్మ. సూత్రముల నదలించు వారన్యులు.

"మా రాజ్యమునందలి ప్రజలను చెఱబట్టితివనియు– వారిని వెంటనే విడిచిపుచ్చవలెననియు – వానికొక సందేశము బంపుదము; దానిని తిరస్కరించినచో – దగడెత్తి పోవుదము."

దీక్షితులు క్షణ కాలము మౌనముగ నుండిరి.

" మన సందేశమును వాఁడు గౌరవించు నన్న యాశ నాకులేదు. సోలగుఁడు మన మనుకొన్నంత దుర్బలుఁడు కాఁడు. పోర్చుగీసులు వానికి వత్తాసి. జింజి కృష్ణప్ప నాయకుని వెన్నుబలము గూడ నున్నది. వాఁడు కృష్ణప్ప సామంతుఁడని మీకు దెలియును. మనము సోలగునిపైఁ బడినచో - కృష్ణప్ప తప్పక మనల నెదిరించితీరును. పోర్చుగీసులును వానితోఁ జేరుదురు. "

" మేము దీనికి భయపడుట లేదు. యుద్ధములలో జయమో మరణమో క్షత్రి జన్మమునకు నిర్దేశింపఁబడియే యున్నది. కాని - ప్రజల క్షేమమును నుపేక్షించుట న్యాయము గాదు. "

ఇంత వఱకును - వారిద్దరి సంభాషణమును వినుచున్న రఘునాధనాయకుఁ డన్నవి పై మాటలు అతని కనులు కెంపా మరల వన్నెను పుణికి పుచ్చికొని యుండెను.

" మీ యాత్మ విశ్వాసమునకు సంతోషము. కాని నేనిప్పుడు మాటాడుచున్నది జయాప జయములను గూర్చి గాదు. మన కార్యసాధనకు - అనఁగా - నా దంపతులను బ్రాణములతో విడిపించుటకు - ఈ దారి యుత్తమమైనది గాదనియే నా యభిప్రాయము. ఆ యిద్దరు దంపతులను మాత్రమే చెఱబట్టుకొని - సోలగుఁడు - తక్కిన వారిని

వదలి వేసెను. ఆ వదలివేయుటలో నేదో విశేషముండ లేదా? మహామంత్రులు ప్రశ్నార్థకముగఁ జూచిరి. ఆ చూపులలో చలించిన 'తిమ్మరుసు' తొంగిచూచి నటుండెను

"ఏమి విశేషమున్నది? ఆతనిచేతఁ జిక్కినది. పట్టుకొన్నాఁడు. తక్కిన యాదవవాదు వానికంటె నాకర్షింపక పో యుండవచ్చును." ఇది యచ్యుతప్ప మాట.

"కావచ్చును. కాని - యామె పూర్ణగర్భిణి యనుమాట మీఁదు మరచిపోవుచున్నారు. దానికితోడు వాఁడామె భర్తనుకూడ చెఱగొన్నాఁడు. ఇది నిష్కారణముగ జరిగెనందురా!" గోవిందదీక్షితు లనిరి.

"ఏమి విశేషముండును?"

"దానిని నేనిప్పుడు విడమర్చి చెప్పలేను. కాని - తప్పక యేదోకారణ ముండితీరును. గర్భిణియైన స్త్రీనివాఁడు చెఱవేసికొని పోయినాడన్నచో - కామేచ్ఛతో గాదనుట స్పష్టమే గాదా! వానియూహ మరియేదోయై యుండును.

"వాఁడు భైరవోపాసకుఁడనియును విన్నాము."

"అదే నేననబోవుచున్నది. చైత్రశుద్ధ పున్నమ సమీపించుచున్నది. ప్రతి వర్షము నాదినమున వాఁడు నరమేధమొనర్చునని - వార్తలు సపసపగా వచ్చినవి. వాఁడా

దుర్మార్గము చేయకముందే - మనము వారిని విడిపింపవలెను. చైత్రపూర్ణిమ యింకను నమారు రెండు నెలలున్నది. ఇంతలో మన మనుసరింపవలసిన దారి యేదని తొందరగ దేల్చికొనవలెను. ”

“ సావధానముగ గూర్చొని - యోచించుట కవకాశ మెక్కడ నున్నది ? వెంటనే కత్తిబట్టి కదనమునకు దిగవలెను. మన ప్రజలపై చేసిన యన్యాయము మనపై చేసిన ద్రోహమే, దీనిని మనమూరక జూచుచు గూర్చుండుటకు వీలులేదు. ఇంతయయ్యు మనమూరకయున్నచో - ప్రజలు మనలనెట్లు నమ్మెదరు? అప్పాజీ! నాకు మీయాజ్ఞ యొసంగవలెను. నేనిప్పుడే దండెత్తి పోదును. ఆ దేశకోటను నేలమట్టము జేసి - వానిని జీవగ్రాహముగఁ గొనితెచ్చి - తమ పాదములపైఁ బడవైతును. వానినట్లీడ్చి కొనిరాకున్నచో నాపేరు రఘునాథనాయకుఁడే గాదు. నాకు వీరతాంబూల మిప్పింపవలెను. ”

రఘునాథనాయకుని శరీర మావేశముతో - నఖశిఖపర్యంతము వణకి పోవుచుండెను; అతడు శరీరము ధరించిన గాండీవము వలెనున్నాడు.

“ కుమారా! మన మీధర్మసింహాసనముపైఁ గూర్చున్నది - ధర్మము నుద్ధరించుటకే. దుష్టశిక్షణ - శిష్టరక్షణ ఇవి మన ధర్మములు. అంత మాత్రమే గాదు. అవి మన

ప్రాణములును; ప్రజా క్షేమమును సమకూర్చుట కే సాహసమునకైనను మనము జంకము. జంకరాదు. ఆవిషయ మట్లుండనిమ్ము. కాని - మన ప్రజలకు గలిగిన విపత్తును బరిహరించుట కేది చక్కని మార్గమనియే యాలోచన. నేనూహించిన దానికంటెను - సోలగుని వృత్తాంతము - మరి కొంత జటిలముగా నున్నది. మనము మహా మంత్రుల రాజనీతిని మన్నింపవలెదు."

మహారాజులు దీక్షితుల ముఖముపై దృష్టి నెలకొల్పిరి ఆచూచుట-బృహస్పతివైపు దేవేంద్రుడు జూచిన చూపునకుం గొంత తక్కువ.

"ఇప్పటి పరిస్థితిలో నా దంపతుల రక్షించుమార్గ మొక్కటే గన్పించు చున్నది. సోలగుడు జింజి కృష్ణప్ప సామంతుడు. కృష్ణప్ప మీాకు వియ్యంకుడు. మనమతని సహాయ మపేక్షించినచో - సోలగుని చెఱజిక్కిన యా దంపతులను విడిపింప వచ్చును. రక్తపాతము లేకుండ మన కార్యమును సాధించి కొనవచ్చును."

దీక్షితులర్థయుక్తముగ మహారాజువైపు జూచినారు.

"మన మిప్పుడు కృష్ణప్పనాయకునకు సందేశ మంపవలెనన్న మాట."

"అవును ప్రభూ! ఆతనికి మనమొక పత్రము పంపినచో - నాతడు సోలగుని వశముననున్న దంపతులను

విడిపించి యిచ్చునని యాశ."

"ఆ ధైర్యము మాకు లేదు"

"ఎందుకు ?"

రఘునాథ నాయకునికి దనబిడ్డ నిచ్చి మనతో రక్త సంబంధము నేర్పరచికొన్నను — జింజి కృష్ణప్పకు మనపై విశ్వాసము లేదు. ఈ విషయము మీకు దెలిసిన దే. మరి మనకీ సందర్భమున నాతఁడు తోడుపడునా ? ఒక వేళ కృష్ణప్ప నాయకుఁడు జోక్యము గల్గించికొన్నను — సోలగుఁ డాతనిని మాత్రము లెక్కించునా ? "

"మీ సందేహము సమంజసమైన దే. కాని - యీ సందర్భమున కృష్ణప్ప మనకోర్కెను తిరస్కరింపలేడని నా యూహ. కుమార రఘునాథుఁడాతని కొనర్చిన యుపకారము ఈ జన్మమున మఱువరానిది. అతని కది యేమాత్రమైనను జ్ఞాపకమున్నచో — మనకోర్కెను తిరస్కరింపఁడు. ఇక సోలగుని విషయము — వాడు కృష్ణప్పనాయకుని మాటను మన్నించితీరును. సందేహము లేదు. వానికి ప్రధానమైన వెన్నుబలము — కృష్ణప్పయే. వాఁడు తానై పెద్ద బలవంతుఁడు గాడు. కృష్ణప్పతో విరోధము గట్టుకొన్నచో తన జీవనము సాగఁదని — తెలిసికొనలేనంతటి యవివేకియు గాడు. కృష్ణప్పనాయకుని యాజ్ఞ నాతఁడు తప్పక మన్నించును."

అచ్యుతప్ప నాయకుఁడు తల నక్షము ద్రిప్పుచు - నిట్లనెను.

" మనము కృష్ణప్పనాయకునకు జేసిన యుపకారము అతని మనస్సులో నున్నచో - నతఁడు మనపై కుట్ర లేల చేయును ? "

" అతఁడిప్పటికే మనవిరోధులైన మధురనాయకులతో చేతులు కలిపినాఁడు. ఇట్టిచో - నతఁడెట్లు మనకు దోడ్పడును ?

" మన యుపకారము నాతఁడు స్మరించినను - విడిచినను మన కోరికను దిరస్కరించునంతటి ధైర్య మాతనికి లేదు. మీరు సందేశ మంపినచో - నాతఁడు దానిని గౌరవించి తీరవలెను. గౌరవింపకున్నచో దాని పరిణామము మహా ఘోరముగ నుండును. " రఘునాథుఁ డౌనుగఁబలెచెను.

"కుమారా! అతఁడు దనకన్నము పెట్టిన విజయనగర సామ్రాజ్యమునకే ద్రోహము చేయఁబూనెను. ఇక మన లెక్కేమి? పైఁగా సర్వకాలము తంజావూరు రత్నసింహాసనమును నాశమొనర్చుటెట్లనియే వాని చింత. మన మాటకుఁ గృష్ణప్ప వెలయిచ్చునను నాశ నాకు లేదు. కాని మీ యిందరి కంగీకార్యమైనచో సందేశమంపుటకు నాకాక్షేపణ లేదు."

వాస్తవస్థితిగూడ నింతే. జింజి కృష్ణప్పకు రఘునాథుఁడు గొప్ప యుపకార మొనర్చెను. ఆయుపకార స్మరణముగ కృష్ణప్ప రఘునాథునకు కళావతీదేవి నిచ్చి వివాహమొనర్చినాడు. ఈరక్తసంబంధము తంజావూరిపై వారికున్న ద్వేషమునేమాత్రము తగ్గింపలేదు. దానికి గారణమిది: విజయనగర సామ్రాజ్యమప్పటికే బలహీనమై యుండినది. వారికి పెనుగొండ రాజధాని యయ్యెను. కాని తంజావూరు మాత్రము తన స్వామినిష్ఠను వదలుకొనలేదు. జింజి, మధుర నాయకులు విజయనగరసింహాసనమును బడగొట్టుటకు బ్రయత్నించుచుండిరి. అచ్యుతప్ప నాయకుని కూడగట్టుకొనుటకు వారు శతధా యత్నించిరి. అతఁడు వారి వాదము నంగీకరింపలేదు. వారి ద్వారు సామ్రాజ్యమునకు హితశత్రువులని యాతఁడు చక్రవర్తికి దెలిపెను. అంతటితో నూరకొనలేదు. సర్వదా సామ్రాజ్య గౌరవమును నిలుపుటకు ప్రయత్నించుచుండెను. ఈప్రవర్తన కృష్ణప్పకు సరిపోలేదు. తంజావూరి స్వామిభక్తి వారి కడుగడుగున నడ్డువచ్చుచుండెను. అందుచే వాఁడు తంజావూరు రాజ్యమునకే యెసరువెట్ట యత్నించినాడు.

విజయనగరసామ్రాజ్యముపై దమకున్న స్వామిభక్తిని
తన గూర్చి యొకసారి తండ్రికొడుకులమధ్య చర్చలు సాగెను.
గాఢ రఘునాథునకును విజయనగర సామ్రాజ్యముపై గౌరవము
మన్ని కద్దు. కాని దానిని నిల్పుటకై తండ్రి చేయుచున్న ప్రయ

త్నము ఫలించునన్న నమ్మక మాతనికి లేదు. "అప్పాజీ! విజయనగరసామ్రాజ్య గౌరవమును రక్షించుటకై మనము శక్తివంచనలేక ప్రయత్నించుచున్నాము. కాని దానిపై కాలమే కత్తిగట్టినది. సామ్రాజ్యమునకు విరుద్ధముగ పోరాడుచున్నవారు సామాన్యులు గారు. మధుర వీరప్పనాయకుడు, జింజి కృష్ణప్ప, జగ్గరాజు ఒక్కొక్కరును అసామాన్యులు ఇంతమంది కత్తిగట్టినప్పుడు మనమొక్కర మెంతకాలమని పోరాడగలము. విజయనగర వైభవమునకు ప్రకృతి మంగళము పాడబోవుచున్నది. అది దైవేచ్ఛ. వారు తమ యంతస్సత్త్వముతో సామ్రాజ్యమును నిల్పుకొనవలెనే గాని మన మెంత కాలమని సాయము చేయగలము." అని యనుచుండెను.

"మధుర రాజులు, జింజివారు బంధుద్రోహియైన జగ్గరాయనితో జేరి, సామ్రాజ్యమును తమలో దాము పంచుకొనుటకు జేయు ప్రయత్నములు చక్రవర్తి వెంకటపతి దేవరాయలకును దెలియును. కాని వెంకటపతిదేవరాయలున్నంతవఱకును వీరి యాటలు సాగవు. వారి యనంతరము దైవేచ్ఛ. మండలేశ్వరులలో ద్రోహబుద్ధి తలయెత్తిననాడే సామ్రాజ్యపతనమారంభమైనది. ఇంకెంతకాలము బ్రదుకునో చెప్పలేము. కాని మన నిష్ఠ మనది."

"అప్పాజీ! తాము నిరర్థకముగ గష్టపడుచున్నారు.

ఇప్పటికే సామ్రాజ్యమున గావలసినన్ని బలహీనతలు ప్రవేశించినవి. ఇక నెంత చేసినను అది నిలువలేదు.

అచ్యుతప్ప కన్నులు చెమ్మగిల్లినవి. "బిడ్డా! ఈ ప్రశ్న నీవు నన్ను వేయరాదు. వేసితివి గనుక స్పష్టముగ వివరించుచున్నాను. విజయనగర సామ్రాజ్యలక్ష్మి యెన్నఁడో తొలఁగిపోయినది. నాచిన్ననాట తళ్ళికోట యుద్ధము జరిగెను. ఆ యుద్ధమున రామరాయల శిరస్సుపై దురదృష్టము చిటినది. అతఁడు వీరుఁడై మరణించెను. తిరుమలరాయాదులు పెనుగొండకుఁ బారిరి. పెనుగొండలో నేమున్నది? సామ్రాజ్యపు నీలినీడలు. తళ్ళికోట రణమున, శాత్రవుల కత్తులకాంతులతో కనులుబైరులు గ్రమ్మిన రాజులు రాజధానిని రక్షించుకొనలేక దొంగలవలెఁ బరుగెత్తినారు. మానమున కన్న ప్రాణముతీపను క్రొత్తమంత్రము నేనాఁడు హిందూ రాజులు జపింపఁదొడఁగిరో - వారిఛత్రచ్ఛాయలపై నానాఁడే శని నవ్వినాఁడు. ఆ సామ్రాజ్యమును నుద్ధరింపఁ బ్రయత్నించుట - నీటిపై గోడలుగట్టుట. ఆనెగొంది ఇకమీద చరిత్రలో కుగ్రామమే. విజయనగరము ముసల్మానులధాటి కాహుతియైననాడే చక్రవర్తులపై ప్రజలకుగౌరవముపోయినది. వారిమాటలపై విశ్వాసము నశించినది; సామంతరాజులలో గూడ చక్రవర్తులపై గౌరవములేదు. సామ్రాజ్యము కట్టుకథయగుటకు చాలరోజులు లేదు. మాటి మాటికిని

పెనుగొండపై - ముసల్మానులు చేసెడు దాడులే దీనికి సాక్ష్యము. చాలనిదానికి - జింజి - మధుర సామంతులవంటి వారు తయారైనారు. చక్రవర్తి బంధువులలోనే ద్రోహులు పుట్టినారు. జగ్గరాయని వంటివారు. ఈ విషయము నే నెఱుఁగనిదికాదు. అందుకే - ఇప్పుడు మన సేవ సామ్రాజ్యమున కత్యావశ్యకమను చున్నాను. బిడ్డా! ఆ మన్ననబుట్టితిమి. ఆ చక్రవర్తులలో నొక మనుష్యులమైతిమి. వారి యుప్పుతిని పెరిగితిమి. వారాపదలో నున్నపుడు-మనము వెన్నుపోటు పొడువరాదు; ఆ సామ్రాజ్యము తయారుచేసిన బొమ్మలము. దానిలోనే బ్రతుకుదము. దానిలోనే నశింతము. సంపదలు వచ్చును - బోవును. ఒకసారి యార్జించికొన్న కళంకమును - వేయి శ్వేతచ్ఛత్రముల ధావళ్యములతోనైన నొకవంశము దుడిచివేసికొనజాలదు. హిందూ ధర్మసంస్కృతుల నుద్ధరించుటకు - విద్యారణ్యులవంటి మహాతపస్వి యీ సామ్రాజ్యమును నిర్మించిరి అది - హిందూ ధర్మమునకు ప్రతీకము. ఆ మహాదర్శములో - జయాప జయములు ముఖ్యములు గావు. దానిని నిలుప యత్నించుటే ముఖ్యము. చక్రవర్తి వెంకటపతి దేవరాయలు మనపై నపారమైన విశ్వాసముంచికొని యున్నారు. మనము వారిని మోసము యరాదు. ఇప్పటికో - వారికి మిగిలిన - నిజమైన

హితులము మనమొక్కరే.” అచ్యుతప్ప గోడమని యేడ్చెను. అంతే. ఇక రఘునాథుఁడెన్నఁడావిషయమై తండ్రితోఁ బ్రస్తావించలేదు. ఆపైన వాదించినచో – తండ్రి మనస్సు కష్టపడునని యాతఁడెఱుఁగును. వారి కయిష్టమైన విషయమును – మాటిమాటికెత్తుట రఘునాథున కిష్టములేదు.

గోవిందదీక్షితులును – అచ్యుతప్పతో నీవిషయమై యెన్నఁడును బ్రస్తావించలేదు. కట్టకడపటి మాటగా నాతఁడిటనెను.

ప్రభూ కృష్ణప్పనాయకుఁడు ఏన యుపకారమును జ్ఞాపకముంచికొన వచ్చును. లేకను పోవచ్చును. అది యతనికి జెందిన విషయము. ఉపకారమునకు ప్రత్యుపకారము లభించునని మన మాశింపరాదు. అందులోను – మనమాతని నుండి యే యుపకారమును గోరుటలేదు. ధర్మము నర్థించుచున్నామంతే! ప్రజాక్షేమవిచారణలో నాతని ధర్మమిట్లుండవలెనని సూచించుచున్నాము. నిష్కారణముగా మన ప్రజను పోలఁగుఁడెత్తికొని పోయినాఁడు. ఈవిషయమున యుద్ధముఁ గూడ దటస్థింపవచ్చును. యుద్ధమునకు మనము బెదరుటలేదు. జయాపజయములు దైవాయత్తములు. కాని సామంతరాజులే తమలోఁ దాము కలహించుకొనుచున్నచో శత్రువులా యవకాశమును వినియోగించుకొనవచ్చును. గోలకొండ వారీ సామ్రాజ్యముల నన్నిటిని గబళింపవచ్చును. ఈవిషయము

మనము కృష్ణప్పకు చక్కగా నొక్కి చెప్పవలెను. అట్లు చేయుటకు రఘునాథనాయకుఁడే తగినవాడు. అతడే జింజికి ప్రయాణము గావలెను. అతఁడు పోయినచో రాయబారము విఫలము గాదని నాయూహ. కృష్ణప్పనాయకునికి మీపై ద్రోహబుద్ధి యున్నను, రఘునాథుని యెదుట అతడంత కఠినముగా బ్రవర్తింపలేడు. కృష్ణప్పకు రఘునాథుడు చేసిన యుపకారము సామాన్యమైనదిగాదు." దీక్షితులు రఘునాథుని వైపు జూచిరి.

"మీకు నాసేవ యావశ్యకమైనచో సిద్ధముగ నున్నాను."

మఱుదినమే రఘునాథనాయకులు తన స్నేహితుఁడైన యజ్ఞనారాయణదీక్షితులను దోడుదీసికొని జింజికిఁ బ్రయాణమైనాఁడు.



వాస్తవమునకు జింజికృష్ణప్ప మానప్రాణములు రఘునాథనాయకుని కృపాకటాక్షమే. ఆనాడు రఘునాథుడు కృష్ణప్పకు సహాయమే చేయకున్నచో, ఈనాటికాతడు 'పెనుగొండ' కారాగారపు చీకటులలో మ్రగ్గియుండెడివాడే. రఘునాథనాయకుని యౌదార్యము ఆతనిని రక్షించినది.

విజయనగరసైన్యములు క్రీ॥శ। 1565 లో నడచిన తల్లికోట యుద్ధమున సంపూర్ణముగ నోడిపోయినవి. ఆయుద్ధమునందు రామరాయలను జంపినది పగవారి పౌరుషము గాదు. పుత్రతుల్యుడైన యొకానొకని విశ్వాసఘాతుకత్వము. విధియొక్క యొక వికటాట్టహాసము; శత్రువు లాతని శిరమును శూలమునకు గ్రుచ్చి పైకెత్తిరి. దానితో విజయనగర సైనికుల మనస్సులు కలగుండుపడినవి. చెట్టుకు నొకడుగా జారిరి. రామరాయల తమ్ముడు తిరుమలుడు వెనుదిరిగెను. అతఁడు తొందరగ విజయనగరమునకు వచ్చి రాజభండారమును దరలించికొని వెళ్ళినాడు. రాజబంధువులును ఆతనితోబాటు పరుగెత్తిరి. విజయనగరమునుండి 1550 ఏనుగులపై ముత్యములు, రత్నములు మొదలైన సంపత్తును తిరుమలరాయఁడు గైకొనిపోయెను. అతఁడు చంద్రగిరిలో కొంతకాలముఁ గడపెను. తరువాత పెనుగొండ చేరెను. విజయోన్నతులైన

బహమనీ సుల్తానులు విజయనగరమును సర్వనాశ మొనర్చిరి. చేతికి దొరకినది కొల్లగొనిరి. చాలనందుకు - సమీపారణ్యములలోని యాటవికులు - దోపిడులు సాగించిరి. తిర్మలునకు పెనుగొండఁ రాజధానియైనది; దూరమగుటచే సుల్తానులు మాటిమాటికిని దన్నపైఁబడుటకు వీలుండదని యాతని యాశ. అప్పటికి సదాశివుఁడింకను బ్రతికియేయుండెను. అతఁడు తుళువవంశములోని కడపటియంకురము. వీనిపేరిటనే రామరాయలు రాజ్యమేలినది. తిరుమలరాయఁడు రాజ్యమేలినదియు సదాశివుని పేరిటనే. పెనుగొండలో తిరుమలరాయలు 'జీర్ణకర్ణాటపునస్సృష్టి' యొనర్చినాఁడు. కాని యంతటితో శత్రువులదాడులు తప్పలేదు. తిరుమలరాయఁడు రాజ్యమేలినది చాల స్వల్పకాలమే. అతని కాలములో రెండు మూఁడు సారులు ముస్లిములు దండెత్తి వచ్చిరి. అతని తర్వాత సింహాసనమెక్కిన - శ్రీరంగదేవరాయుల కాలమందును వెంకటపతి దేవరాయుల కాలమందుగూడ - శత్రువులదాడులు తరచు - జరుగుచునే యుండెడివి. బీరారు - అహమ్మదునగర రాజ్యములు - మొగలుల చేతిలో జిక్కికొని - చావు బ్రిదుకులలో నుండెను. ఈ యవకాశమును వినియోగించికొని గోల్కొండ బిజాపురముల సుల్తానులు - రాజ్యవిస్తరణకు బూనుకొనిరి. అప్పుడప్పుడు పెనుగొండ వారిదాడులకెరయగు

చుండెను. చక్రవర్తులు వీరియుద్ధములతో సదమదమగు చున్నప్పు డాయవకాశమును వినియోగించికొని సామంతులు స్వతంత్రులగుటకు యత్నించిరి. వారిలో – మధుర జింజి నాయకులు ప్రముఖులు. తంజావూరు మాత్రము తనస్వామి భక్తిని వీడలేదు. దానిచే జింజిమధురనాయకుల యత్నములు సఫలములుగాలేదు. కాని – మధుర వీరప్ప – జింజికృష్ణప్పలు తాము స్వతంత్రులగుటకు గావించెడి ప్రయత్నములు మాన లేదు. కృష్ణప్పనాయకుఁడు క్రీ. శ. 1570 లో జింజి సింహాసన మెక్కెను. జింజిని పాలించిన రాజులందరికంటెను వీడత్యంత సమర్థుఁడు – సాహసి. స్వాతంత్ర్య ప్రియుఁడు. వీనికాలమున జింజికంతకు ముందులేని – ప్రాముఖ్యమేర్పడినది. ఆ కాల మున దానిని దర్శించిన పోర్చుగీసు ఫాదరీ 'పిమెంటో' జింజి హిందూదేశమునకు 'ట్రాయ్' పట్టణము వంటిదని వర్ణించెను. 'లిస్‌బన్' పట్టణమును విడిచినచో – జింజియంతటి గొప్ప పట్టణము పోర్చుగీసు దేశమున లేదని యతఁడే వ్రాసెను.

జింజి ప్రాచీన కాలమునుండియు ప్రసిద్ధమైన నగరము. విదేశవర్తకులకు ప్రధానవాణిజ్య కేంద్రము. దానికి మూఁడు ప్రధాన దుర్గములు. రాజగిరి - కృష్ణగిరి - చంద్రాయనము లని వానిపేరు. వీనిచుట్టును మరియొక బలిష్ఠమైనకోట. దాని వెడల్పు అరువదియడుగులు. ఎత్తు, ఎనుబదియడుగులు. అన్ని టికిని గడపట రాజగిరి దుర్గముండెను. ఇది లింగాకారమున

నుండెను. చుట్టు పట్టులనున్న పర్వతముల నన్నిటిని- యీ దుర్గము శిరస్సునెత్తి పర్యవేక్షించు చుండెను. కృష్ణప్ప నాయకుని యంతఃపురమున్న దీకోటలోనే. రాజభండారము గూడ. ఈ కోటలో ప్రకృతి దేవితళుకు టద్దమువంటి చెఱువు; ఆ నీరమెన్నఁడును దఱుగదు. రాజోద్యానమందలి కేళాకూళులకును — గజ తురగ శాలల కానీటినే వాడుచుండిరి. రాజాలయుగాృణమూ దుర్గముననే యుండెను. శస్త్రాగారము గూడ. స్త్రీల శస్త్రాగారము ప్రత్యేకము. గరిడీలు గూడ వారికి వేఱుగనుండెను. వానిలోఁ గొల్వునేయు మల్లురు స్త్రీలే. నాటిస్త్రీలు నాట్యవిద్యలలోనే గాదు. ధనుర్విద్యలో గూడ నందెవేసినవారు.

ఈ కోటకు జింజియను పేరువచ్చుట కొక కథయున్నది. ఇక్కడి యభిమానదేవత సంజీవమ్మ ఈమె సప్త మాతృకలలో నొక్కతెయట! సంజీవమ్మకు 'కమలకణ్ణి' యను నొక చెల్లెలుండెను. కమలకణ్ణికి మరియొకపేరు 'కమలాక్షి' నేటికిని సంజీవమ్మ ఆలయము; కమలకణ్ణి కోవెలయు -జింజిలో నున్నవి. ఈ దేవతల నుద్దేశించి - ప్రతి వర్షమును - పోతులను నఱకెడివారు. దీనికి సంకేతముగ దేవాలయము నందొక రాతిపై విల్లు - బాణము - దున్న, మరియొకవైపు దానితల మొదలైన శిల్పము లున్నవి. సంజీవమ్మ పేరిట మొదట నా కోటను 'శెంజి' యనిపిల్చిరి. క్రమక్రమముగ నది జింజియైనది.

మొదటి నుండియు జింజి గొప్ప యాత్రాస్థలమే. ఒకప్పుడాయూరి నిండ శిల్పులచెక్కి చిఱునవ్వీన దేవళిములు. నేడు వాని భగ్నావశేషములు, ఒక పాడువడిన వేంకట రమణుని యాలయమున్నది. దానియందెన్నో యపూర్వ శిల్పములుండెను. ఆ యాలయ స్తంభముల నిర్మాణ చాతుర్యమునకు — వెఱగుపడిన ఫ్రెంచివారు — వానిని పాండు చ్చేరికి సాగించిరి. అక్కడివారు నిలిపిన 'డూప్లే' విగ్రహము క్రింద అస్తిభారముగ నేటికిని యీ స్తంభములు గలవు. 'రాజగిరి' లో నున్న రఘునాథ దేవాలయమునకు గూడ నీదుర్గతి దప్పలేదు. ఆ కోవెలలో నేడు విగ్రహము లేదు. విజయనగర వాస్తుశిల్పము ననుసరించి చెక్కినయొక మండపము మాత్రమున్నది. అక్కడి స్తంభములను గూడ నింగ్లీషు వారు మద్రాసుకు సాగించిరి. ఇప్పుడక్కడ మిగిలినది కోట వేణుగోపాలస్వామి యాలయము మాత్రమే. ఈ యాలయమొక యపూర్వరచన. రుక్మిణీ సత్యభామ సమే తుండైన శ్రీ వేణుగోపాలస్వామి యా దేవుడు. జింజి సమీపమున 'సీతమ్మారు' లో నొక రాతిలో చెక్కబడిన యేనుగు 'సింగావరము' న గృహాకృతిలోనున్న రంగనా యకుల దేవాలయము నేటికిని యాత్రికుల నాకర్షించు దృశ్యములు. రంగనాయకుల యాలయములోని శిల్పములను గూడ కాలము కబళించివేసినది. 'సింగావరము' నందున్న

శ్రీ రంగనాయకులు సుమారిరువది నాల్గడుగుల పొడుగు. తల మాత్రము ప్రక్కకు దిరిగియున్నది. దీనికొక యాశ్చర్యకరమైన కథ యున్నది. ఇది జరిగినది.

సుమారైదు శతాబ్దములకుముందు అల్లావుద్దీన్ సేనాని మల్లికాఫర్ శ్రీ రంగపట్టణమును ముట్టడించెను. అప్పుడా విగ్రహమును - విప్రులు మొదట తిరుపతికి సాగించిరి. అక్కడినుండి జింజి చేర్చిరి. ఆ కాలమున 'నారాయణ వనము'ను గోపణార్యుఁడు పాలించు చుండెను. అతఁడీ స్వామిని పునఃప్రతిష్ఠ చేసినాఁడు. ఈ మహోపకారమునకు సంతోషపడిన వేదాంత దేశికులు తామెన్నఁడు నరస్తుతిసేయని వారైనను గోపణార్యునిపై నొక శ్లోకమును వ్రాసిరి. అంతతో బోక - దానిని శ్రీ రంగ దేవాలయములోని శిలాఫలకముపైఁ జెక్కించిరి. అది నేటికిని కలదు. రంగనాథులను జింజికి తెచ్చినప్పుడు - ఆ పరమ పురుషుఁడు శ్రీరంగమువైపే జూచుచుండెనట. ఆ తలప్రక్కగా నుండుట కదిహేతువట! ఒక యైతిహ్యము.

జింజి-నాయకులకు రాజధాని యగుటకును నొకకట్టుకత యున్నది. కంచిలో తుపాకుల కృష్ణప్ప వసించుచుండెను. వాఁడు విష్ణుభక్తుఁడు. ఒకనాఁడు వరదరాజస్వామి వానిని బరీక్షింపనెంచెను. స్వామి వరాహరూపమును ధరించి

కృష్ణప్ప పూదోటనంతయు నాశమొనర్చెను. ఆ తోటను స్వామిమాలాసేవకై వాఁడు పెంచుకొని యుండెను. కృష్ణప్పకు కోపమువచ్చి ధనుర్బాణములను ధరించి–దానిని వెన్నంటెను. ఆ మాయామృగము వానికిఁ జిక్కక – పరుగెత్తినది. అక్కడిక్కడ చుట్టియది – కంచికై దామడల దూరములో నున్న కొండలలోనికి వచ్చెను. ఆ యాసముగొన్న దానివలె నక్కడ నిలిచినది. దానిని చంపుటకై కృష్ణప్ప ధనుస్సు నెత్తెను. ఆశ్చర్యము! అక్కడ వరాహములేదు. కంచి వరదరాజస్వామియే నిలిచికొని యుండెను. భక్తశ్రేష్ఠుఁడైన కృష్ణప్ప ననుగ్రహించి – అక్కడనున్న యొకశిలలో బ్రవేశించి యర్చావతారమును స్వీకరింతునని – వరదరాజులు వాగాన మిచ్చెను. తన్ను భక్తితో నుపాసించినచో – వానికి రాజ్య కోశములు ప్రాప్తించునని వరదరాజస్వామి – చెప్పినట! కాని – ఆ యడవిలో దేవాలయ నిర్మాణమెట్లు? దానికిని వరదరాజస్వామియే మార్గమును సూచించెను.” ఈ ప్రదేశమున కొక రసవిద్యాపారంగతుఁడైన బైరాగి వచ్చును. వానివలన నీసమస్య పరిష్కరింపఁబడున”ని పలికి స్వామి మాయమైనాఁడు.

కొన్ని దినములు గడచెను. స్వామి చెప్పినట్లే యొక రసవాది యక్కడికి వచ్చెను. ఆకుపసరుల సాయముతో వాఁడు శిలలను సువర్ణముగ మార్చివేయును. కాని – యా

విద్యను సాధించికొనుటకు ముందు-నరబలి యీవలసియుండెను ఆ బైరాగి కృష్ణప్పతో స్నేహము గట్టెను. వీనినే తన దేవతకు బలియొసగవలెనని వాని యాలోచన. వాఁడందుకు గావలసిన పనులన్నియు రహస్యముగ జేసికొన్నాఁడు. దీని కీలకి మెల్లో కృష్ణప్పకు దెలిసినది. వీఁడును సమయమునకు గాచికొనియే యుండెను. గడువు దినమునాఁడు బైరాగి వీనిని బిలిచి - బలియొసగుటకు సిద్ధపడెను. కృష్ణప్ప తన బాహుబలముతో నా బైరాగినెత్తి యా రసకటాహములో బడ వైచినాఁడు. ఆ బైరాగి దేహము స్వర్ణమయమైనది. ఆ బంగారుతో కృష్ణప్ప శ్రీ రంగనాథుని దేవాలయమును నిర్మించెను. నిర్మింపగా మిగిలిన బంగారముతో కోట కొత్తళముల గట్టెను. వీఁడే జింజినాయకుల మూల పురుషుఁడు.

కాని-చారిత్రకమైనకథ దీనికి భిన్నముగనున్నది-జింజి నాయకులకు మూలపురుషుఁడానంద కోనప్ప. వీనిది కురవజాతి. వీనికి నిధి నిక్షేపములను వెలికిదీయు పిచ్చి. ఆ పిచ్చితోఁ జెడిపోవుటకు బదులు వీఁడు బాగుపడెను. ఒకానొకనాఁడు వానికి నిధి దొరకనే దొరికినది. ఆ ధనముతో వాఁడు జింజి దేవనూరు మేలుచేరి - జయకొండ మొదలైన దుర్గములకు దొరయైనాడు వాని తరువాత కృష్ణ కోనప్ప గోవింద కోనప్పలు పరిపాలించిరి. కృష్ణ కోనప్ప కృష్ణగిరి కోటను

గట్టెను. గోవింద కోనప్ప గోపాలస్వామి దేవాలయమును నిర్మించెను. వీరి తర్వాత పులికోనప్ప రాజైనాడు. 14-వ శతాబ్దమున జింజి - విజయనగరమున చేరిపోయెను.

విజయనగర చక్రవర్తి కృష్ణదేవ రాయలు దక్షిణ దేశమును జయించివచ్చుటకై తనసేన నంపెను. ఆ సైన్యమునకు సేనాపతులు నల్గురు. మొదటివాడు తుపాకుల కృష్ణప్ప. రెండవవాడు వైద్యప్ప నాయకుడు. వెంకటప్ప నాయకుడు మూడవ వాడు. విజయరాఘవుడు నాల్గవ వాడు. వీరి క్రింద నొకలక్ష సైన్యముండెను. వీరు దక్షిణదేశ మంతయు జయించి సామ్రాజ్యమున కంకిత మొనర్చిరి. కాళశాస్త్రి బొమ్మి రెడ్డి యోడిపోయెను. జింజి - చోళ - పాండ్య రాజ్యములు పాదాక్రాంతము లయ్యెను. ఈ జయములో కృష్ణరాయలకు సంవత్సరమునకు మూడు కోట్ల క్రొత్త యాదాయ మేర్పడెను. కృష్ణ దేవ రాయ లెంతయో సంతోషపడెను. క్రొత్తగా గెలిచిన రాజ్యములకు - వారినే మండలేశ్వరులుగ నేర్పఱచినాడు. నెల్లూరి నుండి 'కొలరూన్' వరకు గల భూభాగమునకు తుపాకుల కృష్ణప్ప యధిపతి, కావేరీ ప్రదేశ మంతయు విజయరాఘవుని యాధిపత్యము క్రిందికి వచ్చెను. దానికి దక్షిణమందున్న భూభాగమునకు వెంకటప్ప మండలేశ్వరుడైనాడు. వీరికి క్రమముగా జింజి తంజావూరు - మధురలు రాజధానులైనవి.

జింజి కృష్ణప్పనాయకుని తర్వాత - వైయ్యప్ప పట్టణమునకు వచ్చెను. వాని పిదప, ఇమ్మడి కృష్ణప్ప, అతని యనంతరము అచ్యుత విజయరామచంద్ర నాయకుడు - ముత్యాల నాయకుడు పాలించిరి. ముత్యాల నాయకుడు మరణించునాటికి కృష్ణప్ప చిన్నవాడు అందుచే వాని చిన్నాయన వెంకటప్ప సింహాసనము నాక్రమించెను. కృష్ణప్ప నాయకుని నిర్బంధములో నుంచెను.

స్వామినిష్ఠులైన ప్రజలకీపని సరిపోలేదు. వారును - అంతఃపుర సేవకులును కుట్రపన్ని సమయమునకు గాచియుండిరి. ఒకసారి నవరాత్రి యుత్సవములు జరుగుచుండెను. వెంకటప్ప యుత్సవములలో - మత్తుడై యుండెను. అప్పుడు ప్రజలంతఃపురముపై దాడి చేసిరి. వాడు ఖైదీగా చిక్కెను. వాడు ప్రజల యడుగులపైబడి ప్రాణభిక్ష వేడినాడు. కాని యీ సమయము మించిపోయినచో వాడు మరల గుట్రలు చేయకుండునని ప్రమాణమేమి? ప్రజలు వాని మాటలు నమ్మలేదు. వాని కండ్లు పీకివేసిరి. సింహాసనము కృష్ణప్ప నాయకుడెక్కెను. జనులా రాజునకు సంతోషముతో స్వాగతమిచ్చిరి

కృష్ణప్ప క్రమక్రమముగ నధికారము లన్నియు జేతిలోనికి దీసికొన్నాడు. జింజి కోటలను బాగు చేయించెను

సైన్యముల నెచ్చించెను. ఈ సన్నాహమంతయు జేసికొని సామ్రాజ్యమున కెదురు దిరుగు ప్రయత్నమును సాగించెను. విజయనగర సామ్రాజ్యమునకు లోబడియుండుట వానికి గిట్ట లేదు. స్వతంత్రుడు గావలెను. ఆ సమయమునకు వాడు వేచియుండెను. అట్టి మహాయోగము తానై వచ్చెను.

తల్లికోట యుద్ధమున విజయనగర సైన్యములు రాజ ధానిని పెనుగొండకు మార్చుకొన్నను - ముస్లిముల దాడులు తప్పలేదు. వాని నెదిరింప వలసిన జవాబ్దారీ వృద్ధుడైన తిరుమల దేవరాయలపై బడినది.

'రక్షస్తంగడి' యుద్ధమైన తరువాత బహమనీ సులతానులలో అంతఃకలహములు పుట్టెను. దానికి ఫలముగ తాత్కాలికముగ విజయసింహాసనమున కపాయము తప్పెను. కాని-దేనా యపాయ మంతటితో నాగలేదు. బిజాపురపు 'ఆలీ ఆదిల్‌షా' 'ముర్తిజానిజాంషా'తో సంధి చేసికొనెను. వారిర్వురేకమై మరల విజయనగరముపై బడిరి. ఉత్తరమునందున్న 'తోరణగల్లు' కోటను ముట్టడి వేసినారు. ఏడు నెలలు ముట్టడిసాగి కోట వారికి లోబడినది. అటు తరువాత ధార్వాడ బంకాపురపు కోటలు జయించిరి. బిజాపురపు మహా దండనాయకుడైన ముస్తఫాఖాన్ యీ విజయముతో నొడలు మఱచి - పెనుగొండపై దాడివెట్టెను. కాని తిరుమల దేవరాయల సేనాని చెన్నప్పనాయకుడు వీరావేశ

ముతో పోరాడి వానిని వెనుకకు బారద్రోలినాడు.

తిరుమలదేవరాయల కింక గొంత యూపిరి తిరుగు నవకాశ మేర్పడినది. అతడు దన సామ్రాజ్యమును మూడు భాగములుగ విభజించెను. 'పెనుగొండ' రాజ్యమున శ్రీరంగరాయలు పట్టాభిషిక్తుడైనాడు. తొండ మండలమునకు వెంకటపతి దేవరాయలధిపతి యయ్యెను. చోళ పాండ్యములీతని యధీనమునకు లోబడినవి. కర్ణాటక దేశమునకు రామదేవరాయలధికారి యైనాడు. ఇట్లు దేవరాయడు 'ధారుణీవరు'డను కీర్తికి బాత్రుడయ్యెను.

కాని – విజయనగరముపై మూగికొన్న యుద్ధమేఘములు మాత్రము పూర్తిగ మాయము గాలేదు. తిరుమలుని తర్వాత పట్టమునకు వచ్చిన శ్రీరంగరాయల కాలమున మరల ముస్లిముల దుర్మార్గములు మెండయ్యెను. వారు 'పెనుగొండ'పై కెత్తిరి. శ్రీరంగదేవరాయల సైన్యములు వారి నెదిరించెను. "చేగలమఱ్ఱి"దగ్గర దొడ్డ యుద్ధమే యయ్యెను. చంద్రగుత్తి శంకరనాయకుడు బిజాపురపు సుల్తానులతోఁ జేరి సామ్రాజ్యమునకు ద్రోహము నెంచెను. ఈ యవకాశమును వినియోగించికొని – ఆదిల్‌షా – విజయనగరమునకు జేరిన 'కరూరు' 'గుత్తి' బాసూరు మొదలైన దుర్గముల నాక్రమించికొన్నాడు. వాడు మరల పెనుగొండపై నెత్తెను.

సమ్రాట్ శ్రీరంగరాయలు సంధికి బూనుకొన్నట్లు ఉపాయముతో – ఇబ్రహీం కుతుబ్‌షాహాను శ్రీరంగ రాయలు వెనుకకు లాగెను. శత్రువులో నంతఃకలహ మేర్పడినది. ఈ విధముగ నప్పుడు పెనుగొండ కపాయము దప్పెను. మూడవసారి – హండేమలకప్పనాయకుఁడు ద్రోహియైనాఁడు. వాని సాయమున మరల ముస్లిములపైఁ బడిరి. ఈ సారి ప్రాణములకు తెగించిపోరిన వీరుఁడు జగదేవరాయఁడు. వాఁడు శత్రువులను వెనుకకు నెట్టెను. శ్రీరంగరాయలు శత్రువుల నుండి కంభము పెనుగొండలను గెల్చుకొన్నాఁడు. అప్పుడు శ్రీరంగరాయఁడు 'అహోబిలము'న విజయ స్తంభమును నిల్పెను. ఇంతయైనను అతని సామ్రాజ్యము స్థిరముగ నుండ లేదు. సామ్రాజ్యపు టాయువుపట్టులు చెదరిపోయినవి. ఒక వైపు స్వతంత్రులగుటకు బ్రయత్నించుచున్న సామంతులు, మరొక్కవైపు మాటిమాటికి దండెత్తివచ్చుచున్న సులతానులు. చాలనిదాని కప్పుడప్పుడూళ్లపై బడి దోపిడీలు సాగించు పోర్చుగీసులు. 'గిరిసొప్పె – బానూరు' మున్నగునవి సుల్తానుల వశమై పోయినవి. శ్రీరంగపట్టణములోని రామదేవ రాయలు స్వతంత్రులగుటకు బ్రయత్నించుచున్న మైసూరు రాజులను లోఁబఱచికొనుటకు సమర్థుఁడుగాఁ డయ్యెను.

బిజాపురమున నాదిల్‌షా నెవరో చంపివేసిరి. వాని పిదప ఇమ్మడి యిబ్రహీంషా గద్దెనెక్కెను. గోలుకొండలో

కుతుబ్ షాతరువాత మహమ్మదుకులీ కుతుబ్ షా సింహాసనమునకు వచ్చెను. వీరిర్వురు మరల నొక్కటియై పెనుగొండను ముట్టడించిరి. ఈ సమయముననే జింజి కృష్ణప్పనాయకుఁడు గూడ సామ్రాజ్యముపై పితూరీ చేసెను. వాఁడు కప్పమును నిలిపివేసినాఁడు. మధురముత్తు వీరప్ప వానికి దోడ్పడెదనని మాటనిచ్చెను. అప్పుడు వెంకటపతి దేవరాయలకు దిక్కు తోచలేదు. తంజావూరు చక్రవర్తికి బాసటగా నిల్చినది.

వెంకటపతిదేవరాయలు కృష్ణప్ప నణచుటకు తంజావూరును సాయము గోరెను. అచ్యుతప్ప కుమారరఘునాధనాయకుని సైన్యసమేతముగ బంపినాఁడు. రఘునాధుఁడు పోరిలో జింజి కృష్ణప్ప నోడించినాఁడు. వాఁడు చెఱ జిక్కెను. వానిని రఘునాధుఁడు వెంకటపతి దేవరాయల కొప్పించెను. తక్కిన సామంతులీ ఘట్టముతో గుణపాఠము నేర్చుకోవలెనని వెంకటపతిదేవరాయలు జింజి కృష్ణప్పను పెనుగొండలో కారాగారమున బంధించినాఁడు. ఇట్లు కృష్ణప్ప యాశలన్నియును మొదలంట హతమై పోయినవి. రఘునాధునికే జింజికృష్ణప్పపై దయ కల్గినది. అతఁడు చక్రవర్తి యనుగ్రహము వడసి చెఱలోనున్న కృష్ణప్పను విడిపించెను. వాని రాజ్యము మరల వానికి లభించినది. ఆ లభించుటయు రఘునాధనాయకుని దయతోనే.





చక్రవర్తి వెంకటపతిరాయలు కృష్ణప్ప తిరుగు బాటును అణచిన పిమ్మట తన దృష్టిని ముసల్మానుల బాడుల పై కేంద్రీకరించెను. ఈ సారి శత్రువులకు దగిన గుణపాఠము నేర్పింపదలంచినాడు. గోపరాజు, తిమ్మపాపయ్యసెట్టి యను వారి నాతఁడు ముసల్మానుల వద్దకు రాయబారమంపెను. సంధి చేసికొనవలెనని నటన. ఈ ప్రయత్నము వలన కూలీ కుతుబ్ షా పెనుగొండపై దాడిచేయుటకు గొంత యాలస్య మైనది. ఇంతలో దనసామంతుల సైన్యములను రప్పించి కొని సుల్తాను నెదిరింప వచ్చునని వెంకటపతిరాయల యభి ప్రాయము. అత డెల్లసామంతులకును – మండలేశ్వరులకును పత్రముల నంపినాడు. వారి సాయము నాతఁడర్థించెను. ఈ సందర్భమున తంజావూరికిగూడ చక్రవర్తి దూతల నంపి యుండెను. పెనుగొండనుండి వచ్చినదూతలు తగిన సమ యము చూచి – యచ్యుతప్పకు దమ వచ్చిన కార్యమును నివేదించిరి. తాము తెచ్చిన కానుకల నర్పించిరి.

అచ్యుతప్ప తనకు చక్రవర్తుల నుండి వచ్చిన యాజ్ఞ లను జదివికొని మహామంత్రులు గోవిందదీక్షితుల కొసంగి నారు. ఆలేఖ యిది.

"స్వస్తిశ్రీ మన్మహారాజాధిరాజ రాజపరమేశ్వర మేదినీ మీసరగండ-జీర్ణ కర్ణాట పునరుద్ధారణేత్యాది బిరుదాంకితులైన - శ్రీమద్విద్యానగర రత్నసింహాసనాధీశ్వరులైన వెంకటపతి దేవరాయలుంగారు - సామంత శ్రేష్ఠులైన అచ్యుతప్ప నాయకునింగారికి ప్రీతి గౌరవములతో నంపిన నిరూపమేమనంగా —

పరమపూజ్యులైన యచ్యుతరాయల కాలము నుండిన్నీ మీ తండ్రిగారైన శివప్పనాయకులున్నూ, మీరున్నూ సామ్రాజ్యానికి గొప్పసేవలు చెల్లించుచూ వచ్చుచున్నారు. సామ్రాజ్యస్వామి నిష్ఠగలిగిన సేవకులలో మీరగ్రగణ్యులలో జేరినవారై యున్నారు. ఇంత వఱకున్నూ విజయనగరసామ్రాజ్యానికి మీరు చెల్లించిన సేవలను మేము సదాతలంచుకొనేము. కొన్నివర్షాలకు ముందు మాపై పితూరీనడపిన మధుర జింజినాయకుల ప్రయత్నములను విఫలము జేయడంలో మీరెంతో మాకు దోడ్పడితిరి. అప్పుడు మీరు మాకు చెల్లించినసేవ లోకోత్తర మైనది. సామ్రాజ్యంలోని ప్రజలు దీనిని ముక్తకంఠముతో పొగడేరు. మే

మన్నచో సామ్రాజ్యాన్ని గండాంతర సమయాలలో సం రక్షించు రక్షాకవచముగ నెంచుకునేము. సామ్రాజ్య పున రుజ్జీవన కార్యములందున్నూ, హిందూ ధర్మసంస్కృతుల సంరక్షణ కార్యమందున్నూ మీ సేవ అమోఘమైనది. దీనికంటె గొప్పదైన సేవను, త్యాగసంపత్తిని మీ నుండి మేము కోరుకునేము. ఇప్పుడు కర్ణాటక సింహాసనమునకు బహమనీ సుల్తానులనుండి మరియొక గండాంతరము వచ్చినది. "మహమ్మద్ కులీ కుతుబ్ షహనా" ముర్తుజా ఖానునిచేతికి గొప్ప సైన్యము నిచ్చి సామ్రాజ్యముపైకి బంపించినాడు. పూజ్యులైన మా పూర్వులనుండి నీ వారికైన పరాభవానకు బదులు తీర్చికొనేందుకు నిశ్చయించికొన్నాడు. ఈ నాడు మహాసామ్రాజ్యం యొక్క చావు బ్రతుకుల ప్రశ్న పరిష్కా రించేని. ఈ మహాయుద్ధాన మనము బ్రతికి బయటపడినచో ఏపవిత్రఫలములకై సామ్రాజ్యము నిర్మింపబడెనో ఆ యుద్దే శ్యము లీడేరీని. లేకున్నచో సామ్రాజ్యముతో పాటన్నీ నాశమయ్యేని. కనుక యిప్పుడు కేవలం సామ్రాజ్యం నిలుపు కొనడం అను ప్రశ్నయే గాక హిందూ ధర్మ సంస్కృతులను నిలుపుకునే ప్రశ్నయు, నీ యుద్ధములో జేరియున్నవి. బహ మనీ సుల్తానులను వెనుదోలు, నీ పవిత్రకార్యముల మీ రొక్కరు మావెంట నున్నచో వేయిమంది మండలేశ్వరులు మావెంట నున్నంత బలము, ఉత్సాహము మా కేర్పడేని.

ఈ పత్రిమును చూచిన వెంటనే మీరు సకల సైన్యముతో మా సహాయార్థమై వచ్చుచున్నారని నమ్మెము.

ఇట్లు, చతుస్సముద్రాధీశ్వర
వెంకటపతి దేవరాయల వ్రాలు.

గోవిందదీక్షితులు లీ నిరూపమందఱకును వినవచ్చునట్లు గట్టిగా చదివిరి. ఆ కమ్మ చదివిన వెంటనే వీరుల మనస్సులలో విద్యుత్సంచారమైనది. కత్తులానుకొని యాసనములపై రాతులు రణోద్గారము లొనర్చిరి. అందరి ముఖములందును ఉత్సాహము తొణికిసలాడుచుండెను. వారందరచ్యుతప్పరాయని యాజ్ఞకై నిరీక్షించుచుండిరి.

అచ్యుతప్ప గోవిందదీక్షితులవైపును కొలువు వైపును జూచి గంభీరముగ నిట్లన్నాఁడు—

"చక్రవర్తులు మనతో మైత్రి నెరపి మనకు గొప్ప గౌరవమొసఁగినారు. నిజమునకు మనము వారి సేవకులము. మనము సామ్రాజ్యమునకు రత్నకవచములవంటి వారమని మనసేవను కొండంతగ వారు పొగడినారు. ఈ గౌరవమునకు మన మెంతవరకు పాత్రులమో యూహించి కొనవలెను. నిజమునకు మనమంతటి సేవ సామ్రాజ్యమునకు జెల్లింపలేదని నా యభిప్రాయము. కాని మనపై వారికిగల ప్రీతి గౌరవములే మన చిన్న యుపకారములను గూడ కొండంతలుగ

భాసింపజేయుచున్నవి. ఇప్పటికి సామ్రాజ్యమునకు గొప్ప ఆపత్తు మూడినది. ఈ దారుణ సమయమందు మనము చక్రవర్తులకు వెన్నుబలమై నిలువవలెను. ఇది మన స్వామి నిష్ఠ మాత్రమే గాదు. కర్తవ్యము గూడ. ఆ పై సామ్రాజ్య పరిపాలకులైన "యోగనరసింహులే" రక్షించును. ఈ విషయములో దమ యభిప్రాయమేమో దెల్పవలయును"

గోవిందదీక్షితులు లేచి నమస్కరించి యిట్లనిరి. "ప్రభూ! మీమాటలెంతో సముచితములుగనున్నవి. మనము సామ్రాజ్యమునకు సేవకులము. చక్రవర్తుల సేవకులము. వారినుండి మనకాజ్ఞవచ్చినది. వారి యాజ్ఞను శిరసావహించి సైన్యసమేతముగ బోవుట మనకర్తవ్యము. కాని చక్రవర్తులు యుద్ధమునకు తయారుగ రావలెనని మనల నాజ్ఞాపింపక మన విషయమున మిత్రులవలె ప్రవర్తించిరి. అది వారి గొప్పతనము. ఇప్పుడు సామ్రాజ్యముపై నెత్తివచ్చిన బహామనీ సుల్తానుల నోడించుటకు మన శక్తి సామర్థ్యముల నన్నిటిని వినియోగింపవలెను. ఇది మన కర్తవ్యము మాత్రమేగాదు, ధర్మము గూడ. ఈ విషయమున నెవరికిని భిన్నాభిప్రాయము లేదు. ప్రయత్నము మనది. ఆ పై యారసీటి వంశమును "శ్రీరంగనాయకులే" రక్షించుకొనగలరు."

అచ్యుతప్ప తన సమీపముననే గూర్చున్న కుమార రఘునాథునివైపు చూపు సారించినాడు.

"అప్పాజీ! అమాత్యశ్రేష్ఠులైన గోవిందదీక్షితులు పలికిన పలుకులు విన్నారు. అవి వారి మాటలు మాత్రమే కాదు. మాయందరి మనోనిశ్చయమును వారి ముఖమున బయలు వెడలినది. ఇప్పుడు రెండవసారి విజయనగరమునకు వినాశకాలము సంప్రాప్తించినది. మొదటిసారి వారి యాపుతో విద్యానగరము నాశమయ్యెను. వంశేశ్వరుని దయ తప్పి పెనుగొండకు సింహాసనమును మార్చుకొనవలసి వచ్చినది. ఆతళ్లికోటయుద్ధము సామ్రాజ్యముయొక్క యంతస్సత్త్వము బీల్చివేసినది. ఈ సారి మనము శత్రువుల నెదిరించి వెనుకకు నెట్టకున్నచో విజయనగర సామ్రాజ్యము సర్వనాశమగు నవుటలో సందేహము లేదు. సామ్రాజ్యము మాత్రమే గాదు. మన పవిత్రములైన యాదర్శములన్నియు మంటగలిసి పోవును. ఈ సర్వనాశమును మన మెదిరించి తీరవలెను. ఈ యవసరము గలుగుట వీరుల సుకృతము. ఈ పవిత్ర కార్యమున ప్రతియొకడును దూకి తన సర్వస్వమును బలిదానమొనర్పవలెను."

"విజయనగర సామ్రాట్టులు సామంతులందరిపె కంటెను మనపై నెక్కువ యాశలు పెట్టుకొని యున్నారు. దీనికి వారు బంపిన పత్రమే సాక్షి. వారు మనకొసగిన గౌరవమును మనము నిలుపుకొనవలెను. సామ్రాజ్య రక్షణకై ప్రయత్నము లొనర్చు సామంతు లందరికంటెను మన

ముందునిలువ వలెను. ఈ పవిత్రకార్యమును మీరు నా కొప్పింప వలెనని నా మనవి. సామ్రాజ్యమునకు గలిగిన యీ యపాయమును పరిహరించి విజయలక్ష్మిని వరించు భాగ్యము నాదిగావలెను.

ఈ మాటలువిని యచ్యుతప్ప నిర్విణ్ణుఁడైనాఁడు. రఘునాథుఁడప్పటి కిరువదియైదేండ్లవాఁడు అంతటి చిన్నవయస్సున నింతటి ధైర్యసాహసములు ప్రదర్శించునని మెవ్వరు నూహింపలేదు. ఈ సాహసమును జూచిన గోవిందదీక్షితులకు గూడ నాశ్చర్యమయ్యెను. వారు ప్రభువులవైపు దిరిగి యిట్లు బదులు పలికిరి.

"ప్రభూ ! యువరాజులు పలికిన మాటలలో సత్యమున్నది. ఈ సారి నడచు యుద్ధములో మన సామ్రాజ్యము నిలుచుటో నాశమగుటో తేలిపోవును. ఇంతకు ముందు జరిగిన యుద్ధములందెల్లను దాము చక్రవర్తుల భుజమునకు దమ భుజమునొడ్డి పోరాడితిరి. మీ దేహము యుద్ధరంగముల లోనే పండి ముసలిదైన దన్నను ఆశ్చర్యములేదు. ఈ సారి కుమార రఘునాథుఁడు మీకు విశ్రాంతి నొసఁగి తాను యుద్ధములలో బాల్గొనఁ గోరుచున్నాఁడు. కుమారుని యభీష్టమును తమరీడేర్పవలెను."

"దీక్షితులు గారూ ! మీరందరును గలసి ముందే మాటలాడుకొన్నట్లున్నది. అందరొకవైపై నన్నింటి కడనే కట్టి

వేయుచున్నారా యేమి?" వయస్సు పండిన యచ్యు ముఖముపై చిఱునవ్వు వెన్నెల గాచెను. అవి మాగువాతిన వెన్నెలయ: దీక్షితులు గూడ నవ్విరి.

"దీక్షితులు గారూ! మీ రిట్లనుటకు వీలులేదు. కుమారరఘునాధుఁడు తనవయస్సునకుఁ దగినమాటలాడెను. కాని బహమనీ సుల్తానులతోడి యుద్ధములు అతఁడనుకొన్నంత సులభమైనవిగావు వారు పిశాచములవలె పోరాడుదురు. ఇట్టిస్థితిలో రఘునాధుని యుద్ధమునకు బంపి నే నింటిలో నిలుచుటకు సాధ్యముగాదు"

"అప్పాజీ! నావయస్సు చిన్నదే గావచ్చును, అనుభవము లేకపోవచ్చును. కాని నేను పిరికివాఁడను గాను. సింహమునకు బుట్టిన సింహపు పిల్లయే, రఘునాధనాయకుఁడను విషయమును తమరు మఱచిపోరాదు. ద్రోణాచార్యుని వంటి గోవిందదీక్షితులు గారు నాకు శస్త్ర విద్యాగురువులు. నేను యుద్ధమునకు జంకినచో నాయపకీర్తి నాకుగాదు. వారికి. ఆ పిశాచములను వెనుకకు బారద్రోలి మరియొకసారి మన వైపు తేరి చూడకుండునట్లు చేయగల పరాక్రమము నా యీ భుజబలమున కున్నది. దయచేసి మీ రీ సారి నాకు వీర తాంబూలము నొసఁగి యుద్ధమునకు బంపవలెను. ఈ మాత్రము గృపసేయ వలెను."

[illegible]

కుమార రఘునాథునకు జయము జయముగాక. విజయనగర సామ్రాజ్యమునకు జయముగాక' అను నినాదములతో గొల్కూటము దద్దరిల్లెను. ఆ నినాదములతో నచ్యుతప్పనాయకుఁడే నిమేష కాలము శరీరమును మఱచెను. ఆ క్షణ కాలములో రఘునాథుని యొకానొక బాల్యవృత్తాంతము అచ్యుతప్ప మనస్సులో మెదలిపోయెను. సుమారు రెండు పదులు సంవత్సరముల వెనుకటిమాట; అపుడు రఘునాథునకా రేండ్ల వయస్సు.

ఒకనాఁడు గోవిందదీక్షితులు శివప్పనాయకునితో నేదో మాటలాడుచు పొద్దు గడుపుచుండిరి. ఇంతలో నెవరో యేడ్చుచున్న ధ్వని వారిచెవిని బడినది. అంతఃపుర మున నాడుకొనుచున్న రఘునాథుఁ డా ధ్వని విని బయటికి వచ్చెను. అదియొక కరుణాజనకమైన దృశ్యము. ఒక యాఁడు దాని నప్పిచ్చినవాఁ డీడ్చుకొని పోవుచుండెను. తాను తప్పక ఋణమును దీర్తుననియు గొంతకాలము గడువిమ్మనియు నది వాని కాళ్ళవేళ్ళ బడుచుండెను. ఆయప్పుజేసిన దా మెగాదు, దాని మగడు చేసి యుండెను. వాఁ డెన్నఁడో జచ్చినాఁడు. ఆ గుడిసె యింట నున్న సామానులు అప్పులవాండ్రు దీసి కొన్నారు. అప్పున కాస్తి సరిపోలేదు. మగడు భార్యను- ఒక్క కొడుకును వదలి మరణించినాఁడు. మగడు చేసిన

యప్పును భార్య తీర్చవలసి యుండెను. ఇది యీ సమాజ ధర్మము. అప్పు తీరువరకును తమయింటి పనిపాటలు చేయ వలసినదని ఆమె నప్పుల వాండ్రీడ్చుకొని పోవుచుండిరి. ఆమె కేదియు దారిదోచలేదు. రాజుతో మొఱబెట్టుకొనుట కామె యంతఃపుర సమీపమునకు వచ్చెను.

ఆమె ద్వారమున నిలిచియున్న కుమార రఘు నాధునకు తన మొఱవినిపించినది. చిన్నవాడైన యతడేమి సేయునని మైన యామె యూహింపలేదు. దుఃఖముయొక్క స్వభావ మట్టిది. ఎటువంటి వారు తమ దుఃఖమును దీర్చుటకు శక్తులా-అశక్తులా యనునదియు నాలోచింపనీయదు. రఘు నాధు డామె కధనంతయు విన్నాడు. అతని కేమి బుద్ధిపుట్టెనో తన మెడలో నున్న రత్నహారమును దీసి యప్పులవారి కిచ్చి వేసి యీ స్త్రీని వదల వలసినదని మందలించినాడు ఈ త్యాగమున కప్పులవారు విభ్రాంతులైరి. అప్పటికి సరిగా-శివప్ప నాయకుడును-గోవింద దీక్షితులు నక్కడికి వచ్చినారు. తాతను చూచిన వెంటనే రఘునాధుడాతని దగ్గరకువచ్చి తన యొనర్చిన కృత్యమును చెప్పెను. శివప్ప మనుమని నిండార గాగలించికొన్నాడు. ఆ సమాజమున నంతే. ఒకవైపు దుర్భరమైన అన్యాయము. మఱియొకవైపు దేవతలకు లేని యుదార హృదయము.

"బిడ్డా! సంపూర్ణాయుష్కుడవై జీవింపుము. నిను గన్న తల్లిదండ్రులు ధన్యులు. ఇంత చిన్న వయస్సునకే-బ్రజలపై నింత యంతఃకరణమును-ఔదార్యమును బెంచికొన్న నీవు సింహాసనమెక్కిననాఁడు సౌఖ్యములే భూమిపై బాఱాడును."

శివప్ప-దీక్షితులవైపు జూచెను.

"దీక్షితులుగారూ! నా మనుమడు చేసినపనికి నాకెంత సంతోషమైనదో మాటలతో వర్ణింపలేను. ఈ వయస్సునకే ప్రజలపై - నింతటి వాత్సల్యమా! దీనులపై నింత యనుకంపయా! వీఁడు మన వంశమునకు రత్నమువంటివాఁడు. వీనిని జాగ్రత్తగ పోషించుభారము మీది."

రఘునాథుని విషయములో – శివప్ప గట్టికొన్న కలలు-ప్రత్యక్షముగ దిలకించు భాగ్యము-గోవింద దీక్షితులు-అచ్యుతప్పనాయకులదై యుండెను. దీక్షితులు రఘునాథుని చిన్నప్పటినుండియు నెంతో భక్తి శ్రద్ధలతో శిక్షించిరి. సంగీత సాహిత్యములు నేర్పించిరి. శాస్త్రములలో బ్రవేశము గలిగించిరి. రణవిద్యలలోఁ బ్రచండునిగ నొనర్చిరి. బాల్యముననే రఘునాథుఁడు-ఆంధ్ర సంస్కృతములలో గవిత్వము చెప్పెడివాఁడు. సాహిత్య సంగీతములు వానిని వలచి వచ్చెను.

ఒకసారి యచ్యుతప్ప రఘునాథుని పరీక్షించెను. కృష్ణ భగవానునిపై నొక పద్యము చెప్పుమన్నాఁడు. వెంటనే

రఘునాథుండు కావ్యరచనకు దొడఁగి-రెండు మాసములలో “పారిజాతాపహరణ” మనెడు కావ్యమును రచించి తండ్రి కొప్పించెను. అతని యాశువును వ్రాసికొనుటకు వ్రాయసకానికి కష్టమయ్యెనట! అంత వేగముగ నతఁడాశువును నడపెను అచ్యుతప్ప [illegible] కావ్యమును జదివి-దీనిని బరీక్షింపుఁడని పండితుల కొసఁగె[illegible]ను దానిని జదివి చక్కని కావ్యమని తేల్చిరి. విద్వాంసులు నిండిన సభలో—నచ్యుతప్ప రఘునాథునకు కనకాభిషేక మొనర్చినాఁడు. వాఁడా బంగారమును గురుదక్షిణగా దీక్షితులకర్పించెను. వారు దానిని సత్కార్యములకు వినియోగించినారు.

సాహిత్యము నందున్న ప్రౌఢిమ రఘునాథునకు సంగీతము నందుగూడ నుండెను అతఁడు “సంగీతసుధ” యను గ్రంథము వ్రాసెను. దానిలోని గీతములను మధురవాణి తొట్టతొలుత కొలువులో బాడినది. దానికి సంతోషపడిన పండితులు రఘునాథుని గౌరవించుటలో-అహమహమికలు బ్రదర్శించిరట. రఘునాథుని సాయముతో—“వెంకటేశమఖి” యనేక నూత్న రాగములను నిర్మించినాఁడు. అంతమాత్రమేగాదు. “సాహిత్య రత్నాకరమను” నొక గ్రంథమును గూడ వ్రాసెను. రఘునాథుడు ప్రతియొక రాగమునకును అనుకూలమగు మేళమును

నిర్మించెను. ఇది వీణనంటి యొక వాఙ్మయము. ఈ నిర్మాణ మున "వెంకటేశమఖి"యు దోడయ్యెను.

ఈనాఁడాతఁడు తన రణకౌశలముతో లోకమును దిగ్భ్రాంత మొనర్ప బూనుకొన్నాడు. ఈసారి యాతనికీర్తి మేరు శిఖరములవంటి యౌన్నత్యము నందుచున్నది. కాని యీ గౌరవముల నన్నిటి ననుభవించుటకు శివప్ప మాత్రము లేఁడు.

ఈ కథలన్నియు నచ్యుతప్ప తలలో మెదలిపోయెను.

కుమారున కానాఁడు వీడ్యము నొసఁగెను. ఒసఁగుచు నిట్లు బలికెను.

"బిడా! యుద్ధములలో బాల్గొనుట నీకు క్రొత్త కాదు, గాని-బహమనీ సుల్తానులతో నీవు పోరాడుట కిదే మొదలు వారి విషయమున నీవు జాగత్తగ మెలఁగవలెను. రణ ధర్మమను పదము వారికోశమున లేదు. వారినెదిరించి పోరాడు ధైర్యసాహసములు నీయందు కలవని నాకు విశ్వా సముకద్దు. సామ్రాజ్యమునకు విజయమును సాధించి విజయుఁడవై తిరిగిరమ్ము. యశస్వివై నూరు వర్షములు జీవించుము."

రఘునాఁథుడు తలవంచి తండ్రి దీవెనలు గ్రహించెను.

రఘునాథుఁడు సైన్యములతో పెనుగొండ చేరువరకే రాజధాని కెన్నియో సైన్యములు వచ్చినవి. వారికి గావల

సీస శస్త్ర సంపత్తి సమృద్ధిగ నుండెను. ధాన్యమునకును–నీటికిని గొదువలేదు. చేరిన సైన్యము లన్నియు నుత్సాహముతో దాడికెదురు చూచుచుండెను. వారిమనోత్సాహము–పెండ్లికి నడచువారిదివలె నుండెను. శత్రువులను మొదట సామ్రాజ్య సైన్యములే యెదిరించెను. జగదేవరాయలు–మట్ల అనంత భూపాలుడు–కుమార రఘునాథుడు రణప్రచండులై విజృంభించిరి. వీరి సాహసమునకు బెదిరి మసల్మానుల సైన్యములు నంద్యాల దారులపట్టి పరుగెత్తినవి. రఘునాథుడు యాదవరాయలు కుల రంగసెట్టి–పాపయ్య మొదలైన ధీరులు ప్రాణములను దెగించి వారిని వెన్నంటి తరిమిరి. గోలకొండ సైన్యములు దిక్కులపాలాయెను.

కుతుబ్‌షా–మస్తుంఖాను క్రింద కొంతసైన్యము నొసంగి మఱియొకసారి దండయాత్రకంపినాడు. వారు కడపను ముట్టి సంపూర్ణముగ నాశ మొనర్చిరి. ఈ వార్త విన్నదే తడవు సామ్రాట్టు సైన్యములు వారి నడ్డగించెను. శత్రువులును ధైర్యము చెడక అలిబర్ ఖానుని–నేతృత్వమున పెనుగొండపైకి నడిచిరి. వారిని–అనంత నాయకుడు–నరస నంజరాజు యెదిరించిరి. కాని జయము గోలుకొండకే దక్కెను. "కాళహస్తి" పరగణాయంతయు శత్రువుల ఘాతుకకృత్యము లకు బలియయ్యెను.

అప్పుడే-కుతుబ్ షాపై [illegible]ని జహాంగీరు దాడులు [illegible] జడిరి. సైన్యములలో నంతఃకలహములు చెలరేగెను. ఈ బాధలతో గోలకొండసైన్యములు వెన్క-[illegible]వి. సమయమును గనిపెట్టి రఘునాథుడు వారిని దరిమెను. వారి సేనాపతులు రఘునాథునకు చేజిక్కిరి. వారిని [illegible] యాతడు వెంకటపతిరాయల కొప్పగించినాడు. [illegible] సంతోషమునకు మేరలేదు. అతడు రఘునాథుని కెన్నో బిరుదము లొసగెను. అమూల్యములైన బహుమానము లిచ్చెను. నిండోలగమున సన్మానించెను.

“రఘునాథా! నీవు నా కన్నుల యెదుట బుట్టితివి. నా యెదుట బెరిగితివి. నీవినాడు ప్రదర్శించిన ధైర్యసాహసము లపూర్వము లైనవి. నీవు జన్మించిన క్షాత్రము [illegible] చాతుర్యముతో పెనుగొండకు సంభవించిన [illegible] నివారితమైనది. ఈ దొడ్డయుపకారమునకు నిన్నెట్లు [illegible] వింపవలెనో నాకు దోచుటలేదు. “ప్రభూ! నేనల్ప[illegible] నాసేవ మీ మనస్సున కెక్కియున్నచో నేను ధన్యుడను. చిన్నదైన నా యీ సేవను గొప్పగా భావించుట మీ యౌదార్యము. నా యోగ్యతకాదు. నేను సామ్రాజ్యమున కేదైనను సేవ చెల్లించి యున్నచో-అది నా కర్తవ్యమనుకొని నిర్వహించితిని. అంతేకాని తమరుచేసిన యీ సన్మానములు-వీరపూజలు-వీనికి నే నర్హుడనుకాను. దీని కర్హులైనవారెవ

రైన నున్నచో వారు నాకీ యవకాశమును గల్పించిన మా తండ్రిగారు. అదిగో! ఆ కోటలలో వెలుగుచున్న యోగా రాములు, ఆ కొండపై బ్రకాశించుచున్న-పెనుగొండకు భాగస్వాములైన యోగానారసింహులు."

"వత్సా! నీపలుకు లమృతోపమానములుగ నున్నవి. నీవంటి వీరపురుషుని సేవలు స్వీకరించుటకుకూడ నెంతో పుణ్యము గావలెను. ఆ భాగ్యము మా యిలవేల్పు-"ఆలూరు రంగనాయకుల" దయచే నాకబ్బినది. నిన్నేరీతి సన్మానించి నను చాలదనిపించుచున్నది. నీ మనస్సున నేదైనకోరిక యున్నచో-దానిని దీర్పవలెనని నా యుత్సాహము"

రఘునాథుని తలలో నొక యాలోచన మెదలినది. సామ్రాజ్యమునకు ద్రోహమొనర్చి - పెనుగొండ చెఱలో బంధితుడై -యిప్పుడు పశ్చాత్తాపదగ్ధుడగుచున్న జంజికృష్ణప్ప మనస్సులో మెదలెను. వానిని చెఱనుండి విడిపించి—వాని రాజ్యమును మఱల నిప్పింపవలెనని రఘునాథుని యాశ.

వాడుకూడ నొకనాడు తనవంటి సామంతుడే. ఏదో చెడ్డకాలమున ప్రలోభము వాని మనస్సున చోటు జేసి కొన్నది. సామ్రాజ్యముపై ద్రోహము దలపెట్టెను. దాని పరిణామము ననుభవించు చున్నాడు. వానికి మఱల వాని

సాక స్థానమును గల్పించుకొనెను. భావన రఘునాథుని మనస్సున మెదలెను. అతఁడు మెల్లగా సామ్రాట్టులతో ననెను.

"ప్రభూ! నా కొక కోరికయున్నది. సన్నిధానము ననుగ్రహింపవలెను."

"నిస్సంకోచముగ దెల్పుము."

"స్వామీ! తెలిసియో- తెలియకయో హైవసహాను లైన చక్రవర్తులకు జింజికృష్ణప్ప ద్రోహమొనర్చెను. చెఱ సాలలోఁజిక్కి- దాని ఫల మతఁడనుభవించుచున్నాఁడు. అతని మహాపరాధము నుదారముగ క్షమించి - దయసేయవలెనని విన్నపము."

"ఏమీ! తిన్నయింటి వాసములను లెక్కించిన యాద్రోహికి క్షమాదానమా!"

వెంకటపతి దేవరాయల ముఖ మెఱ్ఱబడెను. రఘునాథ నాయకుఁడు దప్ప వేరెవ్వఁడైనను-ఆ ముఖభంగిమమునకు భయపడి యుండెడివాఁడే.

"అవును-స్వామీ! జింజికృష్ణప్ప చేసినది మహాపరాధమే. కాని-యాతఁడు దనయకృత్యమునకు బశ్చాత్తాప పడుచున్నాఁడు. అతని ద్రోహమంతయు బశ్చాత్తాపాగ్నిలో దగ్ధమై-మనస్సు పరిశుభ్రమైనది. సామ్రాజ్యములోని జను

లందరు నుత్సాహముతో నవ్వుచున్న యీ సమయమున–నాతని చెఱ విడుదల గావలెను.”

“రఘునాథా! ఆ ద్రోహిని క్షమింపుమని వేడి–వానిని స్వతంత్రునిగ నొనర్చుచున్న నీ వెంత యపాయకరమైన కార్యమునకు బూనుకొనుచున్నావో యాలోచించికొన్నట్లు లేదు. వానిని చెఱవిడిపించుట–పామునకు పాలు బోయుట వంటిది.

“ప్రభూ! కృష్ణప్పనాయకుఁడు ఒకసారి మీకు ద్రోహ మొనర్చినది నిజమే. అతఁడపరాధి. తన్ను క్షమింపుమని వేడుట కాతనికి నాల్క లేదు. ఆ మహాకార్యము మీ యౌదార్యముచే నడువవలెను.”

“వాఁడు కాలసర్పమువంటివాఁడు”

“కావచ్చును. కాని–దానికోరలు తీసివేసినారు. ఇఁక నే యపాయమును రాదు.

“నీవింత చెప్పినమీఁదట–నీ మాటను దిరస్కరించుట మాకిష్టములేనిపని. నీవొనర్చిన సేవలకు వెల యొసఁగి యీ నీచుని చెఱనుండి విడుదల సేయుచున్నాము.”

వెంకటపతి దేవరాయలు కృష్ణప్పనాస్థానమునకుబిలిపించి

“కృష్ణప్పనాయకా! కుమార రఘునాధుని విన్నపము ననుగ్రహించి మిమ్ము చెఱనుండి విడిపించినాము. మీ యపరాధమును క్షమించి–మీకు మఱల జింజి యధికారము

నొప్పించుచున్నాము. ఇకమీఁద మీరు-మీ దేహమును-మనస్సును-మీ సర్వస్వమును సామ్రాజ్యక్షేమమునకై వినియోగించి-లభించిన యీ పునర్జన్మను సార్థకమొనర్చికొనవలెను."

వెంకటపతి దేవరాయలు జింజి యధికారమును మరల కృష్ణప్ప కిప్పించెను.

రఘునాథనాయకుని యనుగ్రహముతో దనకు-విముక్తి లభించిన విషయమును విని కృష్ణప్ప మనస్సు-ఆశ్చర్యచకితమయ్యెను. ఆతఁడు రఘునాథుని బోల్చుకొనలేకపోయినాఁడు. తన్ను యుద్ధమున నోడించి చక్రవర్తి కొప్పగించిన దాతఁడే. ఏమి చిత్రమైన మనస్సు!.

కృష్ణప్ప రఘునాథుని జింజి కాహ్వానించెను. దేవతవలె యుపచరించెను. తనబిడ్డ కళావతి నొసఁగి వివాహము గావించెను. రఘునాథుఁడు దన పత్నితోఁగూడి-మరల-తంజాపూరికి తరలివచ్చినప్పుడు-మహారాణి మూర్తిమాంబిక-కుమారున కెదురువచ్చి-తనకంఠమందలి ముత్యాలహారము నాతని మెడలోవేసెను. రఘునాథుని జతలోనున్న కళావతినిజూచి-

"ఈ సుందరి యెవరు?"

"ఇది నా విజయలక్ష్మి జింజికృష్ణప్పనాయకునిబిడ్డ,

మహారాణి హృదయము సంతోషభరితమయ్యెను. దాని వాసనలంతఃపుర మంతయు గ్రమ్మెను. అంతఃపురమున నూరు వీణెలు మోగినవి.

కళావతియు - రఘునాధుడును జోడు వీణెలు మోయించితి.



రఘునాథుఁడు జింజికి వచ్చెను. అతడిప్పుడు వచ్చునని కృష్ణప్ప యనుకొనలేదు. అనిరీక్షితముగ వచ్చిన యల్లుని సత్కరించి - రాజయోగ్యమైన కళ్యాణ మహలులో దించికొన్నాడు.

కళ్యాణ మహలు అంతఃపురమునకు సమీపముననే యున్నది. ఇదియొక చిత్రమైన కట్టడము. మహలుచుట్టును సొగసైన గదులుండెడివి. ఎనిమిది యుప్పరిగెలు. వీనిపై-గోపురములు పైకి బోవుటకు ప్రతియొక్క యంతస్థునందును మెట్లున్నవి. ప్రతి గదియందును అతిథులకు గావలసినయన్ని యనుకూలములును సమృద్ధిగ నుండెడివి. ప్రతి గదిముందును-కమానులతో గూడిన బయటి వలయము. ఆ వలయమెంతో యందముగ గనుపించును. సామాన్యముగ గొప్ప వ్యక్తులకు మాత్రమే దీనిలో విడిది లభించుచుండెడిది.

అనుకొనకయే వచ్చిన యల్లునికి సంతోష సంభ్రమములతో నెంత యుపచరించినను-అతని యాగమనముతో కృష్ణప్పకు కొంత కలతయే కలిగినది. ఇతఁడు వచ్చుటకును-తన చిదంబరములోని ప్రవర్తనమునకును-ఏమైన సంబంధము కలదేమోనని యాతని యనుమానము. "చిదంబర" సంఘు

టనముతో మొసలే నిస్తేజ్స్సాహపూరితమైన యాతని ముఖము-అల్లుడిరాకతో మరింత వివర్ణమైనది.

కొన్ని దినములకు ముందు-చిదంబరములో నడచిన సంఘటన-యాతని చిత్తశాంతిని నాశముచేసినది. అక్కడ మరణించిన వారి ప్రేతములు దిన దినమువచ్చి తన్ను పీడించుచున్నట్లాతడు భావించును. ధర్మము పేరిట నక్కడ నడచిన హత్యాకాండ స్మృతిపథమున బారాడినప్పుడంతయు కృష్ణప్ప వణకిపోవుచుండెను. ఆ చిదంబర సంఘటనతోం జిత్తశాంతి చెడిన కృష్ణప్పకు-ఆకస్మికమైన రఘునాథుని యాగమనము కుతూహలమునకు గారణమైనట్లే - కలతకును గారణ మయ్యెను. ఇతని యీ వచ్చుట - మరేకొత్త యనిష్టములు దెచ్చిపెట్టునోయని యాతఁడు భయపడెను.

చిదంబరము ప్రాచీన కాలమునుండియు పవిత్రయాత్రా స్థలము. అదియానాఁడు జింజి కృష్ణప్పనాయకుని యేలుబడిలో నుండెను. చిదంబరములోని నటరాజ దేవాలయము చాల ప్రసిద్ధమైనది. ఆ కోవెల పదమూఁడెకరముల నేల నావరించి యున్నది. శైవులకాస్వామి యన్నప్రాణము. శైవులకు వలెనే-వైష్ణవులకును చిదంబరముయాత్రాస్థలమే. అక్కడ వరదరాజస్వామి యున్నాఁడు. ఆ స్వామి నటరాజాలయపు బ్రాకారములోనే వేంచేసియుండెను. చిదంబరములో నష్ట

డప్పుడు శైవవైష్ణవులకు పోరాటములు సాగుచుండెడివి. ఇవి రక్తపాతము వరకును బోవుచుండెను. చిదంబరమునకు జెందిన కథలు పురాణములలోనే యున్నవి. పల్లవ రాజొకఁడు నటరాజస్వామి యాలయము ప్రక్కనే-వరదరాజస్వామికిని యొక కోవెల గట్టెను. ఎన్నోయేండ్లాదైవము లిద్దరును-బరస్పర సహకారములతో జీవించిరి. తిరుమంగై యాళ్వారు వ్రాసిన "తిరుమూశై" గ్రంథమందును-చిదంబరములోని వరదరాజస్వామిని గూర్చిన స్తోత్రములుకద్దు. ఇక్కడి దైవమును కులశేఖరాళ్వారుగూడ పొగడిరి. ఈ వరదరాజ స్వామి పూజను "తిల్లై తిరుమలవాయిరవాన్" నడపుచుండె నట! మాణిక్యవాచకులుగూడ మత "తిరుక్కోవయ్యార్" గ్రంథములో-విష్ణుమందిరము నటరాజస్వామి యాలయము ప్రక్కనే యున్నట్లును అక్కడి విష్ణువు శేషశాయియైనట్లును వర్ణించినాఁడు. క్రీ॥ శ॥ 1125-46 లలో "చెన్నికుళోత్తుంగ చోళుఁడు" సింహాసన మెక్కెను. వీనికి "యిమ్మడికుళోత్తుంగ చోళుఁడ"నియు బేరు. వీఁడు పరమ శైవుఁడు. చిదంబర స్వామి యాలయముప్రక్కన విష్ణుమంది ముండుట వీఁడు సహింపలేకపోయెను. వాని తండ్రిదిగూడ నదే యభిప్రాయ మట! కాని వాఁడా యుద్దేశ్యమును నెఱవేర్చుకొనుటకుముందే మరణించెను. తండ్రియూహను కుమారుఁడు నెరవేర్పఁబూని నాఁడు. వాఁడు వరదరాజస్వామి యాలయమును బడగొట్టిం

చెను. ఆ విగ్రహమునుదీసి సముద్రమున ద్రోయించినాఁడు-వాఁడు తనచేసిన కార్యము నెంతో ఘనతగ నెంచెను. ఆనాటి నుండి "కృమిభయ" "తిరునీర్ చోళ" అనెడు రెండు బిరుదములను ధరించినాఁడు. ఈ కథయంతయు "పిళ్లెయ్ లోకంజియ్యాను" రచించిన రామానుజాచార్య దివ్యచరిత్రనుబట్టి తెలియును. చోళుఁడొనర్చిన దురాగతము రామానుజులకు దెలిసెను. వారి హృదయము ముడిఁకిపోయెను. వారాచిదంబరమునకువచ్చి యీ విగ్రహమును వెదకించిరి. దానిని తిరుపతికిఁజేర్చి - అర్చావతారమును గోవిందరాజస్వామి యాలయములో నిలిపి కొంతకాలము పూజించిరి. వారింతలో శ్రీరంగములో పరమపదించినారు.

విజయనగర సామ్రాజ్యము స్థాపింపఁబడినది. సంగములు శైవులు. వారిలోని కడపటిరాజు మల్లికారునుఁడు. వైష్ణవమును స్వీకరించెను. తరువాత సింహాసనము సాళువ వంశముచేఁజిక్కినది. అనంతరము తుళువ వంశము. కడపట నేలినది యారవీటి వంశము. వీరందఱు వైష్ణవులేయైనను-పరధర్మసహనము కలవారు. వారు-వైష్ణవధర్మముల కొసఁగిన ప్రోత్సాహమును-ఆశ్రయమును-ఇతరములకుఁగూడ నొసఁగిరి. కృష్ణదేవరాయల కాలమందును-అచ్యుతదేవరాయల కాలమందును-వైష్ణవులకెక్కువ ప్రోత్సాహము లభించెను. వారు తిరుపతి వెంకటేశ్వరుల భక్తులు. అచ్యుతదేవరాయఁడు

స్వామి సన్నిధానమునందే తన పట్టాభిషేకమును నిర్వర్తించు కొనెను. అచ్యుతరాయలు క్రీ॥ శ॥ 1526లో నొకసారి చిదంబరమునకు వచ్చెను. అతఁడు వైష్ణవ దేవాలయమునకు బట్టిన దుస్థితినిజూచి-దానిని జీర్ణోద్ధార మొనర్చినాఁడు. ఆ యాలయమున వరదరాజులనుగూడ స్థాపించినాఁడు. ఈ మహా కార్యమున ముఖ్యముగ భాగము వహించినవారు తిరుమల తాతాచార్యులు-కంబాళ్ళదొడ్డయాచార్యులు.

వీరికి మహాచార్యబిరుదముగూడ నుండెను. ఈ నడుమ దొరకిన యొక శాసనములో సమూర్తిట్ అచ్యుత దేవ రాయఁడు "ముదిలంబట్టి" చావడిలో వైఖానససూత్ర విధుల ననుసరించి-వరదరాజస్వామి నుద్ధరించెననియున్నది. దేవునకు ఐదువేల వరహాలు ఆదాయముగల నాల్గు గ్రామములనుగూడ దానమొసఁగెను! ముదిలంబట్టిచావడి" యనునది చిదంబరము నకు మారుపేరు.

అచ్యుతరాయని యనంతరము సదాశివ దేవరాయఁడు వచ్చెను. పిదప-ఆరవీడు వంశపువారైన రామరాజ-తిరుమల రాజ-శ్రీరంగరాజ-వెంకటపతి దేవరాజులు సింహాసనము నెక్కిరి. వీరికాలమునను వైష్ణవమతమునకు ప్రోత్సాహ మ్మామేడితమైనది. కాని-యీ రాజులు శైవమును నాశ మొనర్పలేదు. శైవవైష్ణవముల సారాసారములను నిర్ణ యించుటకు బండిత గోష్ఠులను నడపుచుండిరి.

కృష్ణప్పనాయకుఁడు విష్ణుభక్తుఁడు. వెల్లూరి చిన్నబొమ్మనాయకుఁడు పరమశైవుఁడు. ఇతఁడు కృష్ణప్పనాయకునకాశ్రితుఁడు. శివభక్తుఁడై—శైవమత ప్రచారకుఁడై—శ్రీకంఠభాష్యము మొదలైన గ్రంథములు రచించిన అప్పయ్యదీక్షితులకు చిన్నబొమ్మనాయకుఁడాశ్రయమొసఁగెను. ఒకసారి వైష్ణవ పండితుఁడు చిదంబరములో నప్పయ్యదీక్షితులను వాదమున నోడించెనట. మరియొకసారి అప్పయ్యదీక్షితులు తాతాచార్యులవారి నోడించెను. కుంభకోణమునందలి శ్రీ విజయీంద్రతీర్థులు శైవమతాధీశ్వరులను వాగ్వాదమున గెల్చిరి.

ఇట్లు కొంతకాలము వాదములు పాండిత్యములలో నుండెడివేగాని — చేతలకు దిగలేదు. కృష్ణప్పకాలమందా యోగము ప్రాప్తించినది. జింజికృష్ణప్ప వైష్ణవుఁడైన యవకాశమును వినియోగించుకొని-చిదంబరములోని వైష్ణవులు-తమ యధికారము నెచ్చించికొనుటకు బ్రయత్నించిరి. వారు చిదంబరమును వైష్ణవక్షేత్రముగా మార్చుటకెత్తులు వేసినారు. దీనితో కక్షలు బయలుదేరినవి. ఈకక్షలు రక్తపాతములోనికి దిగునేమోయని అప్పయ్యదీక్షితులు భయపడిరి వారు తమ ప్రభువైన వేలూరు లింగమనాయకుని సాయముతో నీప్రయత్నమును నివారించుటకై పాటుపడిరి. అదిసాధ్యపడలేదు. కడకు వారే జింజికి ప్రయాణముగట్టినారు. జింజి కృష్ణప్ప

నాయకునివారు దర్శించిరి. "ప్రభూ! ఉత్కృష్టమైన మీ వైష్ణవాభిమానము-పవిత్రమైన చిదంబర క్షేత్రములో రక్తపాత మగుటకవకాశము గల్పించుచున్నది. పూర్వము నుండియు నది శైవక్షేత్రము. దాని నిప్పుడు మార్చుటకు వారెన్నడు నంగీకరింపజాలరు. వైష్ణవు లొనరించుచున్న యీ దుర్వ్యవసాయము మీరు నిల్పకున్నచో - రక్తపాతము తప్పదు. బ్రహ్మహత్యాపాతకము-రక్తపాతదోషము మీతలపై నిలిచితీరును. మీరీ ప్రజాక్షోభ నివారింపవలెను. ఈ ధర్మక్షోభ నడ్డగింపవలెను. వైష్ణవులు చిదంబరములో జేయ నిశ్చయించుకొన్న దేవాలయ జీర్ణోద్ధారకార్యము నిల్పివేయింపవలెను. వరదరాజస్వామికి జేయింప ప్రయత్నించుచున్న విశేషోత్సవములను నివారింపవలెను. లేకున్నచో-జరుగబోవు హత్యాకాండలోని పాపమునకు దమరే ప్రధాన భాగస్వాములు కాగలరు"

ఈ హెచ్చరికలు వైష్ణవుడైన కృష్ణప్ప చెవికెక్కలేదు. వాఁడు జీర్ణోద్ధార కార్యమును ముందుకు సాగించుచునేవచ్చెను.

రాజే పూనుకొన్నచో నిక జెప్పెడిదేమి? దేవాలయ జీర్ణోద్ధారము త్వరత్వరగా సాఁగిపోయినది. నూర్లకొలఁది శిల్పులు రాత్రింబవళ్లు బనిచేసిరి. దేవాలయము నంతయు నిర్మించి గోపురము నెత్తిరి. స్వామి ప్రతిష్టకు ప్రశస్తమైన

లగ్నముగూడ నిర్ణయింపబడెను. ఈ యుత్సవమున భాగము వహించుటకు నలుమూలలనుండి వైష్ణవస్వాములు వచ్చినారు. ఆ వచ్చినవారిలో కొందరు దానధర్మములకై వచ్చినవారు. మరికొందరు దైవారాధనకై వచ్చిరి. కొందరు-వైష్ణవ ధర్మోద్ధరణ కార్యము నెత్తిపై వేసికొని వచ్చినారు. ఈ కోలాహలమునుజూచి - చిదంబరములోని శైవులు బెదరి వారికి తమ ధర్మమును - దైవమును - నిలువవని తోచినది. వారందఱు-నటరాజదేవాలయ ప్రధానార్చకుని యింటిలో-సభదీరినారు. నడపవలసిన కార్యమునుగూర్చి చర్చించిరి. వాదోపవాదములు నడచెను. కడకందఱు కృష్ణప్పనాయకుని దర్శించి-శైవధర్మమును గాపాడుడని వేడుకొనుటకు నిశ్చయించిరి.

వరదరాజస్వామి యుత్సవవిశేషమునకై కృష్ణప్ప అప్పటికే చిదంబరమునకు వచ్చియుండెను. వారందఱు కృష్ణప్ప ప్రాసాదము ముందాగిరి. ప్రధానార్చకుడు లోనికేగెను. వారికిట్లు విన్నవించెను.

"మహారాజా! అనాదికాలముగ చిదంబరము శైవక్షేత్రము. వైష్ణవులీ క్షేత్రమును మార్పయత్నించుచున్నారు. ఇది యనుచితమని మేమెన్నోసారులు తమకు నివేదించుకొంటిమి. కాని మాకోరిక యీడేరలేదు. ఇప్పుడు చిదంబరమంతయు-

వైష్ణవమయమైనది. వారిసంబరముజూచినచో నటరాజస్వామి దేవాలయముపై బడి వెడలునట్లుగ పడుచున్నది. అపౌరుషేయమైన తమ ధర్మమునకును తమదైవమైన నటరాజస్వామికిని-భయముగల్గునని శైవులు బెదరుచున్నారు. మీరుపరమ వైష్ణవులైనను పరమత సహిష్ణుత గలవారు. మీకుశైవులును వైష్ణవులును రెండు కన్నులు. మీరు మా భీతిని నివారించి-శైవ ధర్మమున కభయ మొసఁగవలెను.”

జింజికృష్ణప్ప కీ మాటలు చెవిలోబడినట్లే లేదు. ప్రధానార్చకుడు మరల నిట్లనెను.

“మాకు పరమత ద్వేషములేదు. వరదరాజస్వామి యుత్సవములను మేము విరోధించుటలేదు. ఆ స్వామి దేవాలయ జీర్ణోద్ధరణము జరుగుటలో మాకు విప్రతిపత్తి లేదు. వైష్ణవ దేవాలయమునకు దొరకు దాన ధర్మములు-నటరాజ స్వామికిగూడ చెందవలెను. శైవ దేవాలయము నుదాసీనముగజూచి-వైష్ణవ ధర్మమునకే యెక్కువ ప్రోద్బలమిచ్చిరన్న యపకీర్తి తమకు రారాదు. ఇదే మా విన్నపము.

ప్రభువు తల పైకెత్తెను.

“అయ్యా! మీరు చెప్పుమాట లాపాతమధురముగ నున్నవి. మేము శ్రీవైష్ణవులమగుట మా దోషమా యేమి?

శిథిలమైన విష్ణుమందిరమును జీర్ణోద్ధార మొనర్చుటకు బ్రయత్నించుటలో—మీ ధర్మమునకే హాని గల్గినది? ఈ సమయమున గొన్ని విశేషోత్సవము లేర్పాటు జేసికొనుచున్నాము ఇందులో నే నాసక్తి జూపితి నంతే, అంతమాత్రమున శైవ ధర్మమునకు—నటరాజస్వామికి నేను చేసిన యపచార మేమున్నది? ఉత్సవ దర్శనార్థమై వైష్ణవు లిందు చేరినారు. వారు చేరినంతమాత్రముతో మీ స్వామిగౌరవమేల తగ్గినది? వారికి మీ ధర్మమున కపచారము గూర్చనుద్దేశ్యము లేదు. మీరే యేవో కొన్ని కారణములు గల్పించుకొని భయపడుచున్నారు. అదికేవలము మీ భ్రాంతి."

"అట్లయినచో – వరదరాజస్వామి యుత్సవములకు డబ్బును–నీటివలె ఖర్చుపెట్టుతాము–అట్లే–జనుల యభిమానమునకు బాత్రుడైన నటరాజస్వామి యుత్సవములకును యేల వినియోగింపరు? ఒక కంటికి వెన్నయు–వేరొక కంటికి సున్నమునా? మీ వంటివారి ఘనతకీ నడవడి తగినదికాదు."

కృష్ణప్పనాయకుని కన్నులెఱ్ఱనైనవి. అతని పదవి చలించెను.

"మా ఘనతను బరీక్షించుటకు మీ రెవ్వరు? మీ యధికారమేమి? మేమేమైన దురుసుగా మాటాడినచో శైవ ధర్మముపై మాకు అయిష్టము గలదనుకొందురని—మీ

వాక్యముల నింతవరకును సహించితిమి. మీరు నా యోర్పును దురుపయోగ మొనర్చుకొనుచున్నారు. మా తాల్మికి మితి యున్నట్లే-మీ యౌద్ధత్యమునకును మితియనున దుండవలెను. మాపై లేనిపోని యారోపణలు చేయుచున్నారు. శైవక్షేత్రమైన చిదంబరమును-వైష్ణవ క్షేత్రముగా మార్చుటకు వచ్చినవానికిగ్రింద నన్ను జమ కట్టుచున్నారు. మీరు కలియుగ ఘంటా కర్ణులాయేమి? విష్ణు నామ స్మరణ మీకెంతకంత యయిష్టమయినది. వరదరాజస్వామి యుత్సవములను మీరు సహింపలేకపోయినచో నా రాజ్యమున నుండవలసిన యక్కఱలేదు.”

కృష్ణప్ప సింహమువలె గర్జించినాడు.

శైవ బ్రాహ్మణుని ముఖము వివర్ణమయ్యెను.

“ప్రభూ నా మాటలకు మీరు కోపింపరాదు. మీపై లేనిపోని యారోపణలుచేసి యపచార మొనర్చుటకు నేను రాలేదు. మీ యాశ్రితులయిన జనులలో వైష్ణవులేగాదు-శైవులుకూడ నున్నారను విషయమును దమరు మరచిపోరాదని నా మనవి. వీరందరినుండి మీకు రాబడి యున్నది. మరి తమ ధనము-వైష్ణవ ధర్మమున కొకదానికి వెచ్చించినచో శైవులు బాధపడరాయేమి?

మా రాజ్యములో - శైవులేకాదు. క్రైస్తవులున్నారు బౌద్ధులున్నారు. జైనులున్నారు. శాక్తేయులున్నారు. నేను-ధనమును-ఒక వైష్ణవ ధర్మమునకే ఖర్చుపెట్టుటలేదు ఇక్కడి వరదరాజస్వామి దేవాలయ పునరుద్ధారములో వైష్ణవులకెంత బాధ్యత కలదో-యితర మతములకును నంతే బాధ్యత కలదు. కాని-ఉగ్రశైవులైనమీరు-ఆదేవాలయము నింతవఱకు జీర్ణోద్ధారమొనర్పక - యుదాసీనులైతిరి. అంత మాత్రమేకాదు. ఆ యాలయము నచటినుండి తీసివేయుటకు-కులోత్తుంగుని కాలమునుండి బ్రయత్నించుచు వచ్చుచున్నారు. మీరు మాకీనాడు - అన్యమత సహిష్ణుతను బోధించుచున్నారు ఇంతగొప్ప మనస్సుగల మీరు-ఇంతకు ముందే దేవాలయ జీర్ణోద్ధారము నేల చేయనైతిరి? ఈ కార్యము మీరే నెరవేర్చియున్నచో-మే మీనాడు బ్రయత్నము చేయవలసిన పని యుండియుండదుగదా? ఈ నాడు మా కవకాశము గల్పించినది మీరే. ఇది మీ యుదాసీన్య దోషము.”

“అయినచో-మీరు రేపటి యుత్సవములు నిలుపరన్న మాట.”

“ముమ్మాటికిని నిలుపము. దానికి గావలసిన

యేర్పాటులన్నియు నైపోయినవి. శాస్త్రవిధి ననుసరించి స్వామి ప్రతిష్ఠ జరిగియే కావలెను. జరిగితీరును."

"ఇది మీ కట్టకడపటి నిశ్చయమా?"

"అవును!

"అయినచో మేము దీనిని జరుగనివ్వము."

"ఏమి చేతురో చూచెదను"

"మా దేహములను బలియిచ్చియైనను రేపటి కార్యమును నిలిపితీరెదము."

శివార్చకుని నఖశిఖ పర్యంత మొక్క టే పరమశివుని ఫాలాగ్నియైనది. కృష్ణప్పకు కన్నులు బైరులు గ్రమ్మెను. కాని వానిది మొండిపట్టు. అంతలో తెప్పరిల్లుకొని ఫక్కున నవ్వెను."

మరునాటి సుప్రభాతమున-దేశములోని పుణ్యక్షేత్రములనుండి వచ్చిన పుణ్యోదకములతో వరదరాజస్వామి కభిషేకము జరిగెను. ఆ కనక కుంభములపై బడిన సూర్యకిరణములు-మాహేశ్వరుల దేహములపై మిట్టించి-నూదులవలె గుచ్చుకొన్నవి. వరదరాజులకు బుణ్యార్చనము - ప్రాణప్రతిష్ఠాపన-హావన హోమములు వరుసగా జరిగినవి. 'మహాబలి'

మంగళ హారతులు జరుగవలసి యుండెను. ఇంతలో నొక సేవకుడు తొందరగ బరువెత్తికొనివచ్చెను.

"ప్రభూ! అన్యాయమన్యాయము."
"ఏమా యన్యాయము?

కృష్ణప్ప కణిపై చేయివైచి గట్టిగా నఱచినాఁడు. 'నటరాజస్వామి ప్రధానార్చకులు - పరమమాహేశ్వరులు దేవాలయ గోపురమునుండి దూకి యాత్మహత్య నొనర్చికొన్నారు. వారిననుసరించి-చిదంబరములోని శైవులందరును మిమ్ము శపించుచు గోపురమునుండి దూకి చచ్చుచున్నారు."

కృష్ణప్ప కీ మాటతో బిచ్చియెత్తినట్లయినది. అతఁడు మహాద్వార గోపురమువద్దకు బరువెత్తికొనివచ్చెను. అప్పటికి నూరారు శైవులాత్మహత్య లొనర్చికొన్నారు. అదొక భయంకరమైన-మర్మభేదకమైన దృశ్యము. కృష్ణప్ప దానిని చూడలేక పోయెను. వాఁడు కన్నులుమూసికొన్నాఁడు. ఇంతలో ప్రధానార్చకుని పత్ని-పిచ్చిదానివలె తల విరియబోసికొని యేడ్చుచు వచ్చినది. ఆమె యా నాఁడు మధురను శపించిన "కణ్ణకి" వలె నుండెను. ఆమె కృష్ణప్పను జూచెను. ఆమె శరీరమావేశముతో గంపించినది.

"నీచా! నా ప్రాణములకన్నను ప్రియమైన నా పతి నాహుతిగొన్నావు. నా స్వామి యాత్మహత్యకు నీవే కారణము. ఇకనైన సుఖముగా నిద్రపో. మా పీనుగలపైన వైష్ణవ ధర్మమును నిర్మించికో. పరమపాతకీ! నీ వంశము నాశమగుగాక!

ఆమె కన్నులనుండి చిమ్మిన రక్తమును దోసిలితో బట్టి వానిపై జల్లినది. అక్కడనున్న యొక రాతి స్తంభమునకు బలముగా గ్రుద్దుకొన్నది. ఇకనేమున్నది? మఱుక్షణమే యా పుణ్యావతి పీనుగైనది. ఆమెను రక్షించుటకు కృష్ణప్ప చేసిన యత్నములన్నియు విఫలము లయ్యెను. ఈ హత్యాకాండతో వాని కడుపులో జేయిపెట్టి కలచినట్లయినది. తీర్థప్రసాదములు తీసికొనిరావలసినదని మహామంత్రికి దెలిపి, వాఁడు జింజిదారి పట్టెను. ఊరువిడిచి వచ్చినను వానికి శాంతిలేదు. ఆ దృశ్యములు వాని కన్నుల మెదలుచుండెను. రాత్రిలందు వానినేవో భూతములు వచ్చి పీడించుచుండెను. వాడెంతయో పశ్చాత్తాపపడినాఁడు. రఘునాథుఁడిప్పుడీ యూరికి వచ్చుటకును చిదంబరములో నడచిన కథకును నేమైన సంబంధమున్నదా యేమి?

అది వాని సందేహము.

# ౮

సామాన్య కుశల ప్రశ్నలు ముగిసినవి. అది సాయం కాలము. దూరమున గిరి దుర్గమునుండి మందమారుతములు వీచుచుండెను. ఆ వాయువులతో చామర గ్రాహిణుల యవసరమును లేకపోయినది. తాంబూల కరండ వాహికలును కృష్ణప్ప మానతిచే దూరముగ దొలఁగిపోయిరి. కృష్ణప్ప నాయకుఁడు-రఘునాథుని ముఖముపై చూపు నిలిపి యిట్లు వచించెను. "తాము చాల దినముల తరువాత-జింజికి దయచేసితిరి? ఇంతకాలమునకైనను మేము మీకు జ్ఞాపకమునకు వచ్చుట మా భాగ్యము. మీరు వచ్చునపుడు మా బిడ్డయైన "కళావతి"ని గూడ తోడ్కొని వచ్చియున్నచో-చాల సంతోషముగ నుండెడిది. మహారాణి తనబిడ్డను చూచి చాల రోజులైనదని. పొట్టుపొరలుచున్నది. ఈ విషయమున మే మనేకసారులు-తమకు మనవుల నంపికొంటిమి. కాని యవి మీ తిరుమనస్సునకు రాలేదు. అది మా దౌర్భాగ్యము. మేము తమకు విశ్వాసపాత్రులముగాకపోవచ్చును. కాని మా యంతఃపురము తమకుజేసిన యపకారమేమి? మా మీనడుమ రాజకీయములలోభిన్నాభిప్రాయములు-వైమనస్యములున్నను పరవాలేదు. అవి తలిబిడ్డల సంబంధమునకే యెడబాటు

లాగా నుండవలెనా ఏమి? దయచేసి యికనైనను-ఒకసారి మా కళావతీదేవిని జింజికి పంపినచో చాల సంతోషింతుము. మా యంతఃపురమామెను కన్నార చూచి మరల వెనుకకు పంప గలదు.

కృష్ణప్ప నాయకుని కంఠము గద్గదమైనది.

రఘునాథుడీప్రశ్న జింజికృష్ణప్ప వేయునని భావించి యుండలేదు. అతనికీ సంభాషణ-కేవలము హఠాత్తుగ జరిగి పట్లుండెను. రఘునాథుని మనస్సు చివుక్కు-మన్నది. "మీరు మమ్ము తప్పుగా నర్థముచేసికొనుచున్నారు. కళావతి ఇచ్చ టికి-వచ్చుటలో మేముగాని-తీర్థరూపులైన మా తండ్రిగారు గాని-యడ్డుపెట్టినది లేదు. కాని కళావతీదేవియే యిచటికి వచ్చుటకు సమ్మతింపలేదు."

"కారణమడుగవచ్చునా?"

"ఆమెకు దాక్షాయణీదేవి కథ బాగుగా తెలియును. వతికి గౌరవము లేనిచోట-తనకుగూడ గౌరవ ముండదని యే యిల్లాలికి దెలియదు?"

"అనగా మిమ్ము మేము గౌరవముగా చూచుకొనుట లేదన్నమాట"

జింజి కృష్ణప్ప మొగమున నాశ్చర్యముద్ర తొంగి చూచినది. "కాదా...? రాజకీయములలో మనకున్న భిన్నాభిప్రాయము లెంత తీవ్రములో-ఆమెగూడ నెఱుగును.

మే మెంత ప్రబలులైనను, సామ్రాజ్యము నాశ్రయించికొని బ్రతుకువారము. చక్రవర్తుల పాదసేవకులము. మీకు సామ్రాజ్యముపై గౌరవము లేదని మా స్వజనమునకుఁ దెలియును. వారి యధికారమును ధిక్కరించుచున్నారనుటయు కళావతికి దెలిసినదే-ఆ స్వవమింతే"

"అట్లయినచో-మీరు-తమ ప్రీతి గౌరవములకు మమ్ము నర్హులుగ భావించికొన్నారన్నమాట!.....అది మా దురదృష్టము." జంజికృష్ణప్ప గొంతుకలో తొలుత కాఠిన్యము గనిపించెను. వెంటనే దానినాతఁడు సౌజన్యముగ మలచికొన్నాఁడు.

"మేమెవ్వరిని నిష్కారణముగ ద్వేషింపము. తక్కువగను చూడము. కాని సామ్రాజ్యమునకు ద్రోహమొనరించువారిని మా శత్రువులుగనే పరిగణింతుము. ఇది నిజము "రఘునాథుని కంఠములో భావ దార్ఢ్యము స్పష్టముగ గోచరించెను. "మేమొకసారి తప్పొనరించితిమి. చక్రవర్తుల కొనర్చిన ద్రోహమునకు—తగినశిక్షగూడ ననుభవించినాము దానికెంతయో పశ్చాత్తాపపడితిమను విషయము గూడ మీకు దెలియనిదిగాదు. ఇంత తెలిసియు మమ్ము సందేహించి వచో అది మా దురదృష్టమే! అంతమాత్రమేగాదు. మమ్ము చెఱ

నుండి విడిపించి మహోపకార మొనర్చిన రఘునాథనాయకులే మమ్ము సంశయించుట ఘోరమగు దురదృష్టము."

కృష్ణప్పనాయకుని ముఖముపై విషాదచ్ఛాయలు గోచరించినవి. అవికృతకములే. కాని వానిని సత్యముగ గన్పింపజేయు చాతుర్యము వానికుండెను. ఈ మార్పును రఘునాధుడు పసిగట్టకపోలేదు.

"కృష్ణప్పనాయకా! ఇన్నిమాటలెందుకు? మేము మిమ్ముల నాప్తులుగ పరిగణించిన కాలమొకటి యుండెను. మీరు నిజముగ పశ్చాత్తాప తప్తులై తిరని నమ్మిన కాలము గూడ నుండెను. కాని నేడది కల. మీరు నక్రివస్త్రుల యుప్పు తినుచునే వారికి ద్రోహమొనర్ప బూనుకొనుచున్నారు. ఇది నిజము కాదా?"

ఈ మాట జింజికృష్ణప్ప హృదయమునకు రఘునాథుడు సూటిగా వేసిన ప్రశ్న.

"మరి యిట్టిచో-మనకు స్నేహ సంబంధము లెట్లొనగూడును?"

"మేము సామ్రాజ్య ద్రోహులమని మీరు స్పష్టముగ తీర్మానించి కొన్నారన్నమాట! దీని కాధారములు?"

కృష్ణప్ప కనుబొమ్మలు కొంచెముగ వక్రములైనవి. అతడాసనముపై నిటారుగ గూర్చుండినాడు. ఆ కూర్చుండుట కోడెనాగును కెదికినపుడు-ఫణమెత్తుటవలె నుండెను.

రఘునాధుడు నవ్వెను. ఆ నగవులో వింధ్యారణ్యములలోని మోదుగ పూలకాంతి పూచినది.

"దాని కాధారము మీ మనస్సునే యడుగవలెను. మీరు ముంజేతి కంకణమునే మూయజూచుచున్నారు. ఈ నడుమ తమరి నడవడులన్నియు నందుకు సాక్ష్యములే!"

"మేము సామ్రాజ్యమునకే ద్రోహమును చేసినట్లు మాకు జ్ఞాపకము లేదు."

"అనగా తమ ద్రోహ చింత లింకను ఫలింపలేదన్న మాట! మధుర ముత్తు వీరప్పనాయకునితో తమ స్నేహము నిజమా కాదా? ఆతడు సామ్రాజ్యద్రోహి యనుట స్పష్టమా కాదా? అతనితో చేరి మీరు స్వతంత్రులగుటకు మరల ప్రయత్నించుట లేదా?"

జింజి కృష్ణప్ప ఘక్కుమని నవ్వెను. ఆ నవ్వులో పది భావములు. ఈ విషయ మీతనికెటు దెలిసెనను నాశ్చర్యము గూడ నుండెను. రఘునాధుని ఖేలుపుచ్చుటకై విసరిన పాశమది.

"మీరింత యమాయకులని నే ననుకొనలేదు. నీలివార్తలన్నియు నమ్ముటకు మొదలు పెట్టినచో బ్రతుకొక నిమేషము గడవదు.

"మామగారూ? మీ యిర్వురి సంబంధమును గూర్చిన యాధారములు నాకడ కుప్పలకున్నవి. స్పష్టమైన సత్యమును ఋజువుచేయుట యనవసరము, ఒకటి మీకు మనవిచేయు చున్నాను. ఆ ద్రోహి మత్తు వీరప్పను నమ్మినచో మీకు క్షేమములేదు. సర్వనాశమగుట తప్పదు.

జింజి కృష్ణప్ప కొన్ని నిమేషములు మౌనముగ గడ పెను. దూరమున కొండలనుండి చీకటులు కవిసికొని వచ్చు చుండెను కడకాతఁడిట్లు పలికెను. "రఘునాధనాయకా! ఇఁక ముసుఁగులోని గుద్దులాటలెందుకు! స్పష్టముగనే మాటాడుకొందముగాక. చక్రవర్తులపై మీకున్నంత గౌరవము మాకులేకపోవచ్చును. కాని సామ్రాజ్య హితా సక్తిలో తక్కిన సామంతులకంటెను మే మెందులోఁనను తక్కువగాదు."

"సామ్రాజ్యమునకు హితము గలుగవలె ననుటయే మీ యభిప్రాయమైనచో-చక్రవర్తులపై తిరుగఁబడుట కేల ప్రయత్నించుచున్నారు? అది సామ్రాజ్యమును నాశము నర్చుటకాదా?"

"కాదు, సామ్రాజ్య హితాసక్తిలో-జింజి యే మాత్ర మును వెనుదీయదు. కాని, ప్రస్తుతము దక్షిణదేశ రాజకీయ ములన్నియు నాలోచించి సామ్రాజ్య గౌరవమున కేది

హితమో-యీ మార్గమున బ్రవర్తించుచున్నాము. చక్రవర్తులను గౌరవించుటకంటెను-సామ్రాజ్య గౌరవమును నిలుప యత్నించుట గొప్పకార్యము.

"మీరిపుడు చక్రవర్తులకు విశ్వాసద్రోహ మొనర్చుచున్నారు. ఈ ద్రోహములో సామ్రాజ్య క్షేమ మెట్లణగి యున్నది?"

"మాది విశ్వాసద్రోహమో కాదో భవిష్యత్తు నిర్ణయించును. కాని ఒకటి మాత్రము ధైర్యముగ చెప్పెదను, మా యీ తిరుగుబాటు సామ్రాజ్యమునకు మహత్తరసేవ యని మా దృఢ సంకల్పము."

"అదెట్లో మేము వినవచ్చునా?"

"పూజ్యులైన విద్యారణ్య మహర్షి యే పవిత్రోద్దేశ్యములను సాధించుటకై సామ్రాజ్య నిర్మాణ మొనర్చిరో వాని నిలిపికొనుటయే మా యాదర్శము."

"అనగా...."

"విజయనగరము తల్లికోట యుద్ధములో నోడిన తరువాత-నెంతగా శిథిలమైనదో తమ కెరుగనిదిగాదు. దాని యంగ సంధులు దిక్కులకు జెదరిపోయినవి. ఈ సత్యము నెవ్వరును దాచలేరు. ఒకానొకనాడు కృష్ణదేవరాయలు తురుష్కులకు సింహస్వప్నముగ నుండెను. వారు బిజాపురముపై కెత్తిపోయి తమ పూర్వులు సాధింపక విడిచిన

"రాయచూరు" లగ్గలు వట్టి సాధించినారు. "యవన భూమీధవ స్థాపనాచార్యు"లైనారు. ఈ నాటి చక్రవర్తుల కాబలమేదీ? బహుమనీ సుల్తానులన్నచో - వెంకటపతి దేవ రాయలు గడగడ వణకును. ఒకనాఁడా చక్రవర్తులు చతుస్సముద్రాధీశ్వరులు. సింహళమువారికి కానుకలు పెట్టెను. "గోవా" వారి యదుపాజ్ఞలలో నుండెను. నేఁడు వెంకటపతిరాయల శ్వేతచ్ఛత్రము-బహుమనీ రాజుల కృపా దృష్టినాశ్రయించికొని బ్రతుకుచున్నది. ఆ సమ్రాట్టుల విక్రమ సాహసములు నేటి చక్రవర్తులలో మందునకును గన్పింపవు: వెంకటపతి దేవరాయలు పేరునకు మాత్రమే చక్రవర్తి. అతని యధికారమెన్నఁడో చిదికిపోయినది. మరి యిట్టివారికి సేవలొనర్చుట శవమునలంకరించుటగాదా? ఈ శవమునకు చేయవలసిన సేవ, యంత్యక్రియ యొక్కటే!"

రఘునాథుని కన్ను లెఱ్ఱవారెను. ఆ మెఱుపు పాటలీ పుష్పముల తిరస్కరించుచుండెను.

"అయినచో తమ నిశ్చితాభిప్రాయమేమి?

కృష్ణప్పనాయకుఁడు మరియొకసారి నవ్వినాఁడు. ఆ నగవు రఘునాథుని కోపముపై మంచుజల్లుటకు. "మనము నల్వురమును సామ్రాజ్యమునకు మూలస్తంభములము. మన పైననే సామ్రాజ్యమనెడి యీ భవ్య మందిరము నిలిచినది.

మన మంచలజాకును గడ్డకు వచ్చినచో-విజయనగర సామ్రాజ్యము చెప్పకయే కూలిపోవును. మనము స్వతంత్రులమై-యొక్కొక్కరము ప్రత్యేకముగ విద్యారణ్యుల యభిప్రాయములను బండింపవచ్చును. ఈ నాల్గు సామ్రాజ్యములును స్వతంత్రముగ నెదిగి మహా వృక్షములై దక్షిణదేశము నంతయు తమ నీడలతో కప్పివేయును. మనమిప్పుడు మఱ్ఱిచెట్టు క్రింది చెట్లవలె నున్నాము. ఆ చెట్టు తాను బ్రదుకదు. మనలను బ్రదుకనివ్వదు. ఇది మా నిశ్చయము. ఈ యభిప్రాయము మీకు విరుద్ధముగ నున్నంత మాత్రమున-మమ్ము మీరు ద్వేషించుట రాజనీతి గాదు."

కృష్ణప్ప మరియొకసారి వ్యంగ్యముగ నవ్వెను.

"అయినచో మీరు వెంకటపతిరాయలను సింహాసన భ్రష్టు నొనర్పుటకై యత్నించుచున్నారన్నమాట! యిక మీరే దాక్షిణాత్య చక్రవర్తులు. అంతేనా?

రఘునాథుఁ డాశ్చర్యముతో నడిగెను.

"అవును-బలములేని చక్రవర్తి నిగౌరవించి-యాత్మవంచనము చేసికొనుట కంటెను-స్వతంత్రులుగ బ్రదుకుటమంచిది. కాలమున నెన్నియో సామ్రాజ్యములు పుట్టినవి-పోయినవి, మా దృష్టిలో తంజావూరు, జింజి, మధుర, శ్రీరంగపట్టణములు స్వతంత్ర రాజ్యములుగ నభివృద్ధి జెందవలెను. విజయనగర

సామ్రాజ్యమే పవిత్రమైన యాదర్శమును సాధించుటకై జన్మించెనో—ఆ సాధన కిది యొక్క చేదారి.

"ఇవి మీ యూహలు మాత్రమే."

"అనగా....

"ఆవల బహమనీ సుల్తానులు మహా ప్రబలులన్న సంగతి మీ కెరుగనిదిగాదు. మనమందరము గూడుకొని వారిని సంఘీభూతముగ నెదిర్చిననే జయించుటకు సాధ్యమగును. విడిపోయినచో మనల నందరిని వేరువేరుగ వారు నాశమొనర్తురు. తంజావూరు, జింజి, మధుర మొదలైన చిన్నచిన్న రాజ్యములు వారి నెదిర్చి నిలువలేవు. ఈ సత్యమును మీరెప్పుడైన నాలోచించినారా?"

"ఆలోచించ కేమి ఆలోచించియే యీ నిర్ణయమునకు వచ్చినాను. నేడు సామ్రాజ్య మెక్కడనున్నది? చక్రవర్తిగ నెవడో యొకడు కనపడుచున్నాడు గనుక నే-తురుష్కులు మాటిమాటికి దానిపై దండెత్తుచున్నారు. దానిని చూచునప్పు డెంతయు వారికి గుబ్లిజ్జ్రినగుచున్నవి. మనము విడిపోయినచో వారు మనపైకి రానేరారు. వచ్చినను మనము వేరువేరుగ వారితో సంధి యొనర్చుకొనవచ్చును. పైగా వారి బలములు గూడ నేటికి సన్నగిల్లెను. ఇంతకుముందు మనతో పొందిన పరాభవములు వారు మరువలేదు."

"మీరేవో కలలు గనుచున్నారు. మీ యూహలలో వ్యవహార దక్షత కనుపింపదు."

"ఎందుకు? నా మాటలలో వ్యావహారికత కావలసినంత యున్నది. నిష్ఠతో మనము పనిని చేయవలెనంతే. మనకిప్పుడు పరిస్థితు లనుకూలముగ నున్నవి ఇంతకుముందు విజయనగర సామ్రాజ్యము - శాఖోపశాఖలుగ పెరిగిన- యశ్వర్థ వృక్షమువలె నుండెను. నేడు దాని నెత్తిపై పిడుగు పడినది. ఇదివరకున్న శక్తులు దానికిప్పుడు లేవు. మనమేమియు నొనర్పకున్నను, కొలదికాలములో నది నష్టమగుట తప్పదు. దానితో చేరియున్నచో మనగతిగూడ నంతే; ఈ విషయమును మీరు చక్కగా నాలోచింపవలెను."

రఘునాథుని శరీరమావేశముతో కణకినది. అతని మాటలు తడబడజొచ్చెను. ఓష్ఠము చలించినది.

"ఇది సాధ్యముకాని పని. అన్నముతిన్న యింటికి ద్రోహమెంచుట మన దేశములోని క్షత్రియున కసాధ్యము. ప్రాణములు నేడుండును. రేపుండవు. కాని కీర్త్యపకీర్తులు స్థిరములు. మీరు నాతో నిక నిట్టి సంభాషణలు చేయరాదని మనవి.

"నామాటలకు మీరు వేసరిక పడరాదు. ఉన్నవిషయమును విన్నవించినాను. మీరీ సామ్రాజ్య నిష్ఠతో సాధింప దలంచిన మహాఫలమేమో దెలియవచ్చునా?"

"ఒకవైపు ముసల్మానుల యాక్రమణము. మరియొకవైపు సామంతులలోని యంతఃకలహములు. వీని నన్నిట నణగించుటకు-సామ్రాజ్యమున కాయుస్సు బోయవలసిన యావశ్యకత యున్నది. వానిని నిలిపి కొనుటకు తన సర్వస్వమును ధారవోయుటకు, తంజావూరు, జంకదు" "దక్షిణ దేశమున స్వతంత్ర రాజ్యములు నెలకొన్నచో-అవి పరస్పర ద్వేషములతో నాశమగునని మీ రేల భావించవలెను? అవి పరస్పర మైత్రితో జీవించుట యసాధ్యమా?" "ఈ ప్రశ్నకు బహమనీ సుల్తానుల రాజ్యములలో నడచిన ఘట్టములే చక్కనియుత్తరము. విజయనగర సామంతులును వారివలెనే పరస్పర కలహములు బెంచికొనరాదని మా యభిప్రాయము. ఇది కేవలమొక సామ్రాజ్యమునకు సంబంధించిన విషయమే గాదు. ఇదియొక ధార్మికప్రశ్న. మన ధర్మమును రక్షించికొనవలసిన యవసరమున్నది గదా! ఒకవైపు హిందూ ధర్మసంస్కృతులను-నాశమొనర్చుటకు కంకణము కట్టుకొన్న ముసల్మానులు. మరియొకవైపు దేశీయులలోని యంతఃకలహములను-క్రోధాసూయలను-స్వార్థములకు వినియోగించికొని-అంతకంతకు రేగుచున్న పోర్చుగీసులు-డచ్చివారు, ఇంగ్లీషువారు. ఇఱువైపులనుండి మన ధర్మమునకు క్షతి గల్గునపుడు దానికి పట్టుకొమ్మగ నున్న సామ్రాజ్యములు నాశమొనర్పజూచు మీ యూహ విపరీతము.

"బహుమనీ రాజ్యములు స్వతంత్రములైన తర్వాత గూడ కొంతకాలము సుఖశాంతులతో బ్రతుకలేదా? సుమారు ఇన్నూరేండ్లు జీవింపలేదా?"

"కావచ్చును. కాని విజయనగర సామంతులు స్వతంత్రులైనచో-వారు పట్టుమని పదియేండ్లుగూడ బ్రదుకలేరు. వారిలో ద్వేషాసూయలంత తీవ్రములు."

"జీవన్మరణములను నిర్ణయించునది కాలము. ప్రవాహమున కెదురీదుట దుష్కరము."

"నిజము. సామ్రాజ్యమునకు శుభము కలుగు కాలమరుదెంచివచ్చును-అది మిమ్మెవ్వరి నడుగదు."

"ఆ యోగమే దానికున్నచో-మన నిష్ఠగూడ దాని కక్కరలేదు."

"ఇప్పటి మీ విద్రోహముగూడ దాని శుభ కాలమును తప్పింపలేదు"

"విజయనగర సామ్రాజ్యము నిలుచుటయో-కూలుటయో-భవిష్యత్తు నిర్ణయించును. ఒకనాటి సంపద్భరితమైన విజయనగరము నేడేమైనది? పులుల కావాసమైనది. ఇది సామ్రాజ్యము బాగుపడు గురుతేనా?"

"సామంతులు సామ్రాజ్యమునకు ద్రోహము నొనర్పకున్నచో-అది నాల్గు కాలములపాటు సుఖముగ బ్రతుకును.

కాకున్నచో నన్నూరు వర్షములు బ్రతుకునది నూరువర్షముల లోనే నశించును."

"మన తోవలు భిన్నములైనవి"

"అని ముందే మనవి చేసికొన్నాను. మీదారిమీది మాదారిమాది."

"అయినచో తమరింత దూరమేల వచ్చితిరి?"

ఈ విషయమును తెలుపుటకే. నేను వచ్చుటకు మరియొక కారణముకద్దు. అది యిది."

రఘునాధనాయకుడు తన తండ్రియొసగిన పత్రమును జెంజి కృష్ణప్ప చేత నుంచినాడు"

కృష్ణప్ప దాని నామూలాగ్రము చదివెను.

"మీ తండ్రిగారు మాయందెంత గౌరవమును జూపినారు. నన్ను వారు "ప్రియమిత్రమా" యని సంబోధించిరి. ఇంతకన్న గావలసినదేమున్నది. ఈ జరిగినదానిలో నా బాధ్యత చాల తక్కువ."

అతనినవ్వు తీగెలు సాగినది.

"సామ్రాజ్య విషయమైన మన యభిప్రాయములు భిన్నములైనంతమాత్రమున శత్రువులుగ మారవలసిన యవసరమేమున్నది? అందుననూ-మన భిన్నాభిప్రాయములకు నిర్భాగ్యుడైన యీ చెన్నప్ప బలియగుట చాల అన్యాయము.

"సోలగుండు చెన్నప్పనాయకుని చెఱబట్టెననుట కాధారమేమి?"

"వెంటపోయినవారు చెప్పినారు."

"వారి మాటలను మనమేల నమ్మవలెను?

"సందేహించుటకు దగిన కారణములేదు గనుక."

మీరు నామాటకు కోపింపరాదు. దయచేసి కొంచె మాలోచింపవలెను. పరిజనను చెఱపట్టి సోలగప్ప సాధించు కొను పురుషార్థమేమున్నది?

"ఆ నిర్భాగ్య దంపతులను భైరవునకు బలి యిచ్చును, ఇదేవాని పురుషార్థము."

"సోలగుండే యీ దంపతులను చెఱబట్టెనని మీరు నమ్ముచున్నారన్నమాట. కానిండు. ఇందులో నే నేమి చేయవలెను?

"ఆ దంపతులను వానినుండి విడిపింపవలెను."

"ఇది నా నుండి సాధ్యమా?"

"సోలగప్ప మీ కాశ్రితుఁడని విన్నాము."

"కావచ్చును. కాని-వాని రాష్ట్రములో వాఁడు స్వతంత్రుఁడు. నిష్కారణముగ వాని వ్యవహారములలో జోక్యము కలిగించుకొనుట మాకు తగదనుకొందును."

"ఇంతకంటె కారణమేమి గావలెను? వాఁడు నిరప రాధులైన యొక దంపతుల ప్రాణములను తీయబోవు

చున్నాఁడు. వారిని రక్షించినచో-వారి ప్రాణముల గాపాడిన పుణ్యము మీదియగును. మీరా నిర్భాగ్యులపై దయ జూపవలెను"

"మీ కోరికపై నాకు సంపూర్ణముగ సానుభూతిగలదు. కాని-యీ విషయమున మీరనుకొన్నంత సహాయము మాత్రము నేను చేయలేను.

"ఎందుకు?"

"నేను తొందరపడి యాజ్ఞ యొసఁగినచో - వాఁడు ధిక్కరింపవచ్చును.సోలగప్ప మనమనుకొన్నంత దుర్బలుఁడు కాఁడు. అతనికి-పోర్చుగీసుల సాయమున్నది. వాని సాధించుటకు-రామదేవరాయలు-విఠలునివంటి సమర్థుఁడైన సేనానాయకుని బంపెను. అతని చేతికే వాఁడు చిక్కలేదు. అట్టివానితో ద్వేషమును గట్టికొనుట నాకిష్టములేదు. వాఁడు నాకీయవలసిన కప్పములను క్రమముగ చెల్లించుచున్నాఁడు. అంతమాత్రమేగాదు. నా యాప్తులలో వాఁడొకఁడు. అట్టి వానిని-కేవలమొక్క సందేహముతో నెదిరించుట రాజనీతిగాదు."

సోలగుని దుర్మార్గములు మీకు గాక మఱి యెవ్వరడ్డగింపగలరు? వాఁడు తమ క్రింది పాళెగాఁడు. మీకు నా మాటలపై విశ్వాసమే లేకున్నచో-గూఢచారులనంపి తెలిసికొనుట మంచిది. ఆ దంపతులను-నిజముగ చెఱగొని యున్నచో మీరు విడిపింతురుగా!"

"ప్రయత్నించును. కాని వానిని సామోపాయముననే లోబఱచికొనవలెను. వాని వ్యవహారములలో చేయి జేసి కొనుటకే మాత్రము నాకిష్టము లేదు. కాని-మీయందు నాకుగల యాదరమును వ్యక్తమొనర్చుటకు నీ మాత్ర మొనర్తును. నేడే గూఢచారులను దేవకోటకంపెదను. వారు తిరిగి వచ్చువరకును తమ రిందే యుండవలెను. మా యాతిథ్యమును స్వీకరింపవలెను."

రఘునాథునకిక వేఱు మార్గము లేకపోయినది. గూఢ చారులు తిరిగివచ్చు వఱకును ఆతఁడు జింజిలో నుండుట కంగీకరించెను. కాని-కృష్ణప్ప తన్ను బంధించుటకింతటి యెత్తుగడ పన్ననుట రఘునాథున కేమి తెలియును! పాపము!!

యజ్ఞనారాయణ దీక్షితులు-రఘునాథుని స్నేహితుఁడు ఇతఁడా గోవిందదీక్షితుల మనుమఁడు, ఇతని తండ్రిపేరుగూడ గోవింద దీక్షితులే! అతడును సంస్కృతాంధ్రములలో పేరు మోసిన పండితుఁడు. "సాహిత్యరత్నాకరము"-"రఘునాథ విలాసము" మొదలైన కావ్యముల నాతఁడు రచించెను. అగ్ని చిత్యము మొదలైన యాగముల నొనర్చి యజ్ఞనారాయణ దీక్షితులను పేరు వడసి యుండెను.

యజ్ఞనారాయణ దీక్షితుఁడు-రఘునాథుని సహపాఠి గూడ. జింజికి రఘునాథునితో నాతడును ప్రయాణమైనాడు. సంగీత సాహిత్యముల యందేగాక - రాజకీయములలోగూడ నాతడు రఘునాథున కనుఁగు చెలికాడు, వారిర్వురకు దేహములు రెండు. జీవములు నొక్కటే. ఎప్పుడును కూడిమాడి దిరుగుచుండిరి. వీరిర్వురను జూచి సహోదరులని జనులు భ్రమించిన తరుణములుగూడ లేకపోలేదు. వారి స్వభావములు చేష్టలు-పరస్పరమంత పొందికొని యుండెను. ఆకారములలోగూడ కొంచెము పోలిక కద్దు. పరదేశములో- రఘునాథున కే యపాయము మూడునోయని - శంకించిన దీక్షితులు-రఘునాథునితోగూడ ప్రయాణము కట్టినాడు.

త్రోవలోనే వారిర్వురును-తమ రాయబారములోని సాఫల్య వైఫల్యములనుగూర్చి-దీర్ఘముగ చర్చించుకొనిరి.

"మన రాయబారము విఫలమైనచో నేమి చేయవలయును?"

యజ్ఞనారాయణుఁడడిగెను.

"అది విఫలము కారాదు. కాదనియే నా యూహ. ఒకవేళ విఫలమైనను కృష్ణప్పనాయకని నిర్బంధించి-లేక బలాత్కరించి - చిక్కప్పను విడిపించు మార్గమొకటి నే నూహించియే యున్నాను."

తన హృదయమును తిన్నగా తోలుచునే రఘునాథు డుత్తర మొసఁగెను.

"ఇంతకును ఈ కార్యము సిద్ధించినచో-నది తంజావూరు రాజవంశ మొనర్చు నన్నదానముల ఫలమే యనుకొనవలెను"

వెనుక జిక్కిన తన గుఱ్ఱమును రఘునాథుని గుఱ్ఱముతో పాటడలించుచు-యజ్ఞదీక్షితులన్నాడు.

గోవిందదీక్షితులు తంజవూరునకు వచ్చినతరువాత ఆతని సంసారము చాలస్థిరపడెను. అతఁడు గంగాంబికను వివాహమాడెను. ఆమె శ్రోత్రియుల యింటిబిడ్డ. ఆమెతండ్రి పేరు నారాయణదీక్షితులు. ఆగంగాంబిక గోవిందదీక్షితుల జీవితముపై-కప్పురపు తావులను జల్లినది. వారిరువురి దాంపత్య మనూచానమగు వైదికాచార పరతకాధారమైయుండెను.

గంగాంబిక ఎనిమిదిమంది సుపుత్రులనుగన్నది, వారిలో నొక్కడును పండితపుత్రుడుగాలేడు. కుమారులెల్లరును తండ్రివలెనే పైదికులైరి. ఆతనివలెనే సంగీత సాహిత్యముల నాపోశనము పట్టిరి. గోవిందదీక్షితులవలెనే కీర్తిని దిక్కులకు బంచిరి.

గోవిందదీక్షితుల కొడుకులలో నొకడు వెంకటేశ్వర దీక్షితులు. ఇతడు "వెంకటమఖి" యనుపేరిట ప్రసిద్ధుడైనాడు. ఇతడు తండ్రికడనే విద్యాభ్యాసమొనర్చి "వర్తికాభరణము" "చతుర్దండిప్రకాశిక" మొదలైన సంగీత గ్రంథములను రచించినాడు. అవి యాతనికెనలేని కీర్తిని దెచ్చెను. అప్పయ్య దీక్షితుల బంధువైన నీలకంఠ దీక్షితు లీతని శిష్యుడు. "రుక్మిణీ పరిణయము"ను రచించిన రాజ చూడామణి దీక్షితులు గూడ మరియొక శిష్యుడు. గోవింద దీక్షితుల మరియొక కొడుకు లింగావధాని. ఇతడు సోదరుల వలెనే కీర్తిమంతుడైనాడు. వేదాంత తత్వనిర్ణయ"మనెడు గ్రంథమును రచించెను. ఇట్లా గోవింద దీక్షితుల సంసార మొక విద్యాపీఠము. ఒక సరస్వతీనిలయము.

దీక్షితులాచారశీలుడంటిమి. ఆయన గొప్పకర్మిష్ఠుడు. అనేక యజ్ఞములొనర్చెను. అతడు యజ్ఞమొనర్చిన

స్థలములు నేటికిని కుంభకోణమున గలవు. అతఁడు నిత్యాగ్ని హోత్రుఁడు. వాజపేయము మొదలైన మహాయజ్ఞముల నొనర్చినవాఁడు. రఘునాథుఁడు తన కొసఁగిన గురుదక్షిణతో గోవిందదీక్షితులు పదునాఱు దేవాలయములను జీర్ణోద్ధారణ మొనర్చెను. "అద్వైతాచార్యుడను" పేరిట ప్రసిద్ధుడయ్యెను.

గోవిందదీక్షితులు రాజనీతి నిపుణుడు మాత్రమేగాదు. అతడు గొప్ప పండితుడు. మహాకవి. తన యపూర్వ వరము లన్నియు నాతనికి సరస్వతి యొసఁగి యుండెను. తిరువయ్యారు రచించిన మహాత్మ్యమును - గోవిందదీక్షితులు తమిళమున వ్రాసినాఁడు. జైమిని సూత్రములను వ్యాఖ్యానించెను. "సంగీతసుధ" యనెడు గ్రంథమును రచించెను. కర్ణాటక సంగీతములోని పాతరాగముల నన్నిటిని పరిష్కరించి-వానిని పండ్రెండు స్వరములకుఁ గుదించెను. ఈ యన్ని యోగ్యత లకుదు-ఆతని వైదిక ధర్మ నిష్ఠగోపుర మెత్తినట్లుండెను. నారాయణ దీక్షితులీతని మనుమడు. ఇఁక నాతనిగూర్చి చెప్పవలసిన దేమున్నది?

యజ్ఞనారాయణదీక్షితు డిట్లు పలికెను. "అదెట్లు సాధ్యము! మనపై కృష్ణప్పకు అంతగౌరవము లేదనుట తెలిసిన విషయమే. మరి-యతఁడు మనకోర్కెను తిరస్కరించినచో వానిని నిర్బంధించు టెట్లు?" A 34

"నాకు దోచిన యుపాయమిది. మనము చక్రవర్తుల కీ విషయమంతయు-పత్రముఖమున తెలుపుకొనవలెను. వారు ధర్మాత్ములు. న్యాయపక్షపాతులు. ఆశ్రితజనులయందు వాత్సల్యముగలవారును. వెంకటపతిదేవరాయలు ఖండితముగ చెన్నప్పను విడిపించి - సాయమునర్పునను విశ్వాసము నాకున్నది. చక్రవర్తినుండి-కృష్ణప్ప కాజ్ఞవచ్చినచో నిక తప్పించుకొనుటకు వీలులేదుగదా! కృష్ణప్ప విషయ మెట్లున్నను - చక్రవర్తులు మాత్రము నా కోర్కెను మన్నించి తీరెదరు. ఇందులో సందేహము లేదు."

"వెంకటపతిదేవరాయలకు మనవిషయము తెలియుటెట్లు?"

"నీవచ్చటికి బోవలెను. చక్రవర్తినుండి జింజికృష్ణప్ప కొక వ్రాయసము తీసికొని వచ్చినచో మన పని సుకరమగును. మన మాటలను కృష్ణప్ప తిరస్కరించినప్పుడు మనమా వ్రాయసము నుపయోగ పెట్టుకొన వచ్చును."

నారాయణదీక్షితులు త్రోవ నడుమనే చీలిపోయినాఁడు. అతడు 'పెనుగొండ'కు ప్రయాణము గట్టెను. జింజికి వచ్చినది రఘునాథుడొక్కఁడే."

కృష్ణప్పతోఁ దనకు నడచిన సంభాషణమును బట్టి-వానికి చెన్నప్పను విడిపించుటలో పట్టుదలలేదని రఘునాథునకర్థమైనది. ఈ విషయమును వాడు స్పష్టముగ చెప్పలేదు. గూఢచారుల మూలమున వార్తలను సేకరించి - యాపైని

బ్రియత్నింతునని తన్నూ గార్చి యుండెను. కని - వానికి సోలగునితో విరోధము పెట్టుకొనుట యే మాత్ర మిష్టము లేదు. వాడు వానికాప్తమిత్రుడు. రఘునాథుడుతనయల్లుడు. కాని సోలగునితోడి మైత్రియూ బాంధవ్యమును గూడ మర పించునంతటిది. పైగా కృష్ణప్ప కుటిలుడు. అనాయాసముగ జింజి కేతించిన రఘునాథునక్క డనే నిలిపికొని - కలావతిని రప్పించుకొనవలెనని వాని యెత్తుగడ; కలావతికిని- కృష్ణప్ప కును గుణములలో నేపోలికయును లేదు. ఆమెయొక పతివ్రత. కాని కృష్ణప్ప మాత్రమీ సాకుతో బిడ్డను రప్పించుకొన వలెనని యూహించెను.

రఘునాథుడు జింజికి వచ్చి పదునైదు దినములు దాటిపోయినవి. కార్యము సిద్ధించు సూచన లేవియు గాన రాలేదు, దేవకోటకు పోయిన గూఢచారులింకను రాలేదు. వచ్చెడి వారలును గనిపించలేదు. వారి విషయమై రఘు నాథుడప్పుడప్పుడు మామతో బ్రస్తావించెడివాడు. నేడు-రేపు వత్తురని యాతడు పొద్దులు గడపు చుండెను. ఆ సమాధానములకును కాలము దాటిపోయినది. మామ తనపై నొక యుచ్చు నల్లుచున్నాడని - రఘునాథునకు అనుమాన మయ్యెను, తాను అతిథిగ నున్నను-రాజవైభవము లన్నియు నడచుచున్నను స్వాతంత్ర్యములేదు. ఈ విషయము నాక ళించుకొనుట కాతనికి చాలకాలము పట్టలేదు. అతడు

కళ్యాణ మహాలును దాటి గడ్డకు వచ్చినచో కన్నుగప్పి నల్గురైదుగురు గూఢచారులు వెంట వచ్చుచుండిరి. శస్త్రపాణులైన వీరభటులు గూడ నచ్చటచ్చట దాగియుండి తన పోకడలను గమనించుచుండిరి. తన్ను కృష్ణప్పనాయకుఁడు బంధించెనా? యేమి? ఈ తలపు తలలో మెదలినదే తడవు రఘునాథుఁడు తోక ద్రొక్కిన పామగుచుండెను. కాని యేమి సేయును? తనవీర్యముమంత్రి రుద్ధమైనది. తానుతంజావూరు రాజ సింహము. జింజిబోనులోఁ బడినది. ఒకవేళ సాహసించి తప్పించుకొందమన్నను - బయటికిపోయి మాత్రము తానేమి సేయును? 'పెనుగొండ'కు పోయిన యజ్ఞనారాయణుని వృత్తాంతము దెలియలేదు. సోలగుని చెంతకేగిన గూఢచారులేమివార్తలు గొనివత్తురో తెలిసికొనవలసి యున్నది. తాను వచ్చిన పనిని నడుమనే వదలిపోవు చిత్తవృత్తి రఘునాథునకు లేదు. జింజి కృష్ణప్ప బలపరాక్రమములపై నాతనికి పెద్ద మదింపులేదు. నిజముగా తాను విజృంభించినచో కృష్ణప్ప సైనికులు కాలికి బుద్ధిచెప్పుదురని యాతఁడెఱుఁగును పైగా కృష్ణప్ప తన ప్రాణములకు దెగింపలేదు. కలావతి మాంగల్యమడ్డువచ్చును. ఏమి జరుగునో చూతమని రఘునాథుఁడు కొంతయుపేక్షనే వహించెను. కాని సోలగుని నరమేధమొనర్చు గడువు సమీపించుచున్నది.

ఒకనాఁడు కృష్ణప్ప కల్యాణమహాలుకు వచ్చినాఁడు.

ఆతనిని నగుమొగముతో రఘునాథుఁ డాహ్వానించెను. కాని మనస్సులోని క్రోధమాఁగ లేదు. ఆతఁడిట్లు పల్కినాఁడు.

"కృష్ణప్పగారికి మేమింతకుముందొక చిన్న యుపకార మొనర్చితిమి. వారు రాజోచితములైన యుపకారములతో మమ్ము సంతృప్తిపఱచి - యీ యప్పును దీర్చుకొనుచున్న ట్లున్నది."

కృష్ణప్ప యులికిపడెను.

మానుండి యేమైన నపచారము జరిగెనా యేమి?"

"అపచారమునకుగాదు. ఉపచార మెక్కువయయిన దనియే మా బాధ. మేమిచ్చటికొక పని వెంటబెట్టికొని వచ్చితిమి. తమ యుపచారము లెంత బాగున్నను-మే మిక్కడ తీరికగ కూర్చొనుటకు వీలులేదుగదా! మీరింత వరకు మాకు మామగారి మర్యాదలు చెల్లించుచున్నారే గాని మా కార్యమును విచారింపరైతిరి. ఈ విషయము మా మనస్సున కాయాసము గల్గించుచున్నది. దేవకోటనుండి యెవరైన వచ్చినారా? సోలగుని వృత్తాంత మేమైన తెలిసినదా!"

"చారులు నేడే రాజధానికి వచ్చిరి.ఆ విషయమును తెలుపుటకే మీకడ కరుదెంచితిని."

"సమాచారములేమి? మేము చెప్పిన విషయములు సత్యములేనా?."

ఆ విషయమును గురించి నేనింకను వివరములు తెలిసికొన వలసి యున్నది. వారితో నేను తీరికగ మాటాడలేదు. ఒకటి రెండు దినములలో సోలగప్ప తన కుమారుడైన చిన్న కృష్ణప్ప నిక్కడికి బంపునట; అతని మూలమున మనము వివరము లన్నియు తెలిసికొనవచ్చునని సోలగుడు చెప్పి పంపినాడు"

"సోలగుని కుమారుడు వచ్చువఱకును మేమిందే యుండవలెనన్నమాట."

"ఇక్కడ వసించుటలో మీకేమియు వేసరిక లేదను కొందును."

"నిజమే మాకిక్కడ సర్వోపచారములును నడచుచున్నవి. కాని-యిట్లు వ్యర్థముగ-సుఖముగ-కాలయాపన మొనర్చుట మాకిష్టములేదు. ఇప్పటి స్థితిలో ప్రతిక్షణమును అమూల్యమైనది. సోలగుని చెఱలో నా నిర్భాగ్య దంపతులు చావు బ్రతుకులమధ్య తారాడుచున్నప్పుడు - మేమిచ్చట నిశ్చింతగ బ్రొద్దుగడపుట కెట్లు మనసొప్పును."

"మీరావిషయమై యెక్కువ చింతింపరాదని యే నామనవి. రేపట మఱునాట - కుమార సోలగుడిచ్చటికి

వచ్చును. అతనిని విచారించినపిదప మీ సందేహములన్నియు తీరును".

మరి రెండు దినములు గడిచెను. పోలగుని కుమారుడు రాలేదు. ఇప్పుడు వచ్చునప్పుడు వచ్చునను నాశలతో-రఘునాధుడు పట్టిదారులు చూచుచున్నాడు. అతనికి ప్రతి క్షణమును - ఒక్కొక్క యుగమైపోయెను. రఘునాధుని యశాంతిని జింజి కృష్ణప్ప గ్రహించినాడు. అతనికి చిత్తశాంతి కలుగుటకై వాడెన్నో యుపాయములు వెదకెను. ఎన్ని రీతులనో యల్లుని మనస్సు లో గొ ను ట కు ప్రయత్నించు చుండెను.

ఒక దినమున వారిరువురును సంభాషించికొనుచున్నారు. ఆ మాటలలో జింజి రాజ్యమునందున్న క్రైస్తవుల ప్రసక్తి వచ్చెను. కృష్ణప్ప దేశములో పోర్చుగీసుల కెక్కువ స్థాన మానము లుండెను. క్రైస్తవ మ త ము న కెక్కువ ప్రోత్సాహముగూడ నుండెను. రఘునాధునకు క్రైస్తవ మతముపై తిరస్కారభావము. మాటలలో నాభావము నీతడు కృష్ణప్పకు వ్యక్తపరచినాడు. కృష్ణప్ప యిట్లనెను, "మీరు పొరపాటు పడినారు. పోర్చుగీసులుగూడ మనవంటి మనుష్యులే. ప్రతి జాతియందును-దుష్టులును-మంచివారును

గూడ లేకపోలేదు. ఒకజాతిలోని కొందరు చెడ్డవారినిజూచి "ఆజాతియెల్లనింతే" యనుట వివేకముగాదు. మా దేశము నందలి వ్యాపారము సక్రమముగ నడుపవలెనన్నచో - వారి సాయము మాకు గావలెను. వారు పరదేశములనుండి మాకు వస్తువులను గొని తెచ్చి యమ్ముదురు. మా సరకులు విదేశముల కెగుమతి సేయుదురు. వారినుండి మా రాజ భండారమునకు పెద్ద యాదాయముకద్దు. ఇట్టివారినితిరస్కరించుటయు, అగౌరవ పరచుటయు మాకుమంచిదిగాదు.

కృష్ణప్పనాయకా! మీకు వారి విషయమంతయు పూర్తిగా తెలిసినట్లు లేదు. వారు కేవల వ్యాపారమునకు మాత్రము వచ్చియున్నచో-వారిని తిరస్కరింపవలసిన పనిలేదు. కాని వారా రూపముతో వచ్చియున్న తస్కరులు. సముద్రతీర ప్రదేశములలో తమకొటారములను రక్షించుకొను నెపముతో కోటలు గట్టికొనుచున్నారు, వానిలో సశస్త్ర సైనికులను గూడ చేర్చికొన్నారు. వారి బలము రాగ రాగ దేశములో నెక్కువగుచున్నది. ఇంతమాత్రమేగాదు. ఆవర్తకుల వెంట విదేశములనుండి "ఫాదరీ"లు గూడ వత్తురు. వారు కాంతా కనకములతో మన దేశస్థులను ప్రలోభపరచి-వారి మతము నకు లాగికొనుచున్నారు. మాట సాగినచోట - బలమును గూడ ప్రయోగించుచున్నారు. దీనిని గమనించినచో మన

హిందూ ధర్మ సంస్కృతికి-మన యైక్యతకు – వారినుండి యెన్నడో యపాయము సంభవింపగలదని సంశయించుచున్నాను. వారి విషయమున మనము జాగ్రత్తగ నడచుకొనవలెను.

"మీరు నన్ను క్షమింపవలెను మీరు వారిని సరిగా నర్థముచేసికొనలేదని నా యూహ. వారిలో దుర్మార్గులు-దుర్జనులుమాత్రమేగాదు సజ్జనులున్నారు. స్నేహపాత్రులున్నారు. కొన్నిదినములకు ముందు జింజికి "పిమెంటో" యను నొక ఫాదరీ వచ్చియున్నాడు. అతనితో మీరు స్నేహమొనర్చికొనుట మంచిది. అప్పుడా జాతిపై మీకున్న యెన్నో యపోహలు తొలఁగిపోవును. మీరాతనితో పరిచయము చేసికొనవలెను.

"పిమెంటో ఎవరు? అతఁడీ దేశమునకెందుకువచ్చెను?"

"అతడొక్క క్రైస్తవుల ఫాదరీ "లిజ్‌బన్" లోని క్రీస్తుమత ప్రచారమునకు చెందిన-సంస్థవారు తన్నిక్కడికంపిరని-యాతడు బలికెను. భారతదేశమున క్రీస్తుధర్మ ప్రచారమునుగూర్చి తెలిసికొనిపోవుట కాతడు వచ్చినాడు. ఆధర్మ ప్రచారములోని కష్టసుఖములేవో – సమస్యలేవో-యాతడు పోయి వారికి నివేదించును."

"అతడిప్పుడెక్కడున్నాడు?"

"అతనికిగూడ కళ్యాణ మహలులోనే విడిది సేయ వలయుననుకొంటిని. వారు మన దేశపు యెండలకు సహింపలేరు. ఊరిబయట నొక మామిడి తోపులో - గుడారము వేసికొని యాతడున్నాడు. ఆ సరళజీవిని మీరొక్కసారిచూడవలెను."

"అతడు వచ్చుటలో నేదో రాజకీయోద్దేశముండి యుండును. మీరు విదేశీయులకంత సులభముగ ప్రవేశ మిచ్చుట-నాకేమో బాగుండలేదు"

"జింజిలో నొక క్రైస్తవ దేవాలయము నిర్మించ వలెనని యాతడు నాతో నన్నాడు. ఇంతపెద్ద పట్టణములో ఒక క్రైస్తవాలయముగూడ లేకుండుట ఆతని మనస్సున కెంతో కష్టమును గల్గించినదట. సాత్వికమైన వారికోర్కెను నిరాకరించుటకు నాకు మనసొప్పలేదు."

"ఇది తమ రాజ్యములోని హైందవ ధర్మమును మట్టు పెట్టుటకు శ్రీకారము. ఇంతత్వరగా నతఁడు తమ హృదయము నెట్లు వశపరచికొనెనో - మా కాశ్చర్యముగ నున్నది. ఆవ్యక్తిని చూడవలెననిపించుచున్నది. దానితో నాకే ప్రయోజనమును లేకపోయినను-ఆతని దేశ పరిస్థితులైనను దెలిసికొనవచ్చును.

"కానిండు అట్లే యేర్పాటు చేసెదను"

జింజి కృష్ణప్ప రఘునాధునికడనుండి సెలవు తీసికొనెను. రఘునాధునకు మాత్రి మీా సన్నివేశమంతయు చిత్రముగ దోచినది. ఈ ఫాదరీ జింజికి వచ్చుటలో నేదో యొక రాజకీయోద్దేశ్యముండియే తీరవలెను. శేషాతనిని కలిసి కొన్నపుడు-ఆ హృదయమును గ్రహింపవలెననుకొన్నాడు.

మఱుదినము-తన యల్లు డాతనికడకు గొనివత్తునని-కృష్ణప్ప "పిమెంటో"కు వార్త వెట్టెను; పాదరీ యందు కంగీక రించినాఁడు అల్లునితో గూడ కృష్ణప్ప "ఫాదర్ పిమెంటో" కడకు వెళ్ళెను. కృష్ణప్పను చూచినదే తడవు పిమెంటో యిట్లారంభించెను. అతడు చిదంబరములో జరిగిన హత్యా కాండనుగూర్చి వినియుండెను.

"ఏమి మీా పిచ్చితనము! హిందువులు తాము పరధర్మ సహిష్ణులమని యెదలువిరిచి చెప్పుకొందురు; మఱి - మీారు చిదంబరములో చేసిన పనికేమి వ్యాఖ్యానము? ధర్మముపేరిట మీారు జరిపిన హత్యాకాండ నా హృదయమును చకిత మొనర్చినది. ఒకనాఁడు మా దేశమున "పాత్రిటెస్టెంట్" "కాథలిక్కుల" నడుమ నిటువంటి రక్తపాతమే జరిగెను. చిదంబర వృత్తాంతములు విని నాకా హత్యాకాండ జ్ఞాపకము నకు వచ్చినది. హిందువులు-క్రైస్తవ ధర్మమును తిరస్కార

దృష్టితో జూతురు. కాని-క్రైస్తవులకంటెను హిందువులలో యుత్తమధర్మమేదీ? నిరపరాధులైన జనులను జంపించినది చాల నన్యాయమనుకొందును"

కృష్ణప్పకీ మాట లశనిపాతములైనవి.

"నేను నిరపరాధులైన జనులను జంపించితినని మీతో నెవరు చెప్పిరి?"

జనవాక్యమట్లున్నది!

"అవి నీలి వార్తలు"

"అట్లయినచో చాలసంతోషము. కాని శైవమతస్థులు గోపురమునుండి దూకి యాత్మహత్య నొనర్చికొన్న విషయము నిజమేకదా!.

కృష్ణప్ప జింజిలో జరిగిన వృత్తాంతమంతయు ఫాదరీకి వివరముగ విప్పి చెప్పెను.

"మీరే నా స్థితిలో నున్నచో నేమిచేసియుందురు?"

"నేను వారినందరిని-నుదారముగ క్షమించి యుందును. పరమ కరుణామూర్తియైన క్రీస్తు భగవానునిపేర - ఒక్క-ప్రాణినైనను జావకుండునట్లు జాగ్రత్తవహించి యుండెడివాడను. మేము మా విరోధులను-అన్య మతస్థులను-ప్రీతితో గౌరవింతుము-మా సచ్చరిత్రముతో వారి హృదయములను మార్ప యత్నింతుము. ప్రేమతో వారిని జయించి మా మతమునకు రాబట్టుకొందుము. బలాత్కారముగ ధర్మదీక్ష

యెవ్వరికిని యొసఁగరాదు. ఇది మా యభిప్రాయము. మా యేసు జీవితమునగూడ నిట్టి ఘట్టములే గలవు. అతఁడు ప్రీతి అహింస కరుణ మొదలగు గుణములతో జనుల కాప్త మిత్రుఁడయ్యెను. శాత్రవ హృదయములను ప్రేమతో జయించి మిత్రులుగ నొనర్చికొనెను. తనకు ద్రోహ మొనర్చిన "జూడాస్"ను ఉదారముగ క్షమించినాఁడు. "దేవా! వారజ్ఞానులు. వారు తెలియక చేయు తప్పులను క్షమింపు" మని భగవంతుని ప్రార్థించినాఁడు.

అతనివంటి కరుణాశాలి మరియొకఁడు లేడు.

ఫాదరి పిమెంటో దీర్ఘముగ నిట్టూర్చెను.

రఘునాథుడప్పుడు తిన్నగ సంభాషణ మారంభించినాఁడు.

"మీ యేసుస్వామి గొప్పవాఁడే కావచ్చును. అట్టి వారు మా దేశమందును గలరు. బుద్ధభగవానుఁడట్టివాఁడే. త్రిమతాచార్యులును ఇట్టి ధర్మములనే బోధించిరి. ముఖ్యముగ రామానుజాచార్యులదయ యద్వితీయమైనది. వారు శ్రీరంగము లోని గోపుర మెక్కి జనుల కందఱకును పరమ రహస్యమైన పరమ మంత్రమును బోధించిరి. ఉత్తమ పురుషులందఱును ఉత్తమ ధర్మములనే చెప్పుదురు. కాని క్రైస్తవ మత ప్రచారమునకై మా దేశమునకు వచ్చు ఫాదరీలపై మాత్రము నాకు గౌరవములేదు. వారు చెప్పునదొకటియు

చేయునది మఱొకటియును.

....ఏమీ! వారేమిచేసిరి?

ఫిమెంటో లోచనములు చకితములయ్యెను.

ఇంకేమి చేయవలెను? చేయదగిన యత్యాచారము లన్నియు ధర్మముపేరిట జరిగిపోవుచునే యున్నవి. వారు మా దేశపు జనులను క్రైస్తవులుగ మార్చికొనుటకు చేయుచున్న యన్యాయములు-అక్రమములు - చూపుచున్న ఆశలు-లెక్కకు మిక్కుటముగ నున్నవి. మీ స్నేహితులు ధర్మప్రచారమున కొనర్చుచున్న కార్యమును తలఁచికొన్నచో శరీరము గగుర్పొడుచును".

రఘునాధుని వాక్కులలో నసిధారలనంటి తీక్ష్ణత యుండెను.

"యువరాజా! మొగమోటములేక మీరాడినమాటల కెంతో సంతోషమైనది. మీ మాటలు పూర్తిగ నసత్యములు గావనుట నాకును దెలియును. ఇక్కడి మత ప్రచారకులను గూర్చి "లిస్బన్" లోని క్రైస్తవమత సంఘమునకుగూడ నిట్టివార్తలే యందినవి. వానిలోని సత్యాసత్యములను స్పష్టముగ జూచి-తెలిసికొనుటకే నేనిప్పుడు మీ దేశమునకు వచ్చినది. కాని-నాదొక చిన్నయాక్షేపణ మాత్రమున్నది. క్రైస్తవ మత ప్రచారకు లందరట్టివారే యనుకొనుట మాత్రము పొరపాటు. అందరును తమరనుకొన్నంతటి

నీచులుకాదు. బలవంతముగ క్రైస్తవ ధర్మదీక్ష నొసఁగుటకు మేమంగీకరింపము. దీనితో నెవరికి ప్రయోజనమున్నదిగనుక? ఏసుస్వామి బోధలువిని-ఎవరాతనిని నమ్మెదరో -అట్టివారిని మాత్రమే క్రైస్తవులుగ నొనర్పవలెనని నేను నాతోడి ఫాదరీల కందఱకును సలహాల నిచ్చినాను. భారతదేశములోని కొందఱు ప్రచారకులు ధర్మముపేరిట-ఏసుక్రీస్తునామమునకు గళంక మాపాదించుచున్నారనుట నాకుగూడ తెలియును. నేను దానికెంతయో చింతించుచున్నాను.

ఫిమెంటో సౌజన్యమునుజూచి రఘునాథున కాతనిపై నెంతయో గౌరవము గల్గినది. ఆతనితో రఘునాథుఁడెన్నియో ధార్మిక విషయములగూర్చి చర్చించెను. ఫాదర్ ఫిమెంటోను తమయూరికి రావలసినదని యాహ్వానించినాఁడు. ఫిమెంటో చిఱునగవుతో నా యాహ్వానము నంగీకరించినాఁడు. రఘునాథుఁడు కల్యాణమహాలునకు దిరిగివచ్చెను.

కుమార సోలగుఁడు జింజికి రానేలేదు. వానికై నిరీక్షించట వ్యర్థమనకొన్నాఁడు రఘునాథుఁడు. వాఁడుగాక పోయినను—మరి యే దూతయైనను దేవకోటనుండి వచ్చునేమోయని చూచెను. అదియు జరుగలేదు. ఈ వృథా కాలహరణము రఘునాథునకు వేసరిక గలిగించినది. పెను

గొండకుఁ బోయిన యజ్ఞనారాయణుఁ డేమయ్యెనో! అతని వార్తయును దెలిసినదిగాదు. రఘునాథుని చిత్తమునకు శాంతి లేదు. చైత్ర శుద్ధ పున్నమ పదునైదు దినములు మాత్రమున్నది. అంతలోపల చెన్నప్పనాయకుని విడిపింప కున్నచో తన యీ ప్రయత్నములన్నియు బూడిదలోఁబోసిన పన్నీరగును.

యజ్ఞనారాయణుఁడు పెనుగొండనుండి వచ్చినాఁడు. ఈ వార్త రఘునాథుని చెవి కమృతసేచనమైనది. నిరాశలో నాశాజ్యోతి వెలిగెను.

పెనుగొండకుఁబోయిన యజ్ఞనారాయణ దీక్షితునకు వెంటనే చక్రవర్తిదర్శనము గాలేదు. ఆ దర్శనమునకు ముందు గంపెడు మర్యాదలుండెను. ఆ యేర్పాటులన్నియు దీక్షితులు చేసికొన్నారు. ఒకనాఁడు యజ్ఞనారాయణుఁడు సమయము గల్పించుకొని వెంకటపతిదేవరాయలకు రఘునాథుఁడంపిన పత్రిక నొసఁగినాఁడు.

సమ్రాట్టు దాని నాదరముతో జదివికొనెను.

"ఇంత స్వల్పకార్యమునకు మీరింత దూరము రావలసి యుండెనా యేమి?" ఈ విషయమక్కడనే పరిష్కరింపఁబడి యుండెడిది. సోలగుఁడు జింజి కృష్ణప్ప సామంతుఁడు. కృష్ణప్ప కొక నిరూపము నంపినచో-నీపని సుకరముగ ముగిసి యుండెడిది.

ప్రభూ! నామాటలను మీరన్యథా భావించరాదు. తమరన్నట్లు నీపని యింత సులభముగ చక్కబడునదైనచో రఘునాధు డింత పెద్ద ప్రయత్నము చేసియుండెడివాఁడేగాదు. ఇందులో చాల సూక్ష్మమైన రాజకీయమున్నది సోలగుఁడు మనమనుకొన్నంత దుర్బలుఁడు గాడు. వానికి పోర్చుగీసువారి సాయమున్నది. జింజికృష్ణప్ప వెన్ను బల ముకూడ కద్దు. వారిరువురకును చిరతరమైన మైత్రి. ఒకరినొకరు వదలి యుండరు. ఈ కార్యమును సాధించుటకు రఘునాధుఁడే జింజికి ప్రయాణమైపోయెను. ఒకవేళ కృష్ణప్ప తన కోరికను మన్నింపకున్నచో - తమ నిరూపముతో నా కార్యమును నెరవేర్చికొనవచ్చునని-రఘునాధుఁడు నన్నిచటికంపినాఁడు.

సోలగుని కూ్రరకృత్యములనుగూర్చి మేమింతకుముందే కావలసినంత విన్నాము. ఈ దుష్కృత్యములకు వెనుక బల మింతయున్నదని తెలియదు. వాఁడింతటి ప్రబలుఁడనుట గూడ నెఱుగము. మీ మాటలనుబట్టి చూచినచో-వాడు సామ్రాజ్యమునకు పెద్ద శత్రువనుటలో సందేహము లేదు.

"వాని దుర్మార్గములను సహింపని జనులు-రామదేవ రాయలవారి కాలమున చక్రవర్తులకు మొఱవెట్టుకొనిరి.

వారు విఠ్ఠలరాయుల నంపినారు. కాని సోలగుండాసేనాపతి చేతికి జిక్కలేదు. "దేవకోట" నాశమైనది. కాని-వాడు మరల బ్రదికి యీక రెక్క వేసినాడు."

"అవునవును ఇంతకును వాని కాలము బాగున్నది. ఒక సామాన్యుడైన పాళెగాడింత విజృంభించినచో - ఇక సామ్రాజ్య ముండియు నేమిలాభము? ఈసారి వానిని బాగుగ పట్టిచూచెదను. ఇట్టి ప్రజా కంటకులు జీవించి యున్నంత వఱకును దేశమునకు శాంతిలేదు.

"వాడు స్వయముగ ప్రబలుడు గాదని ముందే విన్నవించుకొన్నాను. జింజి కృష్ణప్ప వానికి వెన్నుబలము. ఆ బలము చూచికొని-వాడు నరరూప రాక్షసుడై విహరించుచున్నాడు. తమరా నిర్భాగ్య దంపతుల ను విడిపించుటకు సోలగునకును-కృష్ణప్పకును నిరూపము లంపవలెను. చైత్ర శుద్ధ పున్నమ సమీపించుచున్నది. తమ రాలస్యమొనర్చినచో కార్యహాని తప్పదు"

"అయినచో-కృష్ణప్ప రఘునాథనాయకుని మాటను గూడ వినలేదన్నమాట; తిన్నయింటి వాసములను లెక్కించుట వాని జాతకమునసే యున్నది.

ప్రభూ! జింజి కృష్ణప్ప కుటిలుఁడు. మీరు వానికి ప్రాణదాన మొసర్చితిరి, మీ యౌదార్యముపై వానికి గౌరవము లేదు. మీరు వాని దోషమును మన్నించుటకు రఘునాథుఁడు చేసిన ప్రయత్నమే కారణము ఆ కృతజ్ఞతయు వానికి లేదు. అట్లున్నచో - నేనింతదూరము రావలసినపని యేమున్నది."

"మంచిది. కృష్ణప్ప యింతకుముందు అగ్గిని తాకెను. వ్రేలుకాలినది. ఇప్పుడు దానితో చెలగాటలాడుచున్నాఁడు. ఈ ప్రయత్నములో వాని మారణహోమమగుట తప్పదు. ఈసారి వానికి దగిన బుద్ధి చెప్పితీరుదును.

"ప్రభూ! నేను కొండెములు చెప్పుటకు రాలేదు. కాని కృష్ణప్ప ప్రవర్తన చాల చిత్రముగ నున్నది. వాఁడీ సామ్రాజ్యమునే సమూలముగ పెకలించివేయుటకు యత్నించుచున్నాఁడు. వానికి నీచుడైన ముత్తువీరప్పతో మైత్రి. పోర్చుగీసువారి సహాయము. వీరు ముగ్గురొక్కటై సామ్రాజ్యమును కూల్చి-దానిని పంచుకొని యేలవలెనని యెత్తుగడ. చక్రవర్తులప్రమత్తులై యుండకున్నచో- సామ్రాజ్యమునకు చేటుతప్పదు.

"నాయూహ నిజమైనదన్నమాట."

"ఏయూహ?"

"కృష్ణప్పను చెఱనుండి విడిపించునాఁడే కుమార రఘునాథునితో నీమాట లనియుంటిని. వాఁడొక సర్పము. వానికి సాయమొనర్చుట పామునకు పాలుపోయుట. కాని యానాఁడు రఘునాథుఁడు నన్ను నిర్బంధించి-వానిని చెఱనుండి విడిపించినాఁడు. దాని ఫలితము కొలఁది దినములలోనే యనుభవమునకు వచ్చినది.

"అప్పుడు తానొనర్చిన దోషమునకు రఘునాథుఁడే పశ్చాత్తాపపడుచున్నాఁడు. గడచినదానినిగూర్చి విచారించి లాభము లేదు. జరుగవలసినదానిని చూడవలెను.

"ఇప్పుడు నాతో మీ కేమిగావలెను?,

"సోలగుని చెఱలోనున్న దంపతులను విడిపింపవలెనని తమరు కృష్ణప్పకు నిరూపమును దయచేయవలెను."

"నా యాజ్ఞనుగూడ వాఁడు ధిక్కరించినచో?

"ఇప్పటిలో మీ యాజ్ఞను ధిక్కరించు ధైర్యము వానికి లేదు. తంజావూరి వీరభటులను జూచిన వానికి భయము వారి ధాటికి సోలగుడుగాని-తానుగాని నిలువలేమని వానికి స్పష్టముగ దెలియును. తంజావూరివారు మీ పాదసేవకు లనుటయు వాఁడెఱుఁగును."

"అచ్యుతప్ప నాయకునిపై మాకు పరిపూర్ణమైన విశ్వాసమున్నది. వారు మా కోర్కె లెన్నడును వృథా పుచ్చలేదు. వారి నిష్ఠయే మాకు వజ్రకవచము. వారు మా కనేక మారులు తోడ్పడి యపాయముల నుండి రక్షించిరి. ఇప్పుడు మేము వారి కుపకారమొనర్చు సుయోగమేర్పడినది. అది మా యదృష్టము."

చక్రవర్తులు జింజికృష్ణప్పకు నిరూపమును వ్రాయించిరి. దానిపై వారి వరాహముద్ర ముద్రింపఁబడెను.

నారాయణదీక్షితులు జింజిలో బ్రవేశించినాఁడు. అతఁడు చారవేషమును ధరించెను. ఏకాంతమున కృష్ణప్ప నాయకుని కొలువు సేసికొని యాతనికి-చక్రవర్తుల నిరూపము నొసగినాఁడు.

చక్రవర్తుల యాజ్ఞ చదివికొన్న కృష్ణప్ప ముఖమెఱ్ఱ వారినది. వాఁడు కనుబొమ్మలు ముడిపెట్టికొనెను. పలుమారు చదివిన దానినే చదివికొన్నాఁడు.

చక్రవర్తులంపిన నిరూపమిది:-

"స్వస్తి శ్రీ మన్మహారాజాధిరాజ రాజపరమేశ్వరేత్యాది బిరుదాంకితులైన-శ్రీమత్పంపా విరూపాక్ష కృపాలబ్ధ విద్యానగర రాజ్యసింహాసనాధీశ్వరులైన వెంకటపతి దేవరాయలుంగారు సామంత శ్రేష్ఠులైన జింజి కృష్ణప్పనాయకులకు దుస్సు-

చేయించిన నిరూపమేమనంగా- మీరింతవరకున్నూ- మాకు వరిదీ చేయవలసిన కప్పములూ-కానుకలూ చెల్లిస్తూవచ్చినారు. కాని-మీ యాశ్రియంలో ఉన్న దేవకోట పాలియగాడైన పోలగప్పనాయకుని విషయంలో-మా సన్నిధానాని కాతనిపై అనేకదూరులు వచ్చినవి. అతఁడు ప్రజకంటకుఁడై-ప్రజలను చాలా పీడించుచున్నాఁడని మొఱలు వినబడుచున్నవాయెను. మా సామంతులైవుండుకొన్నీ-ఇటువంటి నీచుల కాశ్రియం చేయడం చాల అన్యాయమని మా మనస్సులో నెక్కువ కలత అయ్యేని. ప్రసంగం యేమంటే-తంజావూరు రాజ్య సీమలకు జేరిన చెన్నప్పనాయకుడనే వానిన్నీ-గర్భవతియైన ఆతని భార్యనున్నూ భైరవమూర్తికి బలియివ్వడానికి ఆ నీచ పోలగుడు ప్రయత్నాలుచేస్తూ వున్నట్లు మాకడకు దూరులు వచ్చినవి. ఇది నిజమైతే-అట్టిది యెంతపెద్ద అపరాధమనే విషయం మీకు తెలిసేవుండీ?. మా సామ్రాజ్యంలో నరబలి నిషిద్ధమనేసంగతి ప్రజలకంతా విశదమయ్యేని. అందులోనూ- గర్భిణీ స్త్రీలను బలియిచ్చే విషయం మహాపాపం చేయునని మా హెచ్చరికలు. వేరేసీమలకు జెందిన-గౌరవాన్వితులైన వ్యక్తులను-మా ఆశ్రియంమీద నడిచే ఆనీచుఁడు చెఱలో వేయడం యెన్నిరీతుల చూచినా శిక్షార్హమైన అపరాధము, ఈ అపరాధానికి శిక్ష కొఱతవేయడం. ఈ నిరూపమును చూస్తూనే-ఆ దంపతులను చెఱ విడుదల చేయించి-పోలగుని

తెచ్చి ఒప్పిస్తే మాకు సంతోషమయ్యేను. మా ఆజ్ఞను తిరస్కరించినట్లయితే సోలగుని అపరాధంలో మీకుగూడ భాగమున్నదని మేము అభిప్రాయం వహించేము. ఈవరకు సామ్రాజ్యం విషయంలో సేవచేయిస్తూ వచ్చిన మీరు అటువంటి ప్రసంగానికి అవకాశమివ్వరని నమ్మేము.

ఇట్లు,

సమ్రాట్టు వెంకటపతి దేవరాయలుగారి వ్రాలు.

"చక్రవర్తులకు మా యుత్తరమును బంపికొందుము మీరింక పోవచ్చును.

కృష్ణప్ప దీక్షితుల నంపివేసినాఁడు. వాఁడేదో దీర్ఘముగ యోచించుచుండెను.

వాని యోచనలకు తుది లేనట్లున్నది. ఏమిచేయవలెను? చక్రవర్తుల యాజ్ఞననుసరించుట-వానికిష్టములేదు. ధిక్కరించుటకు తగిన బలములేదు. అందుకే రఘునాథునితో వాఁడే మాటయు జెప్పక కాలహరణ మొనర్చుచున్నాఁడు. కాని-సమాప్తుల నిరూపణమునకు-కాలహరణ మొనర్ప వీలులేదు. వెంకటపతి దేవరాయలకు సోలగుని నిజస్వరూపము తెలిసిపోయినదనుటకు-అతఁడు వ్రాసిన పత్రమే సాక్షి. ఇఁక సోలగుని పక్షమును-తానెంత పట్టుకొని పెనఁగినను-ప్రయోజనము లేదు. కాని-వాఁడు తనకాప్తమిత్రుఁడు. వానినంత సులభముగ-వెంకటపతి దేవరాయల కొప్పించుటకును కృష్ణప్పకిష్టము లేదు. వాఁడు చెఱ వట్టిన చెన్నప్పనాయకుని విడిపించుట యొకటే-నేఁడీ యుపాయమునుండి తప్పించుకొనుటకు దారి. వారి నెట్లైనను విడిపించినచో సోలగుని ప్రాణములు రక్షించికొనవచ్చును. ఇంతలో బయటినుండి యొక భటుడు లోని కఱుదెంచినాఁడు.

"ప్రభూ! ఆజ్ఞ"

కృష్ణప్ప తల పైకెత్తి చూచెను. వృద్ధచారుఁడొకఁడు చేతులు జోడించుకొని నిలువబడియున్నాఁడు.

దేవకోటనుండి కుమార సోలగ యువరాజులుంగారు వచ్చినారు.

'లోనికి ప్రవేశపెట్టుము.'

ఆచార్యులు నమస్కరించి [illegible]

కుమార సోలగప్ప చావడిలోనికి బ్రవేశించెను. అతడు దేవకోటనుండి యొక పత్రికను గొనితెచ్చినాడు. కుశల ప్రశ్నలైన తరువాత ఆ పత్రికను జింజి కృష్ణప్ప కందించినాడు. తా నెవ్వరిని చెఱపట్టలేదనియు-తంజావూరికి జెందిన చిన్నప్పనాయక దంపతులను తాను చూడనేలేదనియు-తనకు గానివా రెవ్వరో యీ యపప్రథను బుట్టించిరనియు నాకమ్మలోనుండిన విషయము. సోలగుడు కృష్ణప్పకు పచ్చల హారమొక్కటి కానుకగా నంపెను. నవరత్న ఖచితమైన ఖడ్గమొక్కటి బంపినాడు. ఆ రెంటిని జూచినవెంటనే జింజి కృష్ణప్ప కన్నులు "జిగేలు" మన్నవి. వానికి సంపదపై నంత యాశ.

కమ్మను చదివికొని కృష్ణప్ప యొక నిట్టూర్పు విడిచెను. సోలగుడు వ్రాసిన దంతయు - నిజమాయేమి? మరి యా రఘునాథుడు జింజి కేలవచ్చెను? ఏదోయొక రీతిగ-దనతో కలహమును బెట్టి-వాని స్వరూపమును బెంచికోనె మీదికెత్తి

రావలయుననియేనా? లేక తన సామంతులే దనపై కుట్ర పన్నుచున్నారా? తనకు సామ్రాజ్యముపై నాశయున్న ప్పుడు-వారికేల దన సంపదపై నుండదు? లేక తక్కిన స్వామి శిష్యులై వెంకటపతిరాయల సామంతులు తెరవెన్కయుండి తంజావూరును నాపైకిఁ దోలుచున్నారా?-ఈ భావమే వానికి సత్యమని తోఁచెను.

"ఏమైనను కృష్ణప్ప ఇట్టివానికి బెదరువాఁడుకాఁడు. ఈసారి నాపైకి వచ్చినచో-నా రాజనీతిలో తంజావూరు దగ్ధమైపోవును."

ఇంతలో చారులు కొందరు చావడిలోనికి బరువెత్తు కొని వచ్చిరి.

"ప్రభూ! అన్యాయమైనది. రఘునాధ నాయకులు 'కమలకణ్ణి' అమ్మవారి తోటకుపోయి యుండిరి. వారుపోయినది ఫాదరీ పిమంటాగారి దర్శనార్థము. అక్కడ రఘునాధ నాయకులు మన గూఢచారుల కన్నులలో మన్నుజల్లి యెట్లో మాయమై పోయినారు. వారెట్లు తప్పించికొనినదియు-నెవరికిని తెలియదు. సంఘటన మంతయు-చిత్రముగానున్నది.

"ఏమిరా! రఘునాధుఁడు తప్పించికొనెనా? ఎట్లు తప్పించి కొనెను? అతనికా యవకాశమును మీరేల యొసఁగితిరి? మిమ్ము నాశము చేయవలయును"

కృష్ణప్ప కన్నులలో నిప్పులు గ్రక్కినాడు.

తమ యాజ్ఞ ననుసరించి మేము నీడలవలె వారిని వెన్నాడుచుంటిమి. వారుపోయినచోటి కంతయు బోవుచుంటిమి. కాని రఘునాథులు తప్పించికొన్నది చూడ మాకాశ్చర్యమగుచున్నది. గుడిలోనికి బోయినవారు మరల గడ్డకు రానేలేదు."

"ఏ గుడిలోకి? ఎందుకు వెళ్ళినారు?"

"ప్రభూ! మా యపచారమును క్షమించవలెను. మీ యాజ్ఞను మేము మనసార పాలించితిమి. ఆ ఫాదరిగారిని చూడవలెనని రఘునాథుడన్నపుడు-దానికేరీతిగను - అడ్డుపెట్టగూడదని మీ యాజ్ఞ. నేటి యుదయమే వారు పిమెంటోగారిని చూచుటకు బయలుదేరిరి. మేము వారిని వెనుకనే యనుసరించితిమి. వారు పోవునప్పటికి "ఫాదర్" గారింకను నిద్ర లేవలేదు. వారికి నిద్రాభంగము చేయుటెందుకని-దగ్గరనున్న సరస్సులో కాలుసేతులు గడిగికొని-అమ్మవారి దర్శనార్థమై గుడిలోనికి పోయిరి. వారందులోనికి ప్రవేశించినది మే మందరమును చూచితిమి. దర్శనమొనర్చికొని బయటికి వత్తురను నమ్మకముతో మేము బయటనే కాచికొని యున్నాము. కాని యెంతసేపైనను వారు గడ్డకే రాలేదు. మేము భయపడి లోన ప్రవేశించితిమి. గుడిలో వారిజాడయే లేదు. మా కంటిలో మచ్చుజల్లి మాయమైనారు."

"పిమెంటో" జింజినుండి ప్రయాణ మొనర్చి సన్నాహ ములోనున్నాఁడు. అతఁడాయూరికి వచ్చుటలోని యుద్దేశ్యము మూఁడు పళ్లు నెరవేరినట్లే. జింజిలోనొక 'చర్చి' కట్టింప వలెనని యాతని కోరిక. దానికి కృష్ణప్ప సమ్మతించినాఁడు. ఆ కట్టడపు పని సాఁగుచున్నది. ఇక తక్కిన ప్రయోజనము లన్నియు క్రమక్రమముగ సాధించికొనవచ్చునని పిమెంటో కోరిక.

ఫాదరీగారు జింజి వదలిపోవుచున్న వృత్తాంతము రఘునాథునకు దెలిసినది. అతఁడు వారిని కడపటిసారి దర్శించి మాటలాడ నెంచెను. తనయభిప్రాయమును కృష్ణప్ప కెఱింగించినాఁడు. వాఁడు దానికనుమతించెను. ఆనాటి ప్రాతఃకాలము రఘునాథుఁడు క్రైస్తవ గురువు దర్శనార్థమై బయలుదేరి మామిడితోపునకు వచ్చెను. రాత్రి చాల ప్రొద్దుపోవువరకు నేవో గ్రంథములు చదువుచుండినందున పిమెంటో యింకను నిద్ర లేవలేదు. ఈ విషయ మాతనికి బట్లరు తెలిపెను. వారి నిద్రాభంగ మొనర్చుటకు రఘునాథుఁడు సమ్మతించలేదు అటునిటు దిరుగుచు "దేవీ స ర స్సు"నకు వచ్చినాఁడు. అమ్మవారిని దర్శించి వత్తునని తోడనున్న వారితో జెప్పి గుడిలో ప్రవేశించెను. దానికున్నదొక్కటే మహాద్వారము; గుడిలో నెచట దిరిగినను-మరల నా ద్వారముననే రావలెను. అందుచే

రఘునాథు నెవ్వరు ననుసరింపలేదు. ఇదే వారు చేసిన పొరపాటు.

గుడిలో బ్రవేశించినదే తడవు రఘునాథుఁడు నలువైపులను బరీక్షించెను. ప్రయాణమునకు సర్వము సిద్ధమైనది. యజ్ఞనారాయణుఁడక్కడ-బైరాగి వేషములో తయారైనాఁడు. గర్భగుడిలోని ప్రాకారమునకు యజ్ఞనారాయణుఁడీతనిని దీసికొనిపోయెను. అటఁ గొంతచీకటి. ఒక్క క్షణములో రఘునాథుఁడు బైరాగిగ మారిపోయినాఁడు. జటాభారము తలపై వెలసెను. ఒడలినిండబూది. చేత కమండలము. మరియొకచేత యోగదండము. "జై శంభో శంకర!" యనుచునే యాతఁడు గుడినుండి బయట బడెను. ఆతఁడు గూఢచారుల కన్నులలో మట్టిగొట్టి-వారి యెదుటనే తొలఁగి పోయెను. ఆతని నెవ్వరును గమనించనేలేదు. వారేదో లోకాభిరామాయణములో మునిగియుండిరి. రఘునాథుఁ డెంతసేపటికిని బయటికి రాకుండుటచే-వారు లోపల బ్రవేశించినారు. గుడిలో వారికి చిక్కినవి రఘునాథుని దుస్తులు మాత్రమే. మంటపములో నూరారుజనులు బైరాగులు, తిరిపెగాండ్రు. వారి నా గూఢచారులు రఘునాథుని విషయమై ప్రశ్నించిరి. ఆ భిక్షుగాండ్రకీగొడవ యేమిగాబట్టినది గనుక? వారు కడుపు చింతలో మునిఁగి యుండిరి. వారా

గుడి యంతయు గాలించిరి. నిరాశులై-కడపటికి-ఈ వార్తను కృష్ణప్పనాయకుని కెఱిగించుటకై బయలుదేరినారు. ఈగడబిడలో యజ్ఞనారాయణదీక్షితులుగూడ తప్పించుకొని బయటబడెను.

వారు చేసికొన్న తీర్మానము ననుసరించి-యజ్ఞనారాయణుడు కొంతకాలము "జింజిలోనే యుండవలెను. ఎట్లైనను - కుమారసోలసునితో బరిచయ మేర్పఱచికొనవలెనని యాతని యూహ; కుమారసోలకుడు సాహిత్యప్రియుడు. అతనికి తండ్రి గుణములంతగా సరిపోవు. ఈ విషయము దీక్షితులు వినియుండెను. సాధ్యమైనచో-తన నాటకములో నాతనిని పాత్రగా వాడుకొనవలెననియు యజ్ఞనారాయణుండెంచినాడు.

రఘునాథుడు నేరుగా తంజావూరు దారిబట్టెను. జరిగిన విషయమంతయు తండ్రికి-గోవిందదీక్షితులకును దెలిపి వారి యనుమతి ప్రకారము నడచికొనవలెనని యాతనితలంపు. రాబోవు చైత్రపూర్ణిమకుముందే చెన్నప్ప విడుదల కావలసి యున్నది. సామ భేదములతో సాధ్యముగానిచో బలాత్కారముగ నైనను-కడకు-యుద్ధ మొనర్చియైనను రఘునాథుడు వారిని విడిపింప నెంచెను. ఈ విషయము దీక్షితుల కెఱిగించి "దేవకోట"లో-సైన్యములతో వానిని గలిసికొనునట్లేర్పాటు గావించికొని రఘునాథుడు వెళ్లెను.

సోలగుండు తనకుమారుని 'జింజి'కి బంపుటలోని యుద్దేశ్యములు రెండు. తనపై కృష్ణప్పకుగల సందేహమును దీర్చుట యొకటి. అతనికేమైన యాగ్రహము గలిగినచో దానిని నివారించుట రెండవది. రానున్న భైరవోత్సవములకు కృష్ణప్ప నాహ్వానించవలెనని కూడ నాతడు కుమారునకు జెప్పి పంపెను. ఈ యుత్సవములను సోలగుండు నవరాత్రి పండుగలకంటెను నెక్కువ వైభవముగ జేసెడివాడు. తన యాప్తుల నందరి నాహ్వానించుచుండెను. సుమారెనిమిది దినములు దేవకోటలో-కాకతే కోలాహలము. ప్రజలీ వారము రోజులును పండుగలు చేసికొనుచుండిరి. వీధులలో నెచ్చటజూచినను సంగీతములు; నృత్యములు; కన్నులు మెఱయించు దీపోత్సవములు; ప్రజల యానందమునకై యొక పెద్ద జాతర జరుగుచుండెడిది. ఈ యుత్సవములకా రాజ్యములోని ప్రజలందఱును చేరుచుండెడివారు. ఈ దినములలో మాత్రము కోటలో గాపలా యుండుట లేదు. కోటలోని కెవరైనను రావచ్చును. పోవచ్చును.

ఈసారి యుత్సవములు ముందటికంటె వైభవముగ నొనర్పవలయునని సోలగుని యూహ. వాడందుకు దగిన యత్నములన్నియు నొనర్చెను. పున్నమ సమీపించు కొలదియు వానికి రెక్కలు మొలచుచున్నట్లున్నది. కాని

యింతలో నొక ఉపాంతరము జరిగెను. హఠాత్తుగ వానికేదో జబ్బు పట్టుకొన్నది. మంచము పట్టినాడు. దేహమంతయు సుత్తెలతో గొట్టినట్లు బాధ కడుపులో జెప్పరాని సంకటము నాల్గు రోజులకుముందు వాడొక జింకను వేటాడి చంపెను. ఆ జింకను పాకశాలలో వండిరి. బాణము తగులుటచే దాని దేహము "నంజు"పట్టినది. ఆ బాణము కొంచెము చిలుమెక్కియుండెను. తన యుత్సాహములో వాడు దానిని గమనింపలేదు. ఆ జింకమాంసము తిన్నప్పటినుండియు వానికా బాధ యారంభమైనది. దేహమంతయు "నంజు" పట్టినది. యమయాతన ననుభవించుచున్నాడు. ఈ విచిత్ర వ్యాధి కెందరో వైద్యము చేసిరి. గుణములేదు. "గోవా" నుండి పోర్చుగీసు వైద్యుడొక డాహ్వానింపబడినాడు. వాని వైద్యముచే గుణోన్ముఖముగనున్నది. కాని-యింతలో పడక విడుచుటకు మాత్రము వీలుగాదు. జింజికి తన కుమారు నంపుట కిదియే కారణము. కుమార సోలగుడు ముసలి తనమున బుట్టినవాడు. ఆ కొడుకుపై తండ్రికి తగని మోహము. కుమార సోలగుడు పదునారేండ్ల వాడైనను బాగుగ నెదిగిన యువకునివలె గన్పించుచుండెను. వాని తల్లి గౌరాంబిక. చిన్ననాడు-ఆమె శిక్షణమే వానికెక్కువ. బాల్యమునుండి గౌరాంబయే యెక్కువ శ్రద్ధగా పెంచుటచే-తల్లి గుణములన్నియు వానిలో నచ్చుగుద్దుకొనెను. తల్లి

పెంచిన కొడుకు చెడిపోవునందురు. కుమార సోలగుఁడు బాగుపడెను. వాని హృదయము విశాలము. దీనులపై వానికెక్కువ దయ. నిర్మలమైన యంతఃకరణము-దయా దాక్షిణ్యములు వాని రక్తములో కలిసికొన్నవి. వానికి తండ్రి గుణము లొక్కటియు పట్టువడలేదు. ఆ నరరాక్షసుని యెదుట నిలుచుటకును కొడుకు భయపడుచుండెను, సోలగుని ప్రేమయు భయంకరమే అందుచే కుమారుడెప్పుడును తల్లి నంటిపెట్టుకొని యుండెడివాఁడు. తండ్రి ప్రవర్తన నాక్షేపించు ధైర్యము కుమారునకులేదు. కుమారునిలో స్పష్టముగ నగపడుచున్న భీరుస్వభావమును జూచి సోలగుడప్పుడప్పుడు నిరుత్సాహపడెడివాఁడు. వానికి తనవలెనే కొడుకు తయారు గావలెనన్న యాశ.

తల్లియైన గౌరాంబయే వానిని పాడుచేసినదని సోలగుని కోపము. కాని యా కోపము కుమారునిపై గల ప్రేమ కేమియు నడ్డమురాలేదు. అరువదవయేట తనకు వాడు పుట్టెను. తన వంశమునకు వాఁడొక్కడే కొడుకు. తన సర్వ ప్రాణములును వాడై యుండెను. వానిపై నాతఁడనేక స్వప్నములు నిర్మించికొన్నాడు.

పుత్రోత్సవము జరిగినప్పుడు సోలగుఁడు జింజిలో నుండెను. కొడుకు పుట్టిన వార్తను చారుఁడు తెలిపెను. వాని యానందమునకు మితిలేదు. వాఁడు. జింజి కృష్ణప్ప

కెన్నియో కానుక లర్పించినాఁడు. జింజిలో నుండగా తనకు కుమారోత్పత్తి యైనందున వానికి కృష్ణప్ప యనియే పేరు పెట్టవలెనని సోలగుని యాశ. ఈ కోర్కెను జింజి కృష్ణప్ప సంతోషముతో నంగీకరించెను. కుమార సోలగుని పేరిట జింజి కృష్ణప్ప దేవకోట పాలకునకొక దంతపు సింహాసనమును చదివించినాఁడు. సోలగుఁ డెప్పుడును దానిపై నెక్కెడివాఁడు కాడు. ఇది తన కుమారునకు జింజి కృష్ణప్ప యిచ్చిన యుడుగరయని నలుగురితో జెప్పికొనుచుండె. తన కుమారునకు దానిపై నెక్కెడు వయస్సు వచ్చువరకు నాసింహాసనమును-జాగ్రత్తగ రక్షించికొని రావలెనని వానికోరిక.

కుమారునిపై తండ్రికింత ప్రీతి యున్నను - వానికి తండ్రిపైఁ బ్రీతి విశ్వాసములు లేవు. వారిద్దరి లోకములే వేరు. ఒకరి యభిప్రాయము లొకరికి గిట్టవు కాని-కుమార కృష్ణప్పకు-జింజి కృష్ణప్పపై నెందుకో యభిమానము - గౌరవముగూడ. అతనితో వాఁడు మనసువిప్పి మాటలాడును. జింజి కృష్ణప్ప తన కాత్మీయుడను భావము వానికుండెను.

భైరవోత్సవములకు కృష్ణప్ప నాహ్వానించుటకై వచ్చి యున్న కుమార సోలగుడు ఊరికి తిరిగిపోవు ప్రయత్నములో నుండెను. వాఁడు కడసారి సెలవు దీసికొనుటకై జింజి కృష్ణప్ప

చెంతకు వచ్చెను. ఆ సమయమున నేవేవో మాటలు జరిగినవి. తంజావూరు విషయముగూడ ప్రస్తావనకు వచ్చెను. మాటల నడుమ చెన్నప్ప దంపతులను చెఱబట్టిన విషయముగూడ వాఁడు కృష్ణప్పతో నని వేసినాఁడు. అతనికడ నీసమాచారమును దాచుటకు వానికి మనసొప్ప లేదు. ఆ దంపతులను చెర బట్టుట వాని కయిష్టమైనదని, దానినుండి ముందు ముందేదో యపాయము మూడునని వాని భయము. ఆ దంపతులను విడిపించి పుచ్చు భావముగూడ వాని కుండెను. కృష్ణప్పతో వాఁడు సత్యమును చెప్పుట కిది కారణము.

"అప్పాజీ! మీరు మాకు తండ్రివంటివారు. మీకడ సత్యముదాచుట కిష్టములేదు. తంజావూరునకు చెందిన యా దంపతులను నా తండ్రి చెరపట్టినది నిజము. వారిని విడిచి పుచ్చవలెననియు నీ సంఘటనతో తంజావూరుతోడి యుద్ధము రావచ్చుననియు-యుద్ధము క్షేమకరము గాదనియు నేనును-మా తల్లియు-నెంతయో చెప్పితిమి. కాని-వారు మామాట లను వినలేదు. రాబోవు చైత్రశుద్ధ పున్నమనాఁడు వారిని బలి యొసంగుటకే నా తండ్రి తీర్మానించికొనెను. చెన్నప్ప తన తండ్రికొకడే కొడుకట. సంసారము కు వచ్చిన చాల దినములకు-అతని భార్య గర్భవతి యైనదట! ఆమె యీతని చేత బడినది. వారు సామాన్య సంసారులుగ నున్నట్లులేదు.

ఎవరో రాజబాంధవులై నట్లున్నది. వారి విషయమై రఘునాథ నాయకుఁడు మీ వద్దకు రాయబారము వచ్చిన సంగతిని బట్టి చూచినచో నిదేదో దేవకోటకు గొప్ప యనిష్ట సూచనగా గన్పట్టుచున్నది. మీరు పెద్దమనస్సుజేసి మా రాజ్యమునకు రానున్న యీ యపాయమును తప్పింపవలెను.

జింజి కృష్ణప్ప నవ్వినాఁడు. వాని యిష్టానిష్టములను దెలిసికొనుటకు నవ్వొక పెద్ద యాయుధమై యుండెను. అతఁడిట్లనెను.

"నాయనా నీ కింకను చిన్నవయస్సు; అందుచే నెదుటివారి హృదయమును సరిగా పసిగట్టలేవు. ఆ దంపతులను మీ తండ్రి చెఱబట్టలేదని నేననుకొనుచున్నానని నీ యూహ. అది నీ పొరపాటు. వారిని చెరగొన్న విషయము సత్యమని నే నెప్పుడో గుర్తించితిని. కాని తంజావూరివారి గర్వమణచుటకై మీ తండ్రివైపు వాదించు చున్నానంతే. ఆ రఘునాథు నిందే చెరబట్టుటకు దగిన పన్నాగమును పన్ని యుంటిని. కాని యది సాగిరాలేదు. చక్రవర్తుల నుండి నాకు— ఆ దంపతులను విడిపింపవలెనని యాజ్ఞాపత్రము గూడ వచ్చినది. ఈ వ్యవహార మంతయు నింతలో ముగియునట్లు దోచుటలేదు. తంజవూరితో మనకు యుద్ధము జరిగితీరును. 'కానిమ్మని' నేనుగూడ తయారుగనే యున్నాను. ఈ దంపతుల విషయము యుద్ధమునకు సాకు. తంజావూరు ప్రభు

వులకు మనపై నమ్మకము లేదు. మన మందలము ను సామ్రాజ్య ద్రోహులమని వారి యూహ. మనకును వారిపై నమ్మకము లేదు. ఎవరికిఁ గావలసిన తర్కములు వారి కున్నవి ఎన్నఁడో యీ యిరువాగులును యుద్ధమున నెదుర్కొనుట తప్పదు. కాని యీ సారి యుద్ధమున తంజావూరు రాజ్యము హతమై పోవును. ఈ సారి వారి నోడించెడి శక్తి శ్రీరంగ నాథుడు నా భుజములకు దయసేసి యున్నాడు. పోరిలో మనవైపు బోరుటకు పోర్చుగీసులు సమ్మతింతురు. పాదరి పిమెంటోగారి మాటవిని - యీయూరిలో నేను చర్చి గట్టించినది యీ యూహతోనే. ఈ పిమెంటో సామాన్యుడు గాడు. ఇతని మూలమున పోర్చుగీసుల సాయము ఖండితముగ మనకు లభింప గలదు. ఈ సారి పోర్చుగీసుల మందు గుండు సామానులకు తంజావూరు హతమైనట్లే.

"చక్రవర్తి మనపైకి సైన్యము పంపినచో వాని నెదురించు శక్తి మనకు గలదా!?"

"దానికై నీవేమియు భయపడకుము. విజయనగరపు కొలువులో నా మిత్రులనేకులున్నారు. వారిలో జగ్గరాజు ముఖ్యుడు. ఈ జగ్గరాజు చక్రవర్తికి బంధువు గూడ. వానిపై వెంకటపతి దేవరాయల కెంతయో విశ్వాసము. వాని సాయమున మనపై చక్రవర్తిసైన్యములు రాకుండునట్లు యత్నించవచ్చును."

"అదెట్లు సాధ్యము?"

"ఆ వివరములన్నియు నిప్పుడు చెప్పలేను. ఇప్పటి కింత చాలును ఆ జగ్గరాజు గూడ సామ్రాజ్య విరోధియే. అంత మాత్రమే గాదు. వారిలో ప్రముఖుడు గూడ. అంగ బలము లన్నియు సమకూరియున్న వ్యక్తి. వానినే చక్రవర్తి నమ్మినాడు. అతని యమాయకతకు నాకు నవ్వు వచ్చును."

జింజికృష్ణప్ప నవ్వెను.

"అయినచో - తంజావూరికిని మధురకును యుద్ధము తప్పదన్నమాట."

"తప్పదు. ఈ యుద్ధమెప్పుడో జరుగవలసి యుండెను. ఇప్పటికే యాలస్యమై పోయినది."

"ఒకరి యిష్టానిష్టములకై యొక మహాయుద్ధమన్నమాట"

"అవునవును. ప్రపంచములోని ప్రతి మహా సంఘటనయు గొంతమంది వ్యక్తుల పైననే యాధారపడి యుండును. చక్రవర్తులపైగూడ మాకనసమ్మతి కద్దు. అతడు సామంతులను గౌరవముగ జూచుటలేదు. తంజావూరి వారి బలమొక్కటియే - తన్ను సంరక్షించునని చక్రవర్తి యభిప్రాయ మైనట్లున్నది. వారి నొక్కరిని మాత్రము మరి యూడగ జూచును, తక్కిన వారి గౌరవము చక్రవర్తి దృష్టిలో తృణప్రాయము. మా యాత్మ గౌరవమును

చక్రవర్తి యడుగడుగునను అవమానించుచునే యున్నాఁడు. ఈ కళంకమును యుద్ధముచేతనే పోగొట్టుకొనవలయును. మే మందుకు సిద్ధపడియే యున్నాము. రాఁబోవు యుద్ధమునకు దగినసైన్యమును గూర్చుకొనుమని మీతండ్రికొక విరూపమును నంపించుచున్నాను. దానిని-నీ వాతనికంపఁజేయవలెను. నీవు విడిదికి బోవు వేళకు మా చారుడా రాయసమును నీ కందించును."

కుమార కృష్ణప్ప-ప్రభువునకు వినయముగ నమస్కరించెను. కృష్ణప్ప కుమార సోలగుని మనసార గౌఁగలించికొనెను. కర్పూర తాంబూలమిచ్చి విడిదికంపినాఁడు.

కృష్ణప్ప నోటినుండి యుద్ధవార్త విన్నతర్వాత-కుమార సోలగుని భీతి రెండింతలయ్యెను. దురదృష్టవంతులైన యిర్వురు దంపతులను కారణముగ గైకొని రెండు రాజ్యములు పోరాడబోవుట వాని కే మాత్రమును సరిపోలేదు. సామ్రాజ్యమును చిన్నాభిన్నములు సేయు యత్నములుకూడ వానికి గిట్టినవి కావు ఎట్లయినను ప్రయత్నించి యీ యుద్ధమును గాకుండ నిలుపవలెనని వాఁడు నిశ్చయించికొనెను. కాని-దానికి మార్గమేది? రెండు రాజ్యముల నడుమ యుద్ధ మేఘములు ఘోరముగ నావరించియున్నవి. వానిదృష్టి 'ఘావరిపిమెంటో' పైకి మరలినది. అతని మాటకు జింజికృష్ణప్ప ఎక్కువ వెల

యిచ్చునని గూడ యిప్పుడే తెలిసికొన్నాఁడు. అతనితో నెట్లయినను పరిచయము చేసికొనవలెననియు-అతనిని తన వైపు ద్రిప్పికొనినచో-కార్యమును సాధింపవచ్చునని-వానికిఁ దోచినది. కుమార సోలగుఁడు పిమెంటోను చూడనేగెను. ఫాదిరీయొక్క సరళ ప్రవర్తన-ప్రియములైన మాటలు వాని మనస్సును లోఁగొనెను. దీనులపై నాతనికున్న దయనుజూచి కుమార సోలగుఁ డెంతో యానందపడెను. ఈ రెండు రాష్ట్రముల నడుమనున్న వైమనస్యములు తొలగించుటకు-ఆతఁడే శక్తుఁడని వాఁడు నిర్ణయించుకొన్నాఁడు. జింజి కృష్ణప్పయు-తన తండ్రియు-నాతని మాటలను దాటి పోలేరు. కారణ మేమనఁగా-ఆతని మాటల వెనుక పోర్చుగీసువారి మందు గుండు సామగ్రి యున్నది. అతనిని దేశకల్యాణమునకై వినియోగించికొనవలెనని వాఁడెంచినాఁడు. ఏమాత్రమును దాచుకొనకుండ వాఁడన్ని విషయములును పిమెంటోకు దెల్పెను.

"మా తండ్రి పాప సముద్రమున దుముకుటకు సిద్ధ పడుచున్నాఁడు. మీ రాతనిని రక్షింపవలెను. తంజావూరు జింజిల నడుమ జరుగనున్న భయంకరమును-తమరు గాకున్నచో వేరెవ్వరును నిలుపలేరు. అమాయకులైన ప్రజల రక్తము భూమిపై పారుట తప్పదు."

"మీ తల్లిగారు పరమ సాత్త్వికురాలని విన్నాను. ఆమె మీ తండ్రిగారికెందుకు బోధింపగూడదు. దుష్టశ

మెంత బలవత రమైనను - సాత్త్వికతముందు తల వంచియే తీరును. ఇది సృష్టి నియమము. దైవ సంకల్పము. కనుక తమ తల్లి దయ పెట్టినచో నా దంపతులను విడిపింపవచ్చును. రానున్న యుద్ధమును తప్పింపవచ్చును.”

కుమార సోలగుని ముఖము కళాహీనమయ్యెను. వాడొక్కసారి దీర్ఘముగ నిట్టూర్చెను.

“మా తండ్రి కథ మీకు తెలియదు. ఆతఁడు మా తల్లి మాటల కెంతమాత్రమును విలువియ్యడు,

కుమార సోలగుఁడు-తన తల్లిదండ్రులకున్న సంబంధ మంతయును వివరించి చెప్పెను.

సోలగుఁడు మంచము పట్టినప్పుడు అందరికంటెను నెక్కువ సంతోషపడినది గౌరాంబికయే యనవలెను. వాని కామె భార్యయైనదే యొక పెద్ద కథ. పగ దీర్చుకొనుటకే గౌరాంబ వానికి భార్య యైనది వాని కార్యములకామె తన మనస్సులో నెంతయో యసహ్యపడుచుండెను. వాఁడన్నచో నామెకు ద్వేషము. లోక సృష్టిలో వారిర్వురును భార్యాభర్తలు, కాని హృదయమున పరమ శత్రువులు. సోలగుఁడు జబ్బుపడినప్పు డామె యిట్లన్నది.

“ఇదంతయు మీ పాపఫలము. ఇహలోకముననే నరక మనుభవించుచున్నారు. ఇంకను-మీ శిక్ష పూర్తిగా లేదు. మీరు చేయుచున్న యత్యాచారములు- ఎవ్వరికి తెలియవని

మీ యభిప్రాయము. కాని-భగవంతుఁడు సాక్షిభూతుఁడై మనము చేసెడి ప్రతికార్యమును జూచుచు నేయున్నాడు. వాని కన్నులు మూయుటకు సాధ్యముగాదు. ఇప్పటికైనను చేసిన పనులకుఁ బశ్చాత్తాపపడుట మేలు. ఆ దంపతులను విడిచిపుచ్చి వారిని తప్పు క్షమింపుడని వేడుకొనుట మంచిది.”

ఈ మాటలు విన్న సోలకుఁడు-భయంకరముగ గర్జించినాఁడు. వాఁడు నోరు తెరచినచో నన్నియును బూతులే.

“ఇందుకా నీ విక్కడికి వచ్చినది? పిశాచీ! ఇక్కడి నుండి తొలఁగిపో! లేకున్నచో నీ గొంతు పిసికివేయుదును. నీవా నాకు బుద్ధి చెప్పెడిదానివి? నీ పొగరణచకున్నచో నా పేరు సోలకుఁడే కాదు! ....

వాఁడు తన దగ్గఱనున్న యొక తట్టనెత్తి యామెపై విసరెను. కాని యది గురి తప్పినది. ఇక నక్కడ నిలచి యున్నచో-వాడు పై బడునేమోయని యామె తొలఁగి పోయినది.

ఈ మాటలువిని “పిమెంటో” నిట్టూర్చినాఁడు. ఇట్టి వారి మనస్సును మార్చుటను భగవంతుఁడే పూనుకొనవలెను. మీ తండ్రికి సద్బుద్ధినిమ్మని ఏసుస్వామిని ప్రార్థింతును.

“మా తండ్రి సైతాను భక్తుడు. ఆతనికి నరబలి ప్రీతి. గర్భిణీస్త్రీలను-చిన్న పిల్లలను అతఁడు భైరవునకు బలినిచ్చెను. ఆ హృదయమున కరుణకు తావులేదు. మానవత్వము సన్న.

అప్పుడే యేమైనది! అతడికముందు నెంత లేసి పాప ము లొనర్చునో! తమరెట్లయినను ఈ సత్కార్యమునకు బూను కొనవలెరు. తమకు పోర్చుగీసులలో నెక్కువ పలుకుబడి యున్నది. మీ మాటలపై కృష్ణప్పనాయకునకు గౌరవము కద్దు. తమరీ రెంటిని యుపయోగించికొని - యెట్లైనను రాగల యుద్ధమును తప్పింపవలెను. చెఱలోనున్న యీ దంపతులను విడిపింపవలెను. మీవంటివారే యిట్టి కార్యము లకు బూనుకొనకున్నచో-నెట్లు?"

కుమార సోలగుని మాటలు "పిమెంటో" కెంతయో రుచించెను. అతఁడిట్లు పలికెను.

"నాయనా! ఒక్క పదినిముసములకు ముందు నీవెవరో నే నెవఁడనో? కాని-మన మిప్పుడు దగ్గరి చుట్టములైనాము. జాతి మతములు మన హృదయముల కడ్డురాలేదు. స్నేహ బంధమన్న దిట్టిదే! ఏసుక్రీస్తు దివ్యబోధయిదే. సత్యము ప్రేమ అహింస మొదలగునవి-వారే దేశస్థులైనను-అందరికిని ఒకటే. వీనికై పోరాడువారు - త్యాగముసేయువారు - పరస్పరము సోదరులు. వీనికై మరణించెడివారు ధన్యులు. ఈ యుద్ధమును నిల్పుటకు నాశక్తి సామర్థ్యములన్నియు వినియో గింతును. నేనిక్కడ మూఁడు నాల్గు దినములుందును. అటు తరువాత-కృష్ణ పట్టణమునకు బోదును. ఈపైన దేవకోట

కరుదెంతును. ఇక్కడ నున్నంతలోనే జింజి కృష్ణప్పగారితో మాటలాడి నాయభిప్రాయమును వారికి దెల్పెదను. ప్రయత్నము మనది. ఫలాఫలములు దైవేచ్ఛ. నీవింక నిశ్చింతగ నూరికి బొమ్ము."

కుమారసోలగుండాతనికడ సెలవుదీసికొనెను. వెనుకకు దిరిగివచ్చునప్పుడు దేవిని దర్శించి కొని వత్తమని వాడు దేవాలయములోనికి బోయెను. దేవిని దర్శించి యతడు తీర్థ ప్రసాదముల గ్రహించెను. తిరిగి వచ్చునప్పుడు ముఖమంటపమున నెవరో సన్యాసి ధ్యాననిష్ఠుండై యుండెను. అతని ముఖమున నొక యపూర్వ తేజస్సు; ఆ కన్నులు తన్ను పిలుచుచున్నట్లున్నవి. మంత్రముగ్ధునివలె కుమారసోలగుండాతనిని దరిసి నమస్కరించెను. సన్యాసి చిఱునవ్వినాడు.

"వత్సా! నీవేమియు జింతింపవలదు "కమలకణ్ణి" దేవి యనుగ్రహముతో నీవు తలచిన కార్యము తప్పక నెరవేరును.'

ఈ మాటలతో కుమారసోలగునికి గలిగిన యాశ్చర్యమునకు మేరలేదు.

"స్వామీ! మీరెవ్వరో నాకు దెలియదు. నామనస్సులోని కల్లోలమును తమరెట్లు గ్రహించితిరో-కాని మీ మాటలతో నా కెంతో సంతోషమైనది. నిక్కముగ నా కోర్కె యీడేరునా?"

"వత్సా! దీనికి సందేహమే లేదు."

"అది మహాభయంకరమైన కార్యము; ఒక మహాయుద్ధమునకు సంబంధించినది."

"అవునవును. నేనెఱుగుదును"

"మీరు త్రికాలజ్ఞులవలె నున్నారు. మీ దర్శనముతో నేను కృతార్థుఁడనైతిని. మీతో కొన్ని దినములు గడుపవలెనని నాయాకాంక్ష. కాని-నేఁడే నేను-దేవకోటకు బ్రయాణము గావలసియున్నది. మిమ్ము మరల దర్శించు భాగ్యమున్నదో లేదో!"

సన్యాసి మరల నవ్వెను.

"తప్పక యున్నది. "దేవకోట" లో నే నన్ను చూచెదవు."

"మహాభాగ్యము."

"వత్సా! నీవు పుణ్యశాలివి. పుణ్యవంతురాలి గర్భమున జన్మించినావు. కాని పాపపూరితమైన యన్నమును తినుచున్నావు. అందుకే నీ కోర్కెలు కొనసాఁగుట కాలస్యమగుచున్నది. కాని యెన్నఁడో యొకనాఁడధర్మమును ధర్మము జయించియే తీరును. అంతవరకును గాచికొని యుండుటకంటెను-మరి కార్యాంతరము లేదు. పోయిరమ్ము. నీకు శుభమగుగాక!"

ఆ సన్యాసి యజ్ఞనారాయణ దీక్షితులు. అతఁడు జింజియందే యుండెనని చెప్పియుంటిమి. కుమార కృష్ణప్ప

నాతఁడు కనిపెట్టుచునే యుండెను. జింజిరాజు ప్రియత్నము లన్నియు గమనించుచునే యున్నాడు. ఫాదరి ఫిమెంటాతో కుమార సోలగునికైన సంభాషణలనుకూడ నాతఁడు సవసవగా వినియుండెను. అతఁడక్కడి క్రైస్తవులతో బరిచయము చేసికొన్నాఁడు; సర్వమత సమన్వయమునుగూర్చి-యతఁడు వారితో ముచ్చటించెను. తమపని యీడేర్చుకొనుట కిప్పుడు కుమార సోలగుఁడే యాధారము. ఇది తప్పినచో యుద్ధమేగతి.

యజ్ఞనారాయణుఁడు జింజిలో జరుగుచున్న విశేషము లన్నియు నెప్పటికప్పుడు తంజావూరికి తెలియజేయుచుండెను. కుమార సోలగుఁడు వెళ్లినతర్వాత-అచ్యుతప్పనాయకున కీ విషయమును వివరించుచు నొకపత్రమును వ్రాసెను. దాని కడపట నీ మాటలున్నవి.

"ఇప్పుడు ప్రతి నిమేషమును-అమూల్యమైనది. కుమార కృషప్పను నేడు చూచి మాటలాడిన విషయములు-పైననే వివరించినాను. నేనుకూడ దేవకోటకు బ్రయాణమై పోవు చున్నాను. ఈ ప్రియత్నములు సఫలమైనచో-మరలమిమ్ము దర్శింతును. లేకున్న మరణింతును. ఇది నా జీవితమున నొక యగ్నిపరీక్ష. దీనిలో జయాపజయములు దైవాధీనములు పురుష ప్రియత్నము మాత్రమే నాది."

నారాయణ దీక్షితులు జింజిలో గొందరిని కావలి వారిని లోఁబఱచికొని యుండెను. ప్రపంచములో ధనమునకు లోబఁడనివారెవ్వరు?. అతనికెప్పటికప్పుడు తంజావూరినుండి ధన సహాయము వచ్చుచుండెను.

కుమార కృష్ణప్పకు వాగ్దానము చేసినట్లే కృష్ణపట్టణమునకు బోవుటకుముందు ఫాదర్ ఫిమెంటో-జింజి కృష్ణప్పతో గలిసెను. మాటలనడుమ - తంజావూరికిని - జింజికిని జరుగబోవుచున్న యుద్ధమునుగూర్చిన ప్రస్తావన వచ్చినది.

కృష్ణప్ప యిట్లనెను.

"మీ కిక్కడి రాజకీయములతో సంబంధము లేదు. అందుచే నీ దేశములోని విషయములు స్పష్టముగా దెలియవు. మాకు మీ మాటపై గౌరవమున్నది. కాని యొకటిమాత్రము మనవి చేయుచున్నాను. ఇది మా రాష్ట్ర గౌరవమునకు సంబంధించిన ప్రశ్న. మా యాత్మ గౌరవమును గూర్చిన విషయము. ఇప్పుడు యుద్ధము జరిగితీరవలసిన పరిస్థితి యేర్పడినది. దీని నెవ్వరును తప్పింపలేరు. ఇదివరకు-మా యిర్వురి నడుమ ద్వేషము పొగలు రేగుచు వచ్చినది. దానికిప్పుడు కావలసినంతగాలి వీచినది. ఇక మంటయగుట యే తడవు. ఇది మా చావుబ్రదుకుల సమస్య. నేడు గాకున్న రేపైనను ఈ విషయము తేలిపోవలెను. సామ్రాజ్యము యొక్క రక్తము చెడిపోయినది. ఆ రక్తము పుండుకట్టి బయటికి వచ్చియే తీరవలెను. శాంతికి సంబంధించిన మాటలు

తరువాత. చెడ్డరక్తము బయటికి పోకున్నచో-దేహమున కారోగ్యము లేదు. అట్టి కార్యములను భంగమునొందింప కున్నచో-దేశమునకు క్షేమము లేదు. కనుక నీ యుద్ధము నాపుటకు వీలులేదు. మీరు మా స్నేహితులు ఆ ధర్మమును పురస్కరించికొని-మా యత్నములకు మీరు సాయ మొనర్తురని నమ్మికొని యున్నాము. ఒకవేళ నీ యుద్ధము మీకును-పోర్చుగీసులకును అసమ్మతమైనచో-మేమొక్కరమే పోరాడుదుము. జయాపజయములు దైవాధీనములు”

ఈ మాటలపై నింక పట్టింపు బూనినచో ప్రయోజనము లేదనుకొన్నాఁడు ఫాదర్ ఫిమెంటో. అతఁడా విషయము నక్కడికి వదలివేసెను. ఫిమెంటో కృష్ణాపురమునకు ప్రయాణము గట్టినాఁడు. కృష్ణప్ప తన పేరిట నొకనగరము గట్టియుండెను. అదే కృష్ణాపురము. అక్కడగూడ నొక చర్చిని గట్టింపవలెనని ఫిమెంటో ప్రార్థించినాఁడు. దానికి కృష్ణప్ప యంగీకరించెను. చర్చిగట్టుట కనుకూలమైన స్థలమును జూచి తనకు దెలుపవలసినదని-ఫాదర్ ఫిమెంటోతో కృష్ణప్ప యనెను. ఫిమెంటో కృష్ణాపురమునకు బోవుట కిదియే కారణము. ఆతఁడు తన డైరీయందు జింజిలోని తన యనుభవము నిట్లు వ్రాసికొన్నాడు.

“మేము జింజికి వెళ్లితిమి ఇండియాలో-అన్నిటికంటెను అది గొప్ప నగరము. పోర్చుగీసు నందలి “లిజ్‌బన్” పట్ట

ణమును వదలినచో-ఇంతటి గొప్ప పట్టణము ప్రపంచము నందెక్కడను లేదు. నగర మధ్యమున నొక దుర్భేద్యమైన కోటయున్నది. దాని చుట్టును నీటితో నిండిన కందకము. కోటనడుమ నున్నతమైన గుట్ట గలదు. అది యొక శిలాపీఠము వలె నున్నది. నాయకుఁడు వసించు భవనమునకు గోపురము లున్నవి అతని భవనము కోటయందలి ప్రాసాదము లన్నిటి కంటెను పెద్దది. రాజబంధువులు, అధికారులు మొదలగువారి యిండ్లు చాల విశాలములుగ నున్నవి. తక్కిన యిండ్లంత పెద్దవి గావు

నాయకుని భవనము: దాని కట్టడమే యొకతీరు. దూరమునకును గనిపించెడి గోపురములు, విశాలములయిన వరండాలు: మాకు కృష్ణప్పనాయకుఁ డీ కోటలోనే వసతి గల్పించెను. కాని మేము యెండకు తట్టుకొనలేక సమీపమందలి యొక దేవస్థానపు తోటలో బసచేసితిమి.

మూడవనాఁడు కృష్ణప్పనాయకుఁడు మమ్ము కోటలోనికి దీసికొనిపోయెను. అంతఃపురము నంతయు నాతఁడు మాకుఁ జూపించినాడు. కోటలోనికి బోవుట కొకటే మార్గము. ఆ మార్గమున వీరభటులెప్పుడును కాపలాయుందురు. కోటలో నొక పెద్ద గరిడీ గలదు. దానిలో రాజకుమారులు కసరత్తు చేయుచుందురు. మందుగుండు సామానులుంచు కొట్టిడీలు గూడ నున్నవి. ఆసమీపముననే యొక సుందరమైన సరస్సు.

నాయకుఁడు మాకా దుర్గమంతయు జూపినాఁడు. మేము కోటపై కెక్కితిమి. సైనికులు మ్రోయించు రణవాద్యములు మాకు గనపడెను. తరువాత చెఱసాలవైపు నడచితిమి. ఒకనాఁడిందే జింజి కృష్ణప్పను బంధించియుంచిరట. అతడక్కడనుండి తప్పించుకొని, తన పినతండ్రి కన్నులు పెరికించి ఆ చెఱసాలయందే యాతనిని బంధించెను. కృష్ణప్పనాయకుఁడు గుఱ్ఱముపై నెక్కియుండెను. మాయిర్వురివెంటను కాపులు నడచివచ్చిరి. నాయకుఁడు కోటలోనికిఁ బ్రవేశించినప్పుడు అతని గౌరవమునకై ఫిరంగులు కాల్చఁబడినవి.

కోటలో నన్నికడలును నేను జూచితిని. సుమారు రెండువందలమంది బ్రాహ్మణు లంతఃపురములో నున్నారు. వారెప్పుడును కృష్ణప్ప నాయకునికి క్షేమము గలుగుటకై మంత్రతంత్రముల ననుష్ఠించుచుందురట. వారి జీతబత్తెములు కృష్ణప్పయే యిచ్చును. నాయకుఁడు పట్టుదిండ్లపై నానుకొని యుండును. ఆగంతుకులు కూర్చుండుటకు రత్నకంబళ్ళుండును. అతని మెడలో నవరత్నఖచితమైన హారము తూగాడుచుండును. శరీరమునందును, శిరస్సునందును ముత్యములసొమ్ములు, రతనాల తొడవులు; కొందరు బ్రాహ్మణులు రాజపుత్రులు అతనిముందు తలవంచి నిలుచుకొనియుండిరి. అతని వైభవమట్టిది.

అతఁడు వారికి వెలగల వస్త్రువులను బహుమానమిచ్చి పంపివేసెను.

అంతఃపురము రక్షణార్థమై మున్నూఁరు మరెంచిన యేనుగు లెప్పుడును సిద్ధముగ నుండును: కృష్ణాపురమున "చర్చి" నిర్మించుటకు మాకతఁడు మున్నూఁరు బంగారు నాణెములను నిండుకొలువున నొసఁగి గౌరవించెను.

కృష్ణప్ప యన్నమాటలతో "ఫిమెంటో"కు నిరాశ గలిగెను. కాని, యుద్ధము నిలుపు ప్రియత్నమును :డి యాఁతడు విరమింపఁడయ్యెను. సోలఁగుఁడు చెఱబట్టిన యా దంపతులను విడిపించినచో యుద్ధము నిలచిపోవునని యాతని యూహ. ఈ విషయమై-సోలగునితోనే మాటలాడవలెనని "పిమెంటో" భావించెను. ఈ నెపమున సోలగునితో పరిచయము నేర్పఱచి కొని-"దేవకోట"లో గూడ నొక చర్చి నిర్మాణమునకై బ్రియత్నింపవలెనని యాతని మరియొక యాశ. సోలగున కాతఁడొక పత్రిమును వ్రాసెను. ఆ పత్రిము నెవరివెంట బంపవలెనని యాతఁడాలోచించెను. ఆ సమయమునకు సరిగ-యజ్ఞనారాయణదీక్షితులు ఫాదర్ ఫిమెంటో దర్శనము నకు వచ్చినాఁడు. అతఁడొక సామాన్యసేవకుని వేషమును ధరించి యుండెను.

"స్వామీ! కుమార కృష్ణప్పగారు జింజినుండి వెడలి పోయినారా?."

"నిన్ననే వెళ్ళిరి. మీరెవరు? మీ కాతనితో నేమిపని?

"నేను వారి వెంటవచ్చిన యొక సేవకుడను. నిన్నటి రోజున ప్రయాణమునకందరును సిద్ధముకావలెనని యువరాజు లాజ్ఞనొసఁగి యుండిరి. కాని- నేను సమయమునకు సరిగా నిర్ణీత స్థలమునకు రాలేక పోతిని"

"కారణము?"

సేవకుఁడేడ్చుట కారంభించెను. కొంతసేపైన తరువాత నిట్లనెను.

"మీతో నా విషయము చెప్పుటకు సిగ్గగుచున్నది. కాని యిప్పుడు సిగ్గుపడి లాభము లేదు. జింజి వైభవమును జూచి నా కాశ్చర్యమైనది. నే నచ్చటి వేశ్యవాటిలోనికిఁ బ్రవేశించితిని. కల్లుత్రాగి మైమఱచితిని. ఆతరువాత నేమి జరిగెనో నాకు తెలియదు. తెల్లవారు వేళకు వీథి కొనలో బడియుంటిని. ఎవరో దొంగలు నేను మైకములోనున్నప్పుడు నా ధనమంతయు దోచుకొని-నన్ను వీథిలోపారవేసి పోయి నట్లున్నది. తెల్లవారు వేళకు నా యొద్ద నొక చిల్లిగవ్వయును లేదు. పైగా-యువరాజులుంగారు నిన్ననే యూరు విడిచినట్లు వార్తలు వచ్చినవి. నాకేమి చేయుటకును తోచలేదు."

వాఁడు మరల నేడ్చుట కారంభించెను.

"అయ్యా నీపేరేమి?"

"పెరుమాళ్"

"నీవిచ్చటికి వచ్చినపని యేమి? చేసిన దేమి? చేయవలసిన పనిని విడిచిపెట్టి దుర్వ్యసనములకు లోబడి నిన్ను నీవు మఱచియుండుట తప్పు కాదా?"

"తప్పు. మూడుసార్లు తప్పు. నాబుద్ధి గడ్డితిన్నది. మీరు యువరాజులుంగారి స్నేహితులని వింటిని. ఎట్లయినను నన్ను మీరు బ్రదికింపవలెను. యువరాజు నన్ను మఱల పనిలోనికి దీసికొనునట్లు చేయవలెను."

"కుమార సోలగుఁడు నాకు మిత్రుఁడు. నిజమే. కాని నిన్ను మఱల పనిలోనికి దీసికొనవలెనని నే నేమొగము బెట్టికొని చెప్పుదును?"

"నాపై తమరు దయ యుంచవలెను. మీరు వీనిని క్షమింపుమని యొక జాబు వ్రాసి యిచ్చినచో నాపని సరిపోవును. కుమార కృష్ణప్పకు మీమాటలపై నెక్కువ గౌరవము."

"అది నీకెట్లు తెలియును?"

"ఎన్నిసారులో మాయెదుట మిమ్ము వారు ప్రశంసించిరి. మీరు వారికి నిష్టబంధువుల వంటివారని తెలిపియుం ..."

"రాజకుమారులకు మాపై నంత యభిమానముండుట

మాకు సంతోషమే. ఆయభిమానమునకు నే నెంతవఱకు పాత్రుఁడనో నాకుఁ దెలియదు. నీవు దేవకోటకుఁ బోవు చున్నచో సోలగప్ప కొక పత్రమును వ్రాసి యిచ్చెదను. దానిని నీ వాతని కందజేయవలెను."

"మహా ప్రసాదము."

సేవకుఁడు తలను తృప్తిగ నాడించినాఁడు. ఆ పత్రము నవకాశముగ దీసికొని తన యజాగ్రత్తను గప్పి పుచ్చుకొన వచ్చునని వాని యాశ; 'ఫాదర్' జాబు వ్రాసి యిచ్చెను.

యజ్ఞనారాయణుఁడు దేవకోట జేరువరకే కుమార సోలగుఁ డా యూరికి వచ్చియుండెను. పున్నమ యిఁక నొక వారము మాత్రమే యున్నది. కావలసిన ప్రయత్నములు జరిగిపోవుచున్నవి. ఈ యుత్సవమున కాహ్వానింపబడిన పెద్దలు గుంపులు గట్టుకొని వచ్చుచుండిరి. ఇక సామాన్య జనులకు లెక్కయే లేదు. ఈ యుత్సవసమయములో నెవరయినను కోటలోనికి రావచ్చును: పోవచ్చును. తక్కినప్పుడు సోల గుని యాజ్ఞ లేని దెవ్వరును లోనికి బ్రవేశింపరాదు. ఉత్సవ కాలమున దుర్గములోని రక్షణ నియమము లంతగా పాటింపఁ బడుట లేదు. యజ్ఞనారాయణుఁడు సులభముగ కోటలోనికిఁ బ్రవేశించినాఁడు. ఇది బయటి కోట.

లోపల వేరొక్క దుర్గమున్నది. చెఱసాల యున్న దందులోనే. తంజావూరు దంపతుల నందు బంధించినారు:

ఆవిషయమును దీక్షితుఁడు పత్తాదీసినాఁడు. అతడనేక త్రిప్పల నెఱుగును, భాషలు మాటాడును, నాటి మంత్రుల కివన్నియు యోగ్యతలు. కుమారకృష్ణప్పతోడి పరిచయమునకై దీక్షితుఁడు ప్రయత్నించుచుండెను. కాని యది యసాధ్యముగా గన్పడినది, ఆతఁడు నిరాశ నందలేదు. తాను ఫిమెంటోనుండి వచ్చిన దూతననియు, సోలగప్ప నాయకున కొక జాబు తెచ్చితిననియు నాతఁడు గోపలి కోటలో నున్న రక్షణాధికారి కెరిగించినాఁడు. వాఁడు దీక్షితుల నాపాదమస్తకము పరిశీలించెను.

"మీ రిక్కడనే యుండుఁడు. నేను వెళ్ళి నాయకుల యనుజ్ఞ గొనివత్తును."

"వాఁడు కోటపైకి వెళ్ళుటకై అక్కడ నున్న యూయెలలోఁ గూర్చుండెను.

శత్రువులనుండి తన్ను రక్షించుకొనుటకు సోలగుఁడు కొండపై నొక కోట గట్టెను. ఆకొండ యొక్కటే శిల. దాని పైకిబోవుటకు 'ఉయ్యేల' యొక్కటే శరణ్యము. కొండ చాల పెద్దదగుటచే దాని నెక్కుటకు సాధ్యముగాదు. కొండ కొక వైపున మాత్రమే దారియున్నది. ఆ మార్గమునుండి గుఱ్ఱములు, నేనుగులు మొదలగునవి నడచిపోవును. ఆ దారిలో నెప్పుడును విచ్చుకత్తులతోడి భటులు: ఆ త్రోవలో మనుష్యులెవరును నడువరాదు. నడచినచో చెఱసాల తప్పదు. గుఱ్ఱ

ములు, నేనుగులు తప్ప తక్కిన వారెవ్వరు కోటలోనికి బోవ లసియున్నను కోటకిరింద వ్రేలాడుచుండెడి డోలికలో నెక్క వలసియుండెను.

ఆ యూయెల చాల పెద్దది. దానిలో నొకటేసారి రెండు పదులమంది యెక్కవచ్చును. సోలగప్ప వచ్చినప్పుడు మాత్రము దానిలో నెవ్వరు నెక్కరాదు. అతఁడా తొట్టిలో దన పల్లకితో గూడ గూర్చుండును. ఒక్కడే దిగి వచ్చును. ఒక్కఁడే పైకి బోవును. ఆతొట్టికి పెద్దపగ్గములు కట్టబడి యున్నవి. కోటపై పెద్ద గిలక యుండెను. ఈచర్యయంతయు సాధారణముగ మోట దోలుటవలె సాగిపోవును. ఎద్దులకు బదులు నేనుగులను గట్టుచుందురంతే. రాత్రిలందీ తొట్టెను కోటపైకి లాగియుంచుచుండిరి. ఈ డోలికను జూచిన దీక్షితుల గుండెలు బావురుమన్నవి.

ఆ డోలిక నెక్కి పైకి వెళ్ళిన రక్షణాధికారి కొంత సేపటికి దిగివచ్చినాఁడు. దీక్షితులను 'పైకి దీసికొనిరమ్మ'ని యాజ్ఞ యైనది. అతనిని రక్షణాధికారి పిలుచుకొనిపోయి యంతఃపురాధికారుల ముందు నిలిపెను. వారాతనిని ప్రశ్నించిరి. శరీరము, దుస్తులు పరిశోధించిరి. తరువాత సోలగుని విశ్రాంతి భవనమునకు గొంపోయిరి. మరి యక్కడ మనుష్యులు లేరు. సోలగుఁడు తల్పముపై బండియుండెను. వాని దేహాము కాలాయసవర్ణము. కన్నులు సూదులవలె నుండెను.

మొగము నిండ మీసములు. వాఁ డొక నిషాదరాజువలె నుండెను. దీక్షితులు సోలగునకు నమస్కరించెను.

"మీరెవ్వరు? మిమ్ము బంపిన యీ 'ఫి మెం టో' యెవ్వరు?" సోలగుని గొంతులో పిడుగులుండెను.

'ప్రభూ! ఫాదర్ ఫిమెంటోగారు మీకొక్క జాబు నొసగినారు." వస్త్రమున పదిలపఱచుకొన్న జాబును దీసి దీక్షితులు సోలగుని కిచ్చెను.

పత్రమును జదువుకొనుకొలదియు వాని ముఖము వికసింపఁ జొచ్చినది. ఆ వికసించుటయు భయంకరముగనే యుండెను. దీక్షితునకు కనకాంగి రాగములోని శుద్ధస్వరములు జ్ఞాపకమునకు వచ్చినవి.

వాని పెదవులపై చిఱునవ్వు మొలచెను. ఆ నగవు శాల్మలి బూచినట్లుండెను. "మంచిది, మంచిది; 'ఫాదర్ ఫిమెంటో' గారిచ్చటి కెప్పుడు వత్తురు?"

"ఈ యుత్సవములకే వారు రావలసియుండెను. కాని జంజి కృష్ణప్పగారి బలవంతముతో వారు 'కృష్ణపట్టణము' నకుఁ బోయినారు. అక్కడి పనులు ముగిసిన వెంటనే యిక్కడికి వత్తురు."

"నా కుమారునితో దమకు పరిచయమైనదని వారు వ్రాసినారు. కుమార కృష్ణప్ప నాశీర్వదించినారు కూడ. వారు చాల మంచివారుగఁ గనుపించుచున్నారు. మీ రుత్సవములు

ముగియువరకిచ్చటనే యుండురా? లేక వెంటనే కృష్ణాపురమునకు బోవలెనా?"

"వారు వచ్చువఱకును నేనిక్కడనే యుండవలెనని వారి యాజ్ఞ."

"సంతోషము. మా యభిప్రాయముగూడ నదే. మీరు నివసించుటకు గొండకిందనొక చక్కని బస యేర్పాటు చేయించెదను. మీరిక వెళ్ళవచ్చును.

దీక్షితులు మెల్లగా నిట్లనెను.

"ప్రభూ! నా దొక మనవి."

"ఏమది?"

"ఫిమెంటోగారికిని తమ కుమారునకును బరస్పరము గొప్ప ప్రీతి యున్నదనుట మీ రెఱిఁగినదే. వీరి సద్గుణములకు ఫిమెంటోగా రెంతయో సంతోషపడినారు. నేనే స్వయముగా పోయి కుమార కృష్ణప్పగారికి తమ యాశీర్వాదము నందింపవలెనని వారు కోరియున్నారు."

దీక్షితు లీ మాటల నెంతో వినయముతో ననెను. ఆ ముఖము నందంతయు రాజభక్తియే దొలకాడుచుండెను. ఇంతటి యభినయవిద్య నాతఁడెన్నఁడు నేర్చెనో తెలియదు.

"దానికేమి? మీ రాతనిని జూడవచ్చును." కుమార కృష్ణప్పవద్దకు నీతనిని దీసికొనిపోవలసినదని యొక సేవకుఁ డాజ్ఞాపింపబడెను.

దీక్షితులు వెడలిపోయిన తరువాత సోలగుం డింకొక సారి ఫిమెంటోగారి యుత్తరమును చదివికొన్నాఁడు.

సామంత శ్రేష్ఠులు- కృష్ణప్పనాయకుల యాప్తమిత్రులయిన సోలగప్ప నాయనింగారి సన్నిధికి పోర్చుగల్‌లోని క్రైస్తవ ధర్మప్రచారణ సంస్థకు జెందిన ఫాదర్ ఫిమెంటో చేయు విజ్ఞాపనము. మీరు పోర్చుగీసువారి కాప్తమిత్రులని మాకు దెలిసినది. తమ రాజ్యములో క్రైస్తవధర్మప్రచారమునకు, పోర్చుగీసుల నివాసమునకు, వారి వ్యాపారమునకు గూడ నెక్కువ ప్రోత్సాహ మిచ్చినారని వినియున్నాను. మీవంటి మిత్రులను జూచుటకై దేవకోటకు రావలయునని మాకెంతయో యుత్సాహముగ నున్నది. కాని పనులు తెమలుటలేదు. కృష్ణాపురము' నకు బోవలసినదని కృష్ణప్పగారు బలవంతము చేసినారు. అందుచే మేమక్కడకు వెళ్ళుచున్నాము. అక్కడి పనులు ముగిసిన వెంటనే దేవకోటకు వచ్చెదము. మీతో మేము మనసు విప్పి మాటలాడవలసిన విషయములు కొన్ని యున్నవి. వానిని నేరుగా నివేదించికొందుము.

ఇట్లు
తమ విశ్వాసపాత్రుఁడు,
ఫాదర్ ఫిమెంటో.

ఈజాబు చదివినవెంటనే వాని యూహ లాకాశమున నెగురజొచ్చెను. పోర్చుగీసువారి సాయము తనకు దప్పక లభించు ననుకొన్నాడు. ఇక నేమున్నది! విజయనగర సామ్రాజ్యము కూలిపోయినట్లే. సామ్రాజ్యముతో పాటు తంజావూరు నామరూపము లేకుండ పోవును. అటు తర్వాత మిగులున దిర్వురే. జింజి కృష్ణప్ప, తాను. విజయనగర సామ్రాజ్యమునే హతమార్చిన సోలగప్పకు జింజి కృష్ణప్ప పిడికిట జిక్కిన పిట్ట. అతని తుదముట్టించుట యెంతసేపు. క్షణములో జరిగిపోవును. ఆపై నేమున్నది? దక్షిణదేశమున కంతటికిని దానే చక్రవర్తి! దినమున కొక భైరవోత్సవము. ఈ రీతిగా పగటికలలు వానికి వరుసగా గన్పింప జొచ్చినవి. సంతోషమున పకపక నవ్వెను. ఆ నగవులు భైరవుని కుక్కల యఱపులవలె నుండెను. నవ్వుచునే వాడు నిద్రించెను. అప్పుడు కలలింకను విజృంభించెను.

సేవకుడు దీక్షితులనంతఃపురములోని మఱియొక భాగమునకు దీసికొని పోయెను. కుమార కృష్ణప్ప నివసించు మేడ యదియే. అతడేదో పనిలో నుండెను. కుమార కృష్ణప్పకు దీక్షితులను పరిచయము చేసి ఆ సేవకుడు వెడలిపోయెను. కుమారకృష్ణప్ప దీక్షితులవైపు రెప్పవేయక జూడ మొదలు పెట్టెను. దీక్షితులు నవ్వెను. ఆ నగవొకసారి 'కమలకణ్ణి'

దేవాలయములో నగుపించినట్లు యువరాజు తలలో భాసించి నది. దీక్షితులిట్లనెను.

"యువరాజులు మమ్ము గుర్తుపట్ట లేదన్న మాట."

"ఎక్కడో చూచినట్లు జ్ఞాపకము. కాని యాచోటు జ్ఞాపకమునకు రాలేదు"

దీక్షితులు చుట్టును కలయజూచెను. ఆతని యభిప్రాయము కుమార కృష్ణప్ప గ్రహించినాఁడు. వారిద్దరొక యేకాంతప్రదేశమునకు బోయినారు.

"యువరాజులు మమ్మింతలోనే మఱచిపోయినారు. నిజమే. మరి నే నప్పుడీ వేషములో లేను. బైరాగి వేషమున నుంటిని."

"ఆ, అవును. 'కమలకణ్ణి దేవాలయమున' మిమ్ము జూచితిని. మీరు మాకు భవిష్యత్తు నెఱింగించితిరి."

"అదే. మరల మిమ్మెప్పుడు జూచుట యని తమ రడిగితిరి. దేవకోటకు వత్తునని చెప్పితిని."

"అయినచో మీరు నిజమయిన సన్యాసి గాదన్న మాట." యువరాజు నవ్వెను.

దీక్షితులు తన ముఖముపై ప్రసన్నతాభావమును గోచరింప జేసినాఁడు. ఆ ముఖమే కుమార సోలగుని యాకర్షించుచున్నట్లున్నది.

'మీమాట నిజమే. అంతమాత్రమే గాదు. రాజుల

గూఢచారులము."

కుమార కృష్ణప్ప యులిక్కి పడెను.

"ఎక్కడినుండి వచ్చితిరి?"

దీక్షితుల చూపులు నిశ్చలము లయినవి. వానిలో నేదో తీక్ష్ణత దీపములవలె మెఱయుచుండెను. అతఁడిట్లన్నాఁడు.

"నీతో నెందుకింత రహస్య గోపనము. నా పేరు యజ్ఞనారాయణ దీక్షితులు. తంజాపురమునుండి వచ్చితిని. కుమార రఘునాధనాయకుని మిత్రుఁడను. మీతండ్రి చెఱలో బంధించిన చెన్నప్పనాయకుని విడిపించుటకై మా ప్రయత్నము. ఈ ప్రయత్నములో మా ప్రాణములను బలియొసగుటకైనను సిద్ధపడినాము."

కుమార కృష్ణప్ప తలలో నూరు భావములు మెదలాడినవి. అతఁడు కొంచెము సేపేమియు బలుకలేదు. దీక్షితుఁడాతని మనోభావములను గమనించుచునే యుండెను.

"ఈమాట నాతో జెప్పుటకు భయమగుట లేదా!

"భయమెందుకు? మీరు మా మిత్రులని మాకు దెలియును. ఆ నిర్భాగ్యదంపతులు భైరవునకు బలియగుట తమ కిష్టము లేదనియు మే మెఱుఁగుదుము. ఆ దంపతుల కారణముగ రెండు రాష్ట్రముల నడుమ జరుగనున్న భయంకర యుద్ధమును మాన్పించుటకు తీవ్రముగ మీరు ప్రయత్నించుచున్నారనియు మా కవగతమే."

"ఇవన్నియు మీకెట్లు తెలిసెను?"

"మేము గూఢచారులమని తమకింతకు ముందే విన్న వించితిమి. సమాచారములను సేకరించుటకయి మేము పలురీతుల బ్రయత్నింతుము. ఆ యుపాయములన్నియు గాకుమారులకు దెలియనివి గావు"

"మీరెవ్వరో యసాధారణ వ్యక్తులుగ గన్పించుచున్నారు. అపాయబహుళమయిన యిచ్చటికి వచ్చి నాకు తమరీమాట లెరిగించుట సామాన్యమైన సాహసము గాదు. దీక్షితులు గారూ! మీ వృత్తాంతము మాతండ్రి చెవిని బడినచో ఆపై నేమగును?"

"ఏమగును? అతఁడు నాతల నుత్తరించివేయును. లేకున్న చిత్రహింసలు పెట్టి చంపును. సరస్సులోని మొసళ్ళ కాహారముగ వేయును."

"ఈ యపాయమున్నదని తెలిసియు మీరెందుకీ పనిలో చేయి వేసినారు? మీకు ప్రాణములపై నాశలేదా?"

దీక్షితులు ఫక్కుమని నవ్వెను. ఆనవ్వులో వేదాంత పరమార్థమగు అనాసక్తియంతయు పుంజుకొన్నట్లున్నది.

"ప్రాణములపై నాశలేదని చెప్పలేను. కాని యీ కార్యమును సాధింపవలయునను పట్టుదలయు నున్నది. అందుకే కార్యమును సాధించి బ్రతికి బయట బడినచో మిమ్ములను మరల చూతును. లేకున్నచో మరణింతునని తంజావూరికి వార్త పంపినాను. ఈపనిని సాధించువఱకును మేము వదలుట లేదు. ఈ ప్రయత్నమున మరణించినను విచారము లేదు.

---

౧౨

ఈ మాటతో కుమారకృష్ణప్ప శరీరమందంతయు విద్యుత్సంచార మైనట్టులుండెను. అతడొక నిమేషము శూన్యము వైపు చూచుచుండెను. దూరమున నీ నీలాకాశము-క్రొత్తగా సానఁబట్టిన కత్తివలె తళతళ లాడుచున్నది. అప్పుడప్పు డా యాకసమున మబ్బు తెరలు మూసికొనుచుండెను. క్షణములో నవి కేతకీధూళివలె నాక్రమించును. మఱుని మేషముననే జన్మాంతర స్మృతులవలె మాయమగుచుండెను. బయట హోరుమని గాలి. ఆ వాయుతత్వ మట్లే యనాదికాలము నుండి యఱచుచున్నది. ఆ యఱపునకర్థ మొనర్చికొన బ్రయత్నించిన వాఁడే లేఁడు. మానవుఁడు ప్రకృతిలోని దేనిని పూర్తిగా నర్థము చేసికొన్నాడు గనుక! ఆ గాలు లా మేఘములను, దిక్కులను జెదరగొట్టుచున్నవి. మరల మరికొన్ని మబ్బులు. జీవితముగూడ నింతే ననుకొన్నాడు కుమారకృష్ణప్ప. మబ్బులు వచ్చును. పోవును. వినీలాకాశ మొక్కటి మాత్రమే నిర్వికారముగ నిలుచును. సుఖదుఃఖము లామబ్బుల వంటివే. వాని వెనకల నే వికారములకు లోబడని దాత్మ స్వరూపము. ఆ యాత్మస్వరూపము ఒక్కొక్కరిలో నతి ప్రకటముగ భాసించును. అతఁడు వెంటనే యజ్ఞనారాయణ దీక్షితులవైపు జూచెను. ఆతనిమూర్తి కుమారకృష్ణప్ప భావ

సోత్రిస్సున కష్టతరాలెను. ఈ జీవలక్షణ మేమి? తన దేశము నకై, తన రాజవంశమునకై, మిత్రుని యభ్యుదయమునకై ఆ నిర్భాగ్యదంపతుల జీవరక్షణమునకై తన ప్రాణములనే బలియిచ్చుటకు పూనుకొన్నాడు. ఈ ప్రవృత్తికి మూలము? యశస్సా? దానికెంతవఱకు వెల? ఒక దేహి మరణించిన తరువాత తనకీర్తిని తాను విననా ఏమి? లోకులనుకొందురు. ఎంతగా ననుకొందురు? ఎపుడో ప్రసక్తి వచ్చినపుడు క్షణ కాలమనుకొందురు. ఆ క్షణకాలమునకై తాను వినని యొక క్షణకాలపు పొగడ్తకై మానవుడింత త్యాగ మొనర్చునా! అది గానేరదు. ఒక్కొక్క జీవి మహాప్రవృత్తి యట్టిదయి యుండును. దానిని సంస్కారమందుము. ఇట్టివారిని చూచి నపుడే మనకొక వెల యున్నదనిపించును. దీక్షితులవంటి స్వామిభక్తి నిష్ఠులు పదిమంది యున్నచో మరింకేమి కొఱత? పడిపోయిన విజయనగర సామ్రాజ్యమును పునః ప్రతిష్ఠింప వచ్చును. ఇతనిని గన్న రాష్ట్రమెంత ధన్యము, ఈతఁడు తన తలిదండ్రులకొక మహా తపఃఫలము,

వారు కూర్చున్నది పైని యుప్పరిగె. దూరమునుండి సముద్రపు గాలులు చల్లగా తెరలు తెరలై వీచుచుండెను. ఆ మధ్యాహ్నపు టెండలలో గూడ మహాసముద్రపు టాసార శీతలిత మారుతములు తనువు సోకినప్పుడు ఆ సుఖమైంద్రియిక

మైనను ఇంద్రియాతీత మైనటులుండెను. కొన్ని సుఖము లట్లుండును. అవి సామాన్యము లయినను మహాసుఖము లని పించును. దూరమున నాకసముతో గలిసిపోయిన సముద్రము వైపు దీక్షితులు రెప్పవేయక జూచెను. ఆ చూచినప్పు డా తని మూర్తి యేమో వింతగా మారిపోయినది. అతఁడు మహా నాయకుఁడే గాదు. భరతాచార్యుఁడుకూడ. అతని మన స్సులో నేకీభావములు: సంగీతములో స్వరకల్పనమువలె, నాట్యమున ముద్రాభేదములవలె వేగముగ దిరిగినవి. ఆ సముద్రగాంభీర్య మాతని ముఖమందు, శరీరమందు; అతడు హఠాతుగ యువరాజుతో నిటనెను.

"కుమారా! నేనాడిన మాటలు ప్రొద్దుపుచ్చుటకన్నవి గావు నా ప్రతివాక్కును హృదయాంతరాళమునుండి రసనా ముఖమున వెలువడినది. నాకు ప్రాణములపై నాశ లేదని కాదు. ఐహిక మనిత్యమని యెంత తెలిసినను జీవింపవలెనను నాశ మానవులకు సహజము, తక్కిన పదార్థములకు జీవనమే ధ్యేయము. కాని మానవుడు తన బ్రతుకును మరియొక దానిని సాధించుటకు వెచ్చించును. వాడు వివేకి. నేటి నా మహా దర్శ మా యభాగ్యజీవులను విడిపించుట యనుకొన్నాను. ఆ యాదర్శమునకై నేను మరణించినను నా కానందమున్నది. ఆ యాదర్శము సాధించితినా యిక నా యానందమునకు మేర

లేదు. ఈ ప్రయత్నమున నేను మరణించినచో వాజపేయమున హోమద్రవ్యమైన దాని యంతటి సార్థక్యము నాకు గలుగును."

"స్వామీ! మిమ్ములను నేనెట్లు పొగడవలెనో నాకు తెలియుట లేదు. కాని మీవంటి మిత్రులు మాకు దొరుకుట మా భాగ్యవిశేషము. నా మనస్సులో పుట్టిచ సాత్త్వికములైన యూహాలు- ఎట్లు మలచికొనవలెనని నేను బాధపడుచున్నపుడు నా పాలికొక దేవుడుగ మీరు దొరికినారు. ఆ దంపతులకు బలియొసగు దినము సమీపించుచున్నది. ఆ దృశ్యమును నేను చూడలేను. అడ్డగింపలేను. ఈ రెండు భావముల నడుమ ఘోరమయిన యాతన ననుభవించుచుంటిని. పగలు చిత్తశాంతి లేదు: రాత్రి కంటికి కునుకు రాదు. వారు కారణముగ జింజి తంజావూరుల నడుమ కలుగబోవుచున్న యుద్ధమును భావించినచో నా యెద దడ దడ లాడును. కాని నే నొక్కడ నేమి చేయగలను. నాకు భావమున్నది. హృదయస్థైర్యము లేదు. ఆశ యున్నది. అనుష్ఠాన కుశలత లేదు. ఈ నాటికి మీరు చిక్కినారు. ఇక కార్యము సాధింపవచ్చునను ధైర్యము గలుగుచున్నది. మిమ్ము జూచినప్పుడు నాకు చిచ్చుఱ కన్ను మూసికొన్న ఫాలాక్షుఁడే యగుపించుచున్నాఁడు.

"యువరాజా! నీమాటలు నాచెవుల కమృతసేచన మొనర్చుచున్నవి. నాయూహలు సాధించికొనుటకు సాయము నకై యాకలిగొని తిరిగితిని. నీవు దొరికితివి. ఇక నా దంపతులు రసాతలమున నున్నను విడిపింతును. నీవు నా ప్రాణము నకు ప్రాణము. నా యాశ కనుష్ఠానము. ఈ పవిత్రయజ్ఞము నకు యజమానుఁడవు."

పరస్పర గౌరవములతో, అభిమానములతో గొన్ని నిమేషములు గడచినవి. కుమార సోలగుఁ డన్నాఁడు.

"దీక్షితులుగారూ! నాకొక విషయము తలచికొన్నచో నింకను నాశ్చర్యముగనే యున్నది. ఈ హత్యాకాండ నాకిష్టము లేదని మీ రెట్లు తెలిసికొంటిరి?"

దీక్షితులు తిన్నగా నవ్వెను.

"దీనిలో రహస్యమేమియు లేదు. మీ తల్లిగారికి సోలగని దుశ్చేష్టలు సరిపోవుట లేదని వినియుంటిని. ఆమె కతనిపై తిరస్కారబుద్ధి యుండుటయు నే నెఱుఁగుదును. మీకు తండ్రి దగ్గఱకంటెను తల్లిదగ్గఱనే చనవెక్కువ యనుటయు ప్రసిద్ధమే. అందుచే నామె భావములు మీ హృదయముపై బ్రతిఫలించియుండుననియు నూహించితిని. మానవత్వమే లేశమున్నను మీ తండ్రిగారి దుష్కృత్యముల నెవ్వరును సహింపరు. మీకును జింజి కృష్ణప్పకును నడుమ జరిగిన సంభాషణములు నాకు తెలిసినవి. ఫిమెంటోగారితో మీ రాడిన వాక్య

ములు విని యున్నాను. ఇవన్నియును మీరు సాత్వికులన్న భావమునకు బలము నిచ్చినవి. మీ మైత్రి సంపాదించికొనవలయునని యాశించితిని. ఆ మైత్రికొఱకే సాహస మొనర్చి యిచ్చటికి వచ్చితిని.”

“జింజిలో మేమాడిన మాటలు మీ కెట్లు తెలిసెను?”

“యువరాజా! యిది మా వృత్తికి సంబంధించిన ప్రశ్న. కాని ఒక విషయము మాత్రము స్పష్టముగ చెప్పఁగలను. జింజిలోగూడ మా గూఢచారు లనేకులున్నారు. మాకు గావలసిన రహస్యములను మేము వారినుండి రాబట్టుకొందుము.”

కుమారసోలగుని కన్ను లాశ్చర్యమును వెలిబుచ్చినవి. అతని యందము స్త్రీవంటిది. ఆ కన్నులలో ప్రతిభావమును రమణీయముగనే యుండును. ‘ఇక్కడ మాత్రమాతని గూఢచారు లెందుకుండకూడదు?’ ఇది వెంటనే యాతని హృదయమున భాసించిన ప్రశ్న. కాని యీమాట నాతఁడడుగ లేకపోయినాఁడు.

“మీ చాకచక్యమును జూచినచో మన కార్యమును సులభముగనే యీడేర్చుకొనవచ్చునన్న విశ్వాసము గలుగుచున్నది”

“పురుష ప్రయత్నము మనది. దానిపై దైవేచ్ఛ.”

కొంచెముసేపు వారిర్వురును మౌనముగ నుండిరి. దానిని తొలుత భంగ మొనర్చినవాఁడు దీక్షితులే.

"కుమారా! యీవిషయమున మాకొకప్రశ్న యింకను మిగిలియే యున్నది. మీరు సోలగుని కుమారులయియుండియు నీ కార్యమున తండ్రికి విరుద్ధముగ మాకేల తోడ్పడుచున్నారో తెలియదు. ఈ వృత్తాంతము మీతండ్రికి దెలిసినచో మీకు చాల కీడౌ ననుకొందును."

"నేను నాతండ్రి నెందుకు ద్వేషించుచున్నదియు ఒక పెద్ద కథ. అతని చేష్టలు మాతల్లికి బొత్తిగా పడవు. ఆమె వలెనే నాకును; మా తల్లి తన భావములను నాయందంతగా నావహింపఁ జేసినది. ఒక్కొక్కసారి నాలో నేనే 'యతఁడు నాతండ్రి గదా! నేనతని నింతగా ద్వేషింపవచ్చునా?' యని మథనపడెదను. కాని యీభావమెంతసేపో నిలువదు. అతఁడు నిలువనివ్వఁడు. మా తల్లి నిరంతర మేడ్చుచున్నటు లుండును. ఆమె జీవితమున నేదో రహస్యమున్నదని నా యూహ. ఆమె యీ దుష్కృత్యములు మానుమని యతని కెన్నిసారులో చెప్పినది. ఈ పాపములే మిమ్ము జంపునని యామె పలుమారు లనుచుండును. అతఁడు వినఁడు. మాతల్లి మాటలు నిజముగునా? యనిపించుచున్నది."

"మీతల్లి యాతని ధర్మపత్ని గదా! మరి యామె సోలగుని ద్వేషించు టెందులకు?"

'నిజమునకు వారిద్దరును భార్యాభర్తలే. కాని యామె తని పాపకృత్యముల కామె యెన్నఁడును సహకరింపలేదు. వారిద్దరిలోఁ బరస్పరము ప్రీతివిశ్వాసములు లేవు మా తండ్రిపై మాతల్లి కొక తిరస్కారదృష్టి, ద్వేషమున్నను తప్పు లేదు. ఆమె కింత ద్వేషమేలనో నాకుఁ దెలియదు. నా దృష్టిలో నదియు నొక సమస్యయే. ఈవిషయమై నేనామెను రెండుమూఁడుసారులు ప్రశ్నించితిని. కాని యామె బదులు పలుకదు. నా ప్రశ్నతో నామె హృదయమునకు దెబ్బ తగిలిన భావము ముఖముపై స్పష్టముగ భాసించును. అందుకై నే నామెను మరల నీ విషయమై ప్రశ్నింపలేదు."

"మీతండ్రితో నామె యెక్కువ కష్టపడియుండును. నీవన్నట్టు లామె జీవితమున నేదో రహస్య మున్నది. ఆ చిచ్చు నామె యొడిలోఁ గట్టుకొన్నది. లేకున్నచో పతియొక్క నాశమును సతి వాంఛించుట యసాధ్యమైన విషయము."

"నాకీ యనుమానము ప్రబలముగ నున్నది. ఆ రహస్యమును దెలిసికొనవలెనను నాకాంక్షయు గద్దు. కాని యామె మఱచియైనను తన రహస్యమును బైటబెట్టినది లేదు. నాకు మా తండ్రిపై గౌరవము లేదనుట మిక్కిలి స్పష్టమే. అతని పాపకృత్యములు నేను సహింపలేను. అతఁడు నా కన్నుల యెదుటనే యెందరో నిర్భాగ్య వధువులను గోడాడించెను.

అనేక స్త్రీల నాతఁడు చెఱచెనని మాయమ్మ చెప్పుచుండును. అతఁడొనర్చిన శిశుహత్యలు నేను చూచినవే కొన్ని పదులు గలవు. ఎందరో నిరపరాధుల నతఁడు బైరేని కొలనులోని మొసళ్ళ కాహారముగ వేసినాఁడు. వీనిని చూచినప్పుడు నా మనస్సు శూలములతో పొడువబడినట్లు బాధపడును. కాని నేనేమి చేయగలను? ఎదిరించు ధైర్యము లేదు. అదే నా దౌర్భాగ్యము.”

“అతనిని చూచినచో మీ కెక్కువ భయమన్న మాట.”

“నిజమే. ఆతని ప్రీతిగూడ భయంకరమైనదే. నాపై నాతనికి కోపము లేకపోలేదు. అతనివలె నేను దయారుగా లేదని యాతని బాధ. కాని కోపమునకంటెను నాయందలి ప్రీతియే యెక్కువ. నేనాతనికి వార్ధక్యమున బుట్టితిని. అతఁడా ప్రీతిని చూపించు పద్ధతిమాత్రము నాకు నచ్చదు. చితిపై జల్లబడిన పుష్పములవలె రమణీయమయ్యు భయంకరము.”

“ఎందుకు?”

“ఆతని ప్రవర్తనలో మానవత్వమునకన్నను దైత్యభావ మెక్కువ. మాటలు కొట్టవచ్చినట్టులుండును. ఆతని కన్నులు జూచిననే నాకు భయమగును. నిరంతర మధుపానములో వాని స్వభావమే రోషిమయైనది. అడఁడొక స్మశాన బైత్యము. ఇంత వయస్సైనను నాకాతని యెదుట పారాడుటకే

భయము. నా చిన్నతనమున నింకను నన్యాయముగ నుండెడిది. ఆతని చూచినచో భయపడి పరువెత్తుచుంటిని. నన్నాతఁడెత్తికొన్నచో నేడ్చువాఁడను. ఆతనికి కోపమువచ్చి నన్ను నేలకు వేసి కొట్టిపోవుచుండెను. మా తల్లి యోదార్చెడిది. అతని నవ్వుకూడ నాకు భయకారణమే. ఏదో యొక కాపాలికుఁడు నవ్వినట్లుండును. ఆతనితో నేనింతవఱకు పట్టుమని పది మాటలు పల్కినది లేదు.

దీక్షితుని కన్నులలో 'నయ్యోపాపమను' భావమున్నది.

"మీ కాతనిపై తీవ్రమైన ద్వేషమున్నది. అదే దీనికి కారణము."

"ఏమో! మీకును నాకును నింతకుముందు పరిచయమే లేదు కదా! కొలఁదికాలములోనే మన మెంతయో యాప్తులుగ మారిపోయినాము. ఫిమెంటోగారికిని నాకును నేమి సంబంధమున్నది? వారిని చూచినప్పుఁడెవరో యాప్తబంధువులను చూచినట్లుండెను. జింజి కృష్ణప్పగారిపై నాకెంతయో గౌరవము. కాని యీ తండ్రిమాత్రము నా పాలికి యముడుగ గోచరించును. ఈభావము నాకెందుకు గలిగెనో యర్థమగుట లేదు. యోచించుకొలఁదియు జటిలముగ తయారగుచున్నది. అతనిపై ద్వేషము నా రక్తగతమైనది."

"కుమారా! నీ విదంతయు తలఁచికొని దుఃఖింపకూడదు. కష్టసుఖములు మనము పండించిన పఁటయే. ఆ భగ

వంతుఁడొసగిన దానిని మనము తృప్తిగ ననుభవింపవలెను. కాని దీని యనుష్ఠానము మాటలంత సులభము గాదు. మన జీవితమున నెవ్వరికిని బాధ గలిగింపక మరణించుట గొప్ప తపస్సు. ఉపకారము చేయకున్నను అపకారమైనను చేయకుండుట మంచిది. మీతండ్రి జాడ ననుసరింపక యుండుటయే నీ మనస్సు సాత్త్వికమైనదనుటకు గుర్తు. ఈమార్గముననే నీవు ప్రయాణించితివేని నీజీవితమునకే గాక లోకమునకు కళ్యాణమగును. ఈ మహాకార్యమున మావంటి యల్పసేవకులేమైన చేయదగిన సేవయున్నచో తప్పక చేసెదము.

"దీక్షితులుగారూ! నా కోరికయుగూడ నదే. మా తండ్రి పాపములు అతని పీడు జన్మముల దుఃఖమునకు చాలినవి గావు అతని నా కార్యములనుండి తొలగించుట సాధ్యము గాదు, ఇంతకు నెవరి కర్మఫలము వారిది. చెరలో ఆ దంపతులు అన్నపానములు లేక నవయుచున్నారు. వారిరువురిని తప్పించుటయే మనకిపుడు ముఖ్యము."

"కుమారా! నే నందుకే యింతదూరము వచ్చితిని."

బయట నేదో శబ్దమైనటులయ్యెను. కుమారకృష్ణప్ప బయటికి వచ్చినాడు. లోన భైరవనాయకుఁడు ప్రవేశించి యుండెను. వాఁడు సోలగుని మంత్రి. మంత్రి యనుటకు వానికున్న యోగ్యత యొక్కటే సోలగుని ప్రతి దుష్కార్యమునకును వాఁడు సహకరించును. భైరవోపాసనయు వీని

వలననే సోలగునకు ప్రాప్తించె నందురు. వాఁడే భైరవుని పూజారిగూడ. కుమార కృష్ణప్ప యెవరితోడనో రహస్యముగ చాలసేపు సంభాషించుచున్నాడను వార్త వానికిఁ దెలిసినది. వాని మనస్సులో కుతూహలము, సంశయము. ఈ క్రొత్తగా వచ్చిన వ్య[illegible] యెవ్వరు? వీఁడెవ్వఁడైన గూఢచారియా ఏమి? భైరవునకు కుమారసోలగుని సాత్వికత దెలియును. వానికిఁ దనపై నంత యాదరము లేదనియుఁ దెలియును. వాని నెటులయినను తన పంజాలోనికి దీసికొనవలెనని భైరవుని చింత, మహారాణిపై గూడ నాతని కనుమానమే, కాని యామె రాజనీతి వానితలకు మించినది, భైరవ నాయకుఁడా యాగంతుకుని జూడ నెంచెను. కుమారసోలగుఁడు భైరవనాయకునితో ననెను. "తాము లోనికి దయచేయవలెను. తాము వచ్చిన విషయమును చాకలు తెలుపనే లేదు. నాకొఱకు మీరు చాలసేపు గాచికొన్నట్లున్నది. ఒక్కమాట చెప్పి పంపినచో వచ్చియుండెడి వాఁడను."

"మీ రేకాంతములో నెవ్వరితోడనో మాటలాడుచున్నారని వింటిని. మీకు విఘ్న మొనర్చుట కిష్టము లేదయ్యెను."

"మీరు వచ్చినచో విఘ్న మేమున్నది?"

యువరాజు భైరవనాయకుని లోనికి గొనివచ్చెను. అక్కడ

గలిగెను. ప్రభువులు నాకొక వసతిగృహముకూడ నేర్పాటు చేసియిచ్చినారు."

"మంచిది. మఱల నింకొకసారి చూతము."

భైరవుఁడు యువరాజు ముఖముపై చూపులు నిల్పెను. ఏదో రహస్యముగ మాటాడవలయునని యా చూపులకర్థము. ఈ భావమును గ్రహించిన పెరుమాళ్ళ శెట్టి అక్కడినుండి లేచి యంతఃపురములోని శిల్పములను కుడ్యచిత్రములను జూచుటకు బయలుదేరెను.

పెరుమాళ్ళశెట్టి కనుచూపుమేర దాటువరకును భైరవుఁడేమియు పలుకలేదు. అటుతరువాత నిట్లన్నాడు.

"కుమారా! నీవు రాజపుత్రుఁడవు. కొన్ని సంవత్సరముల తర్వాత ఈ సింహాసనమున కుత్తరాధికారివి. నీవీ విషయమును మఱచినట్లున్నావు.

ఆతని కన్నులు తీక్ష్ణతను గుప్పించినవి. ఆ తీక్ష్ణత భైరవుని వాహనములయిన కుక్కురములు కుపితములైనటులున్నది.

"ఏమి? నేనేమి చేసితిని?"

"ఇంకేమి చేయవలెను? యువరాజువయి యుండియు యిట్టి యల్పులతో సహవాసము చేయవచ్చునా? నీ యాభిజాత్యమేమి? వాని గౌరవమేమి? నీవొక మహారాజు పుత్రుండవు. వాఁడొక జాతిభ్రష్టుడు. మీరిద్వురకును మైత్రి యెట్లు

య్యెనో నే నూహింపలేకున్నాను. వీనితో నీ కింత సేపేమి రహస్యము లున్నవి?" భైరవనాయకుఁడు మొగము చిట్లించి నాఁడు ఫాలముపై నున్న కుంకుమపు సిరములు భూమిపై రాలినవి వాని కోపమే యాకారముగా రాలుచున్నట్లు.

'ఏదో పొద్దుపోని మాటలు. అంతలోనే మీరుగూఁ వచ్చితిరి

'అంతేనా!"

"అంతగాక మరేమున్నది?"

"వాని మొగము చూచినచో క్రైస్తవుఁడని నమ్ముటకు వీలులేదు. హిందువుయొక్క లక్షణములే కానబడుచున్నవి. ఉత్తమ జాతికి చెందిన వాఁడుగ గానబడుచున్నాఁడు. వాఁడెవ్వఁడో గూఢచారి యని నా యనుమానము. ఈ విషయమును తేల్చికొనుటకే వచ్చితిని. ఇప్పుడు మన రాజ్యము చుట్టును శత్రువులెక్కువమై పోయినారు. మన వైభవములను చూచి చాల మంది కసూయమై పోయినది. కయ్యమునకు కాలు దువ్వుటకై కాచుకొనియున్నారు. భైరవోత్సవము నొక సాకుగా తీసికొని యీ నగరములో నెందరో గూఢచారులు చేరియుండవచ్చును. వీఁడు వారిలో నొక్కఁడని నా యనుమానము."

"మీ యనుమానమున కేమియు నాస్పదము లేదు. ఈ వచ్చినవాఁడు క్రైస్తవుఁడే 'ఫాదర్ ఫిమెంటో' గారి

దుబాసీ. ఈవిషయము నాకు స్పష్టముగ తెలియును."

"కావచ్చును. కాని వానిపై మాత్రము కన్నిడియుంచుట మంచిది. వానిని మీరంత దగ్గరగా చేర్చికొనరాదు. ఏమైన నపాయము సంభవింపవచ్చును. ఈ సమయములో మనము విదేశీయుల కెంత దూరములో నున్న నంత మంచిది."

మంత్రి లేచెను. బయటికి పోవుచు నీ మాటలన్నాడు.

"యువరాజా! రాజ్యమును దృష్టిలో పెట్టుకొని మీ హితమునకై యాడిన మాటలివి. వీనిని మీరన్యథా భావింపరాదు. నేనిపుడొక ముఖ్యమైన పనిపై వచ్చితిని. ప్రభువుల కిప్పుడు స్వస్థత లేదనుట మీరెరిఁగినదే. అందుచే భైరవోత్సవములోని పనులన్నియు వారు నిర్వహించికొనలేకపోవుచున్నారు. ఇక మీరు: మీకేదియు కాబట్టుట లేదు. నిర్లిప్తులుగ నున్నారు. ఈసార యుత్సవములు వైభవోపేతముగ జరుగునట్లు లేదు. ఇకమీదనయినను మీరు కొంచె మీ పనులలో భాగము వహింపవలెను."

"అట్లే కానిండు."

మంత్రిమాటలతో కృష్ణప్ప హృదయ మప్రసన్నమైనది. కాని యా భావము నతఁడు గన్పింపనీయలేదు.

"ప్రభువులే తమ కీ మాటలు చెప్పుమని నన్నంపినారు. ఈసారి మీరే భైరవపూజ యొనర్పవలయునట."

కుమారుఁ డదరిపడెను.

"అనగా?"

"మీరే యీసారి దీక్షవహింపవలయునని ప్రభువుల యిచ్ఛ. మూడుదినము లుపవాసముండి భైరవు నుపాసింప వలయునట. పూర్ణబలి మీచేతిపైననే సాగవలెనని ప్రభువుల వారియాజ్ఞయైనది. పూర్ణిమ యిక నాల్గుదినములుమాత్రమే యున్నది. మీరిక యీకార్యమునకు సిద్ధపడవలెను."

"పూర్ణబలి యొసగుటకు నాకలవాటు లేదు. దానిని మరెవ్వరిచేత నయినను చేయింపుడు. భైరవపూజమాత్రము నేను చేసెదను."

"మీ రామాట యనుటకు వీలులేదు. భైరవుడు మన యింటిదైవము."

"ఈరక్తబలికి నేనలవాటు పడలేదు."

"ఒకసారి చేసినచో నదే యలవాటగును. మీరే పూర్ణాహుతి యొసగవలయునని ప్రభువులవారి యాజ్ఞయై నది. దానిని తిరస్కరించుటకు వీలులేదు."

"ప్రభువుల యాజ్ఞను నేను మన్నింతును. కాని నా యసమ్మతిని ప్రభువులకు మీరు మృదువుగా తెలుపవలెను."

"నే నాపని చేయలేను."

"నాకిష్టములేని పనికై నన్ను నిర్బంధించుట న్యాయము గాదు."

"ఇది మీ యంతిమ తీర్మానమా యేమి?"

"మీరు పెద్దలు. అట్లనరాదు. నా మనోనుకూల్య మును తమకు నివేదించుకొనుచున్నాను."

"ఈవిషయమును ప్రభువునకుఁ దెల్పుదునా?"

"దయచేసి యీపని తమరు సేయవలయును. సాత్త్విక ముగ భైరవదేవు నుపాసించుటయే నా కిష్టమైనదని ...."

"మీరు నాకన్నులయెదుట పుట్టితిరి. మావంటివారికి బుద్ధి చెప్పుటకు మీరు ప్రయత్నింప రాదు. మీరీపని కొప్పు కొనకున్నచో ప్రభువుల యాజ్ఞను తిరస్కరించినట్లగును"

మంత్రి కన్నులలో భైరవోపాసనలోని క్రౌర్యమంతయు గూడుకట్టుకొన్నటులుండెను.

"నా యభిప్రాయము మీకు ముందే తెల్పికొన్నాను."

"ఇది మీ క్షేమమునకు గాదు. భైరవుని తిరస్కరించిన వంశము బాగుపడదు."

"నేను దైవమును తిరస్కరింపలేదు. రక్తబలి నాచేత గాదన్నాను."

"మరల నొకసారి యోచింపుడు."

భైరవనాయకుఁ డుత్తరమునకైనను నాగక వెడలి పోయెను.

కుమార సోలగుని మనస్సున చేయివెట్టి కలచినట్లైనది. భైరవనాయకుని భయంకరాకారము మాటిమాటికిని దన కన్నుల యెదుట నిల్చుండెను. అతని కన్నులు సూదుల వంటివి; ఫాలముపై విభూతి; నడుమ రక్తముతోఁ బెట్టికొన్న బొట్టు; అతడు నవ్వినపుడంతయు ప్రక్క పండ్లు కోఱలవలె వెళ్ళబొడుచుకొనెడివి. వాని నవ్వనగా భైరవ భయంకరాట్టహాసమే! ఎదుటివారు దుఃఖపడుచున్నపుడు చూచి సంతసించు వికృత స్వభావము వానిది. కుమార సోలగుని సౌధమునుండి వెళ్ళిపోవుచు వాడు భయంకరముగా నవ్వి పోయెను. ఆ నవ్వనగా యువరాజు ప్రాణములకెసరు పెట్టుటయని యర్థము; యువరాజు వెంటనే తల్లి దగ్గరకుఁ బరువెత్తెను. తన దుఃఖములన్నియు నామెతోఁ జెప్పికొనువఱకు వానికి నెమ్మదియుండదు. అతడామె యెదుటఁబడి యొకటే యేడుపు. గౌరాంబ యప్పుడే శ్రీరంగనాథుని పూజ ముగించి వచ్చుచుండెను. ఆమె కన్నులావఱకే చిత్తడిగ నున్నవి. కుమారుని ముఖము చూచి యామె గుండె నీరైనది. బలవంతముగ నామె కన్నీటి నాపికొన్నది. ఆమె శ్రీరంగనాథుని యెదుట తప్ప

బహుమాల భగవంతునికి నిర్దిష్టమై యుండెను. దానిని బలవంతముగ సోలగుండు మెడలో వేసికొన్నాఁడు. ఈమాల వానిని ప్రాణమై కరువవలెను. ఈభావము మనస్సున మెదలినప్పుడామె వికారముగ నవ్వుచు. ఆనగవు భయంకరముగ నుండును. ఒక్కొక్కసారి యానవ్వునకు సోలగుండే భయపడుచుండెను. ఈభావము దృఢపడినప్పటినుండి యామె సోలంగున కడ్డు చెప్పలేదు.

తన శరీరము నామె వాని కర్పించినది. మనస్సు ప్రతీకారచింతపై కేంద్రీకరించినది. ఆమె సంసార ఫలముగ కుమారకృష్ణప్ప జన్మించెను. ఆమె యానందముగ వానిని 'కృష్ణా' యని పిలుచుచుండెడిది. సోలగునిపైకి కుమారునితోనే కత్తి గట్టింపవలయునని యామె వింతకోరిక;

కుమార కృష్ణప్ప నామె తన యొడిలోనికి దీసికొని తదేకముగ వాని కన్నులలోనికిఁ జూచెను. ఆచూపులలో వాని దుఃఖము నిమ్మళించి నటులైనది. అతఁడామెతో నిట్లనెను.

"అమ్మా! ఈజీవనము నాకు రాగరాగ దుర్భరమై పోవుచున్నది. సోలగుని చూచినచో నొక్కయూఁకున కత్తితో తెగ నరకుదమన్నంత కోపమువచ్చును. కాని యతఁడు నాకు తండ్రియైపోయినాఁడు. ఈ భైరవనాయకుఁడు మన యింటికొక పుండువలె దాపురించినాఁడు. వీనిని నాశము చేయనిది మనకు శాంతి చిక్కదు. కాని యది సాధ్యమగునట్లు లేదు.

ఈ స్థితిలో నేను మరణించుటే యుక్తమని తోచుచున్నది. ఈసారి పూర్ణాహుతి నాచేతిమీదుగ నడువవలెనని యతడను చున్నాఁడు.

కుమారుని మాటల కామె మనస్సున నమృతము జిలికినట్లైనది. అంత వాఁడింతవాఁడై యీమాట లనుటకే యామె యింతవరకు బ్రదికినది. ఆ భైరవనాయకుని నఱికి వాని శరీరమును గ్రద్దలకు వేయవలెనన్నంత కోప మామెకు. కేవలము వధించుటయే యైనచో వాని నీవఱకామె యెన్నఁడో మట్టుపెట్టియుండెడిది. కాని వానిని భయంకరముగఁ జంపవలెను. కుమారకృష్ణప్పకు సోలఁగునిపై తండ్రియను భావముండుట ఆమెకు దురంత వేదనకుఁ గారణమైనది. సోలగుడా! వాఁడు దన స్త్రీత్వమును నాశ మొనర్చిన రాక్షసుఁడు. తన భర్తను మట్టుపెట్టిన హంతకుఁడు. తన్ను రంగనాథునకు గానివ్వక దాచికొన్న దుర్మార్గుఁడు. వాని వీర్యమున జన్మించిన వానితోనే వానిని భయంకరముగ జంపింపవలెను. ఆ దృశ్యమును దాను కన్నులార జూడవలెను. తరువాత తాను మరణింపవలెను.

గౌరాంబ కుమారుని చెక్కుఁగీటినది. ఆమెది విచిత్రమైన ప్రకృతి. ఆమెకు పట్టరానంత దుఃఖము వచ్చినపు డామె

దానిని ప్రేమగ వ్యక్తపరచును. గౌరాంబ కుమారునితో ననెను.

శిశూ! నీవింకను నా గర్భమున బడలేదు. సోలఁగుని ప్రవర్తన మప్పుడు జూడవలసియుండెను. ఇప్పుడేమున్నది? ఆ నాళ్ళలో దినమునకొక పది రుద్రనాటకములు జరిగెడివి. వాని కీ భైరవనాయకుఁడు తాళము వేసెడివాడు. దన్ను సోలగుఁడు గట్టికొన్నప్పుడు ఆతనికి నిఁడుప్రాయము. అంద గాడు గాకున్నను యౌవన మాతనికొక యందమొసగినది. బలము, యౌవనము, అధికారము, ధనము: ఇంకేమిఁగావలెను? ఆమదములో నాతఁడు నా కన్నులయెదుటనే కనీసము దినమునకొక మానభంగమైనను చేసెను. వాని నన్నిటిని రాయివలె జూచుచు ముప్పదియేండ్లు బ్రదికితివి. గడచిన యా యొక్కొక్క దినముపై నొక్కొక్క భయంకర గ్రంథమును వ్రాయవచ్చును. ఇపు డా జీవితమును నీ కన్నీటితో జ్ఞప్తికి దేకుము. జింజినుండి యిచ్చటికి యజ్ఞనారాయణ దీక్షితులు వచ్చినది నిజమేనా? అతఁడు నీతో మాటాడె ననియు దెలిసినది.”

“ఔనౌను. ఆసంగతి నీకెట్లు దెలిసెను?”

ఆమె కన్నీటితోనే నవ్వినది. అమాయకుఁడయిన కుమారు నామె కౌగిలించుకొనెను.

"ఓయీ! నేనెవ్వరనుకొన్నావు? నే నీయంతఃపురమున క్షణమున కొక వేయి కన్నులతో బ్రతుకుచున్నాను. నాకు సోలగునిపై పగ తీర్చుకొనుటయే జీవనమైపోయినది. జింజిలో నాకును గూఢచారులున్నారు. తంజావూరిలో గూడ లేకపోలేదు. వెంకటపతి దేవరాయలు జింజి కృష్ణప్పకు నిరుపమం పిన విషయము నాకు తెలియును. నీవు ఫిమెంటోతో మాటాడిన విషయములుగూడ నాకు వార్తలు వచ్చినవి."

తల్లి వైపల్లే యాతఁడు క్షణకాలము విభ్రాంతునివలె చూచెను. ఆమె స్వరూపము కుమార సోలఁగున కర్థమగుటయే లేదు. ఆమె యాతనిని చిన్ననాటినుండియు పరమ సాత్వికునిగ బెంచినది. కాని రాజకీయపు మలుపులు తెలుప లేదు. సోలఁగుని దుష్కృత్యములు చూచి యామెకు రాచరికముపైననే యసహ్యము పుట్టినట్లున్నది. ఆమె కుమారుని వైపుజూచి యిట్లు పలికెను.

"నీ వీసారి దీక్షగైకొనుట కంగీకరింపుము. దానిని మన కార్యము సాధించికొనుట కొక మార్గముగ వినియోగించి కొందము. నారాయణదీక్షితులుగూడ మనకు సహాయముగ నుండును. ముందా దంపతులను మనము తప్పింపవలెను. తరువాత నిక్కడి కథలు చూతము. భైరవనాయకుఁడు మొదలైనవారి పని తరువాత. దంపతులను విడిపించు కార్యమును

మనము చాల జాగరూకతతో నిర్వహింపవలెను. నీవు ధైర్యము చెడినచో మన పని చెడిపోవును."

"నన్నేమి చేయుమందువు?"

"పూర్ణాహుతి నిచ్చుటకు సమ్మతింపుము. అట్లయినచో నీ వా భైరవాలయమునందే మూడుదినములు గడపవలయునని నియమముండును. ఆ యవకాశము వినియోగించికొని మన మా దంపతులను విడిపింపవచ్చును."

"అదెట్లు సాధ్యము?"

" ...యము నాకు వదలిపెట్టుము. మొదట సోలంగని వద్దకేగి వినయమును ప్రదర్శించి పూర్ణాహుతి కంగీకరించినట్లు తెలిపిరమ్ము. యజ్ఞనారాయణ దీక్షితులను మన యంతఃపురమునకు దీసికొని రమ్ము. ఈపని చాల జాగ్రత్తగ నెరవేర్పవలయును. అంతఃపురమునకు వెనుకనున్న యుద్యానములో ఉత్తరపు మూలకు ఒక మామిడి చెట్టున్నది. ఆవైపునకు సాధారణముగ నెవ్వరును రారు. నేనచట నీ రాత్రికి కాపలాగూడ బెట్టియుందును. నీవాతని నా చెట్టుదగ్గర చేర్పుము. ఇది చాల రహస్యముగ జరుగవలసినపని. భైరవ నాయకునకు దెలిసినచో మన కార్యమంతయు జెడిపోవును. వాని కిప్పటికే సందేహముగ నున్నది. చాల జాగ్రత్త సుమా!"

నుఖ నాటిరాత్రి కుమార సోలగుంను దీక్షితుల నా వనమున జేర్చెను. ఆన తల్లికీ వార్తను దెల్పినాడు. ఆమె కొక యాంతరంగికురాలయిన దాసి యున్నది. దాని వస్త్రము నామె ధరించెను ఇతర దాసీలకీ విషయము తెలియకుండునట్లు 'సరళ' జాగ్రత్త వహించినది. ఆదాసికి రాణిగారి దుఃఖములన్నియు దెలియును. గౌరాంబిక యుద్యానవనము లోనికి వచ్చెను. దీక్షితులామెను జూచినవెంటనే నమస్కరించెను.

"ఈవిషయమున తమ యుపకార మాజన్మాంతమును మరువలేను."

"ఆ దంపతులను విడిపించుటలో మీకేగాదు మాకును పట్టుదల కద్దు తంజావూరునకు జేరినవారని మీకు వారిపై నభిమానము. మాకున్నది జీవకారుణ్యము. అది యట్లుండనిండు. ఇప్పుడు మనమొక నిర్ధారణకు రావలెను ప్రతిక్షణమను నిప్పుడమూల్యమైనది."

"అవును తల్లీ! ఏమాత్రము తప్పటడుగు వేసినను ప్రాణాపాయము తప్పదు."

"అందుకే మిమ్ము బిలిపించినది. మన మెట్లీ కార్యమును సాధింపవలెను? మీకేమైన నుపాయము తోచినదా?"

"నాకేమియు నుపాయము తట్టలేదు. కాని మీ సహా

యమున్నచో నిది సులభముగ నెరవేరునని ధైర్యమున్నది ఈకోటదాటుటలో మీరు నాకు తోడ్పడవలెను.”

“ఇదే చాల చిక్కుసమస్య. కాని దైవము మనకు తోడ్పడును. ఈసారి నాకుమారుఁడే భైరవదీక్ష స్వీకరించుటకు సమ్మతించినాఁడు. అతఁడు మూఁడుదినము లా గుడియందే యుండును. ఆ దంపతులను దప్పించుట కది యొక పెద్ద యనుకూలము.”

“ఎట్లు”

“బలియిచ్చుటకు ముందురోజు వారిని చెఱనుండి విడుదల సేయుదురు. స్నానము చేయించి రక్తాంబరములను గట్టింతురు. రక్తమాల్యములను ధరింపఁ జేయుదురు. ఆ దంపతులా నాఁడు నిరాహారముగ నుండి శాస్త్రోక్తముగ భైరవుని పూజింపవలెను. మన మా రాత్రి అనఁగా బలియొసఁగఁబోవు నాటి తొలిరాత్రి యెట్లయినను తప్పింపవలెను.”

“భైరవాలయము చుట్టును సైనికులు గాపుందురు గదా! మఱునటిరోజు భైరవున కర్పింపఁబడు నా దంపతులను స్వయముగ భైరవనాయకుఁడే కాపలా గాయునని వినియుంటిని. వీరికంట దుమ్ముగొట్టి తప్పించుకొను టెట్లు?”

“భైరవాలయమునకు రక్షకులుగ సైనికులుండుట నిజమే. కాని వారు మధ్యరాత్రిలో ‘పహరా’ను మార్చుకొందురు. ఆ ‘పహరా’ను మార్చుకొనునప్పుడు భైరవనాయకుఁ

డొకసారి వెలికివచ్చి మరల గుడిలోని కేగును. తక్కినపుడు వాఁడు భైరవాలయమునుండి గడ్డకు రాడు? కుమారునితో శాస్త్రోక్తముగ బూజ చేయించుచుండును. ఆ యర్ధరాత్రిలో ఆనఁగా భైరవుఁడు వెలుపలి కేగినప్పుడు మనము వారిని తప్పింపవలెను."

"ఇది మంచి యుపాయము. కాని ఆ దంపతులను బంధించి యుందురు గదా! మరి వారి బంధవిమోచన మార్గము?"

"ఆదినము వారికి సంకెళ్ళు వేయరు. వారికివి శాస్త్రోక్తముగ దీక్ష నొసఁగుదురు. ఆ దంపతులవెంట గొందరు బ్రాహ్మణు లుందురు, వారితో మీ రెట్లైనను బ్రవేశము గల్పించికొనవలెను."

"అదెట్లు సాధ్యము?"

"మీ రా శ్రోత్రియులతో గలిసి గుడిలోపలికి వెళ్ళి పోవలెను. మీ పెరుమాళ్ళ శెట్టి వేషమును కొంచెము మార్చి కొనుఁడు. ఎట్లైనను గుడిలోనికి ప్రవేశించు భారముమీది. దీనికి నేనుగూడ నాసాధ్యమగు మార్గమున బ్రయత్నింతును."

"అట్లే కానిండు. కాని వారి నక్కడనుండి విడిపించి యెచ్చట దాచవలెను? ఈకోటనుండి వారిని తప్పించుటెట్లు?"

"ఆ ప్రయత్నమంతయు నేను చేయుదును. మీరు బ్రాహ్మణవేషముతో గుడిలోనికి బ్రవేశింపుడు. అటుతరు

నాక నొక పథక మల్లునము. మంగమ్మ గర్భిణిగదా! ఆమె తనకు ప్రసవవేదన యారంభమైనట్లు నటింపవలెను. బలి యిచ్చుటకు ముందు ప్రసవమైనచో నది యశుభము. పురుడులో నే పుణ్యకార్యములును చేయరాదుగదా! దీనితో భైరవనాయకునకు బిచ్చి యెత్తినట్లగును. ఆసమయమునకు గుడిలోనికి నేనొక దాసి నంపియుందును. దానిపేరు 'సరళ.' అది మంగమ్మను ప్రసవమును నిర్వహించుటకు అంతఃపురము నకు తీసికొని వచ్చుచున్న దానివలె నటించును. ఈ రగడలో ఆ దంపతుల నిద్దరను కుమార సోలయుడు ఆ భైరవకుడి యందే యొక మూలనున్న నేలమాళిగలోనికి చేర్చును. అక్కడినుండి బయటికి తప్పకొనుట కొక చిత్రమైన మార్గ మున్నది. దానిని తెరిపించు నేర్పాటు నేనే చేయుదును. కాని యీ వాకిలి సామాన్యమైనది గాదు. అందు మనుష్యులు ప్రవేశించుటకు వీలులేదు. దేవాలయము వెనుక బైరేని కొలను కలదు గదా! దానిలోని నీటితో నేలమాళిగను నింపుటకు ఆ ద్వారమేర్పరుపబడినది ఆనీటితోపాటు మొల్ల గూడ నా నేలమాళిగలోఁ బ్రవేశించును ఆద్వారమున నొక రిద్దరు మాత్రమే పట్టవచ్చును. దానిలో ప్రవేశించుట యు కష్టమే. వాకిలి తీసినవెంటనే నీరు వేగముగ నేలమాళిగలో నికి ప్రవేశించును. ఈద్వారమునుండి ఆ దంపతులను గడ్డకు వేయవలెను, ఆద్వారములోనుండి వారిని తప్పించు భారము

మీదే. అక్కడ కొందరిని నిల్పియుంచుచు. వారు బల్లెములు పట్టియుందురు. నీటితోగూడ మొసళ్ళు ద్వారమున బ్రవేశింప కుండనట్లు వారు జాగ్రత్త పడుదురు మీరా వాకిలి నుండి గడ్డకు పోవలెను.”

“అట్లే చేయుదును. ఈనేలమాళిగలోని యీజలద్వారమెందుకు కట్టబడినట్లు?”

“అదొక పెద్ద కథ ఆసోలకుఁడు స్త్రీలను పట్టుకొని వచ్చువాఁడు గదా! వారు తనకు లోబడకున్నచో వారినాతఁడు నేలమాళిగలోనుంచి ఆజలద్వారములు తెరపించును. నీరు లోనికి వచ్చును. ఆ మొసళ్ళు పట్టి తినును ”

“వీఁడు చాల క్రూరుఁడు.”

“అతఁడొక దైత్యుఁడు క్రూరకృత్యములతో- అతనితోఁ బోల్పదగు వారీ లోకమున లేరు. నా విషయమే చూడుడు .. . ... ..”

ఆమె యవ్వుకు గరచినది.

“ఆ వృత్తాంత మిప్పు డక్కర లేదు, ఆ దంపతులను విడిపించు పనియే యిపుడు ముఖ్యము. నేను చెప్పినదంతయు జ్ఞాపకమున్నదా? ఆ దంపతుల నా విచిత్ర ద్వారమునుండి తప్పించుట. ఆ నేలమాళిగలో పసుపుతో గలిపిన నూనె ఒక పెద్ద పాత్రనిండుగ జాగ్రత్త పరపింతును. ఆనూనెను శరీర

మునకు పూసికొన్నచో మొసళ్ళు మీజోలికి రావు. బయట బల్లెములు బట్టి యున్నవారు జాగ్రత్తగ గనిపెట్టి యుందురు. 'బైరేని కొలను' మెట్లెక్కి మీరు గడ్డకు పోయినచో నక్కడ నొక పల్లకి మీకై కాచియుండును. దానిలో కూర్చొనుడు. బోయీలా పల్లకిని మోసికొనిపోదురు. త్రోవలో నెవరైన నడిగినచో అంతఃపురములో నెవ్వరో నొప్పులతో బాధపడుచున్నారనియు అందుకొఱకై మహారాణి రాజవైద్యులను మంత్రిసానిని పిలుచుకొని వచ్చుటకు తన్నంపిన దనియు తా నామె దాసి ననియు 'మంగమ్మ' చెప్పవలయును. మిమ్ముల నా మేనాబోయీలు డోలికయొక్క సాయముతో క్రిందికి దింపజేయుదురు. బయటి కోటవాకిలిని మీరు చేరినవెంటనే మరినల్వురు బోయీలచ్చట మేనాతో కాచియుందురు. నల్వురు సైనికు లా మేనావెంట నడచివత్తురు. ఎవరయిన ప్రశ్నించినచో లోనున్నది కుమార కృష్ణప్ప నాయకులనియు, మహోత్సవములకై వచ్చుచున్న జింజి కృష్ణప్ప నెదుర్కొనుటకై పోవుచున్నారనియు తెల్పవలెను. మీరు కోట దాటి సముద్రమువద్దకు వచ్చినచో అక్కడ నొక దోనె సిద్ధముగ నుండును. మీరందులో నెక్కవలెను. ఆ బెస్తలు మిమ్ము మరియొక యొడ్డునకు జేర్తురు. ఆతీరమున మీ కొఱకై మూడు గుఱ్ఱములు సజ్జితములుగ నిల్వబడియుండును. వాని నెక్కి పారిపోవలెను. మీ రా తీరమునకు జేరనందుకు గురుగా

నొక పెద్ద మంట వెలిగింపుడు. మీరు సురక్షితముగ నావలికి జేరినారనుటకు నాకది గుర్తు."

"ఇన్ని యేర్పాటులను మీరు చేసినారన్నమాట."

"అవును. మీ రీ యూరికి వచ్చుచున్నారనియు, మీ పేరు యజ్ఞనారాయణదీక్షితులనియు నాకు వార్తలు వచ్చినవి. అప్పటినుండియే నా యీ ప్రయత్నములు సాగుచున్నవి. మీ రెట్లును నా దర్శనమునకు వత్తురనియు దెలియును."

"మేమేమో తప్పించుకొందుము. మరి తర్వాత మీ స్థితి? మిమ్మా సోలగుడెట్లు పీడించునో? మిమ్ములను చిక్కులలో పెట్టి మేము తప్పించుకొనుట మా కంత యుక్తముగ తోచుట లేదు."

"దానికి మీరు చింతింపకుడు. ఏది వచ్చినను మేము ధైర్యముతో నెదిరింతుము. సోలగుడిప్పుడు మంచము పట్టియున్నాడు. అతడింతలో, తేరుకొనడు. ఎప్పటికిని తేరుకొనడనియే నా యూహ. మా కే యపాయమునురాదు. మీరు ధైర్యముతో వేము చెప్పినపని చేయుడు ఏమాత్రము ముందు వెనుకలైనను మన కార్యమంతయును చెడిపోవును. అర్ధరాత్రి మొదలుకొని తెల్లవారలోపల నీ పన్నులన్నియు జరిగిపోవలెను. తప్పించుకొనుట కదే సరియైన సమయము. ఈ యేర్పాటులో వెంట్రుకవాసి భేదము కలుగరాదు. ఆ దంపతుల ప్రాణము మీ జాగరూకతపై నాధారపడియున్నది"

"తల్లీ! కానిమ్ము, పురుష ప్రయత్నము మనది ఆపైని దైవమున్నాఁడు."

గౌరాంబ పోవుటకు సిద్ధపడెను కాని-యజ్ఞనారాయణుఁడు మాత్రము సిద్ధముగ లేడు.

"మీ సందేహమేమి? ఏమైన నున్నచో నిప్పుడే స్పష్టముగ దెల్పికొనుఁడు. మరల మనమిద్దరము గలిసికొనుటకు వీలు కలుగకపోవచ్చును.

"అదే తల్లీ! నాదొక ప్రశ్నయున్నది. దీనిని ప్రశ్నయనుట కంటెను-కోరిక యనవచ్చును. ఆజ్ఞయైనచో విన్నవింతును.

"ఏమది?"

"మా కొఱకై మీరు పతిని తృణీకరించితిరి. పుత్రిని గూడ చిక్కులలోఁ బెట్టుటకు జంకుట లేదు మీ త్యాగమతిలోకమైనది. దీనికి మారుగా మా కృతజ్ఞత నెట్లు చెల్లింపవలెనో తెలియుట లేదు. ఇంట దీపము పెట్టికొని మీ పేరు తలచికొని మ్రొక్కుకొందుము... కాని మీరు మా కెందుకింతగా తోడ్పడుచున్నారను విషయమింకను రహస్యముగనే యున్నది. తమ కాక్షేపణ లేకున్నచో-దానికి గారణమేమో తెలిపి మా కోరికను జెల్లింపవలెను.

'నా జీవన కథ. అది...అదొక దురంతమైన యితిహాసము. దానిని దఁచికొన్నచో-నా హృదయము వేయి

శూలములతోఁ బొడిచినట్లు బాధ ననుభవింతును. ఆ కథను నే నింతవర కెవరికని తెలుపలేదు. నా కడుపునబుట్టిన కుమారునికిఁ దెలుపలేదు. ఈ వృత్తాంతమును నా హృదయములోనే పాతివేయవలె ననుకొంటిని. కాని, యగ్నివంటి యాజ్ఞాపకము లిప్పు డెందుకో నా హృదయమున దాగునట్లు లేదు. ఆ భయంకరమైన యితిహాసమును మీకు దెల్పెదను. నేనీ నీచుని చేయి పట్టితిని. వానికి భార్య ననిపించుకొంటిని. కాని, యనుక్షణము వాని నాశమునే నా హృదయము గోరుచుండును.”

ఆమె భయంకరముగ నవ్వెను. ఎవ్వరైనను విందురేమో యను విచక్షణతగూడ నామెకుఁ బోయినది,

# ౧౪

"ఇది కల్పన గాదు. జరిగిన కథ. నా జీవితమునందే జరిగిన కన్నీటి గాథ. ఈ కోటలోని చెట్టు చెట్టు ఱాయి ఱాయి నా కథకు సాక్షులు. కాని వానికి నోరు లేదు. వానికే నోరున్నచో-నాపై జరిగిన యత్యాచారము నెంత యావేశపూరితముగ హృదయ ద్రావకముగ వ్యాఖ్యానించెడివో? నా వృత్తాంతమునేగాదు. ఎందరెందరనాథల దురంతగాథలు గానమొనర్చెడివో? వానికే జీవమున్నచో నవి యీ దురంత దృశ్యములను జూచి గుండెలు బగిలి చచ్చునని గాబోలు భగవంతుడు వానిని నిర్జీవములుగ జేసివేసినాడు. ఈదుర్గములోని ప్రతివస్తువు ఆ కిరాతుని దుష్కృత్యములకు సంకేతములే. ఆ భైరవదేవాలయమున నెందరో నిరపరాధులు వధింపబడినారు. బైరేణికొలనులో మానభంగమున కోర్చికొనక మరణించిన మానినీమణుల యాత్మ లెన్ని మూల్గుచున్నవో! ఇది యంతఃపురము; అంతఃపుర మనుట కంటెను పరమ నీచకృత్యముల కాకరమనుట తగినది: దీనికి సమీపమందున్న చెఱసాలలో నెందరో నిర్భాగ్యులు అన్నము నీరు గానక ఘోరముగ విలపించి విలపించి చచ్చిరి. అక్కడ నడచిన హత్యాకాండలు పదులు గాదు నూర్లు గాదు వేలకు జరిగిపోయినవి.

అనేక నిర్భాగ్యజీవులు వాని కామాగ్నికి బలియై పోయినారు. ఎందరు గర్భిణీస్త్రీలా భైరవుని ముందు వధింపబడిరో లెక్క లేదు. భైరవసరస్సులోని మొసళ్ళవాత త్రోయబడిన యభాగ్యుల హాహాకారములతో నాకు చెవులు గడియలు పడినవి. ఈ కథల నన్నిటిని చెప్పుటకు నేనొక్కతెనే బ్రతికియున్నాను. ఆ నీచునికి నా సర్వస్వమును బలిగా నర్పించి జీవచ్ఛవముగ నిలచియున్నాను. ఇన్ని దుష్కృత్యము లొనర్చినను వానిపై భగవంతుడు పగ తీర్చికొనలేదు. ఆపని నాపాల పడినట్లున్నది. అందుకే పిశాచివలె జీవించితిని. సర్వస్వము హతమై పోయిన యీ దేహము నందుకే నిల్పికొనియున్నాను నా జీవితములో ప్రతిక్షణము ను నరకయాతన ననుభవించితిని. ప్రాణములు పక్షులవలె మాటిమాటికి నెగయ నుంకించుచున్నవి. బలవంతముగ వాని కళ్లు బంధించి నిల్పికొన్నాను. నాకున్న యాశ యింక నొక్కటే, వానిపై ప్రతీకారము."

గౌరాంబ కన్నులగ్నివర్షము కురిసినవి. ఆ చీకటిలో నా కన్నులలోని యావేశమును దీక్షితులు స్పష్టముగ గమనించెను. అంతలో నామె కేడుపు వచ్చినది. అది యామె స్త్రీత్వము. ఆ కన్నీటి నామె బలవంతముగ కుదించికొన్నది. తన కథ యిట్లు చెప్పినది.

"నా తలిదండ్రులకు నేనొక్కతెనే కుమార్తెను. వారు నన్నెంతయో ప్రీతితో పెంచిరి. నేను చిన్ననాడు

నేలపై నడిచియెఱుఁగను. పరిచారకుల బాహుబంధముపై
ననే నడచితిని. ఊరికంతయు నేనన్న నెంతయో ముద్దు. మా
నాయనగారా యూరికంతయు తలలోని నాలుక. అతని పేరు
బంగారు నాయకుఁడు. 'అమ్మనకోట' అనునొక చిన్న దుర్గ
మాతని యేలుబడిలో నుండెను. అతని దుర్గమెంత చిన్నదో
గౌరవమంత దొడ్డది. ఆతఁడు వయసులో విజయనగర రాజులు
నడపిన యుద్ధములలో పాల్గొనెను, అనేక విజయములు సంపా
దించి పెట్టినాడు. అతని కంగవైకల్య మేర్పడినది. అప్పుడు
విజయనగర చక్రవర్తి లీ దుర్గాధిపత్యము నిచ్చిరి. ఇది మాత
నికి నాయంకరము. నేను నా తలి తండ్రులకు చాల కాలమైన
తరువాత పుట్టితిని. వారికి కొమరకయినను నేనే. కూతురైన
నేనే. నా కా తలితండ్రులే కొఱతయు గల్పింపలేదు: సంగీత
సాహిత్యములను నేర్చితిని. చాలదానికి రణవిద్యయు నేర్చు
కొంటిని. నా వయసువారిలో విద్యలలో నన్ను మించినవారు
లేరని జనులనుచుండిరి.

సౌందర్యదేవికి నాపై యనుగ్రహము గలిగెను. ఆమె
తన వాత్సల్యమునంతయు గుమ్మరించినది. ఆమె వరమే నా
కొక శాపముగ పరిణమించెను. దాని ఫలము ననుభవించి
తిని. ఇంతలో యౌవనోదయమయ్యెను. నా సౌందర్యము
వసంతారామమైనది. అందరి యువకుల కన్నులు నాపైననే.
పదునారు వర్షములు నిండిన ప్రాయము. కాని నాయౌవనము

నన్నంతకంటె నెక్కువదానినిగ కాన్పింపజేసినది. ఈమె నెవ్వని చేపట్టునో యని యూరివారందరు కౌతుకముతో నిరీక్షించు చుండిరి.

తలితండ్రులకు నాపెండ్లి చింత పట్టినది. ఎందరో యువకులు నన్ను చూచుటకు వచ్చిరి. వారికి కులమునకు తక్కువలేదు. వైభవమునకు తక్కువలేదు. కాని మాతండ్రి యెవ్వరినిగూడ నంగీకరించెడివాడు గాడు. పెండ్లి చేసి యిచ్చినచో నన్ను వారి యింటికి పంపవలెనే యని యాతని భీతి. దానితో నాతఁడిప్పుడు గాదప్పుడు గాదని వివాహవిషయమును దూరదూరమునకు త్రోసివేయుచుండెను. కాని యెంత దూరము త్రోయఁగలఁడు? నేఁడు గాకున్న రేపైనను నీసమస్య పరిష్కరింపబడవలసినదే గదా! తొందరగ పెండ్లి యేల సేయరని నాతల్లి తొందరపెట్టుచుండెను. తల్లికి గూడ నత్తవారింటికి పంపుట కిష్టములేదు. కాని ప్రపంచమున కామె భయపడుచుండెను. ఎవరికైనను అనురూపవరునకు వివాహ మొనర్చి వాని నిల్లటముంచికొన్నచో నీసమస్య తీరిపోవునని నాతండ్రి బదులిచ్చెడివాడు. ఇల్లటమున కెవ రంగీకరింతురు? వచ్చినవారందరును ఈమాటతో వెనుకకు వెళ్ళిపోవుచుండిరి. దైవ నిర్దిష్టమైన కాలము సమీపించుచుండెను. అట్టివాఁడొక యువకుఁడు దొరకినాఁడు.

"ఆన్మనకోట"లో నవరాత్రి యుత్సవములు అతి వైభవముగ సాగెను. ఈ సంప్రదాయము విజయనగరము వారిదని మీకు తెలిసినదే! మా తండ్రి ఈ సంప్రదాయమును వదలక నడపెడువాఁడు. ఆ యుత్సవములను జూచుటకెందరో బయటి యూళ్ళనుండి వచ్చుచుండిరి. కొలువులో కవిగోష్ఠులు సాగెడివి. మల్లయుద్ధపువేడుకలు, గాయకుల గానములు గూడ చెల్లుచుండెను. వారికి తగిన సన్మానములుగూడ ముట్టెడివి. ఈ తొమ్మిది దినములును, ఊరినిండ వేడుకలు. తమ బ్రదుకులలోని చింతలను మఱచి, హాయిగ కాలమును గడపుచుండిరి. పౌరులలో నింటింటికిని పది మంది బంధువులు, అందరి యిండ్లలోను, పండుగలు పబ్బములు. ప్రతి సాయంకాలమును ఊరి బయటనున్న మైదానములో సైనికుల కవాతు జరుగుచుండెను. మల్లయుద్ధము తరువాతి యంశము. బాణసంచాల వేడుక: ఈ వేడుకలు చూచుటకు నినుక వేసినను రాలనంత జనము మూగుచుండిరి. నవరాత్రివైభవములు మనకు రాష్ట్రీయములైన యుత్సవములుగదా! ఎ[illegible]డేశద్యాలో వేష మోసినను, వాఁడక్కడి కా నాళ్ళలో తప్పక వచ్చుచుండెను. అట్లు వచ్చినవారిలో నాయుపకుఁ డొక్కఁడు. మల్లయుద్ధములలో గెలిచినవారికిని గొప్ప నాయకులకును, సత్కవులకును, మా నాయన చక్కని సత్కారములు చేసెడివాఁడంటిని. వేఁటి విలుకాండ్రకుగూడ బహుమానములు

ముట్టుచుండెను. గుఱ్ఱపు స్వారిలో నేర్పుచూపెడివారి మర్యాదలు చెల్లెడివి. ఈ పోటీలకు నిలిచినవాడు పరస్పర జయాకాంక్షులై స్పర్ధలకు దిగుచుండిరి. ఆ వేడుకలు చూచుటకు కన్నుల పండువుగ నుండెను.

ఈ పోటీలలో పాల్గొనువారు సాధారణముగ యువకులే. ఆ యుత్సవములలో నెవఁడైన తగినవాఁడున్నచో, వానికి నన్నిచ్చి వివాహము చేయవలయుననిగూడ మా తండ్రికొక యాశ యుండెను. వారి యాశ పొల్లుపోలేదు. ఆ సంవత్సరమున దేశమందు చక్కఁగా వానలు కురిసినవి; భూదేవి నవవధువవలె అభినవాలంకార చిహ్నితయై యుండెను. ప్రజల ముఖములు సంతోషముద్రితములై విచ్చిన గేవగులఁ బోలినవి. ఎన్నటికంటె నెక్కువ వేడుకలతో నవరాత్రులను నిర్వహింప వారు తలఁచిరి. పురుషులు, స్త్రీలు, ఆబాలగోపాల మానందమున మునిగెను. దేశమున క్షామడామరములు లేవు. శత్రుభీతి లేదు. బ్రదుకు సుభిక్షమైయున్నది. ఇది యా యుత్సవములకొక ప్రత్యేక కాంతి నొసఁగెను.

ఆ సంవత్సరమున తమ ధనుర్విద్యా కౌశలమును ప్రదర్శించుట కనేక యువకులు చేరిరి. వారిలో కొంద రామంత్రితులు. కొందరు పిలువబడకయే తమ యుత్సాహము

కొలఁది వచ్చినవారు. కాని, మా తండ్రి దృష్టిలో నీ రెండు తెఱఁగుల కే భేదములేదు. శూరుఁడైన వాఁడంతయు, పిలిచినను పిలువకున్నను, రావలెనని యాతని యాకాంక్ష. ఆ యువకుఁ డసహాయకుఁడై వచ్చినవాఁడే. అతనిదుస్తులుసాధారణముగ నే యుండెను. కాని యా ముఖముపై నేదో యొక యాకర్షక మైన కళ; ఒకశోభ. ఆశోభ యాతనికి, తక్కువ యుపకారిగా నుండి వేఱుపరచుచుండెను. సుందరుఁడుగూడ. కాని యా యందము లలితముగాదు. వజ్రములో నున్న సౌందర్యమాత్ర నిది. ఈ బలిష్ఠమైన శరీరము, ఆజానుబాహువులు, గంభీరము లైనకన్నులు; అతఁడు పురుషుఁడు గాడు. పురుషసింహము. అతఁడు కత్తిపట్టుటయందే యొక క్రొత్తదనమున్నది. కాంతి యున్నది, కత్తియుద్ధమైన తరువాత నా యువకుఁడు ధనుస్సు బట్టెను. అతఁడు ధనుస్సును ధరించిన శోభయే వేరు, పొది నుండి బాణము తీయుట యే తడవు ఇతఁడు సామాన్యుఁడు గాఁడని జనులు గ్రహించిరి.

అతనికి సుమారు పదివిండుల దూరములో నొకచిలుక వ్రేలాడగట్టబడియుండెను. దానిని క్రింద బడవేసినవారికి బహుమానము. ఆచిలుకయంతటి ప్రమాణము గల బంగారు చిలుకను నా జనకుఁడు పణముగా నిర్ణయించినాఁడు. ఆ గాటి కై దారు వర్షములనుండియు నీ బహుమానము నందుటకు

యువకులలో స్పర్ధలు సాఁగుచుండినవి. అంతవఱకును ఆ పక్షిని దెగవేసినవాఁడు లేఁడు.

ఈసారిగూడ నా చిలుక నెవ్వరును బడగొట్టలేరని యందఱును దలఁచిరి. వారి యూహ లసత్యము లయ్యెను. ఆ యువకుఁడు రంగములోనికి వచ్చెను. ఒక్కసారి చుట్టు నున్న జనమును క్రీగంట చూచినాఁడు. అతఁడా ధనుర్బాణములను గ్రహించి చిలుకను గురిపెట్టి శరమును వదలెను. అది యా పక్షికి గొంత సమీపమున వెళ్లినది. మరియొక బాణమును వదలెను. ఈసారిగూడ గురితప్పినది. కాని, బాణము చిలుకకుదరిలి పక్కవాటుగా బోయెను మూడవ బాణము నాతఁడు గురిపెట్టినాఁడు ఇది కడపటి బాణము. ఇది తప్పినచో నాతనికిక గౌరవమునందుకొను యోగ్యత లేదు. మూఁడవసారి యాతఁడు గురిపెట్టినపుడు జనులందరును స్తబ్ధ నేత్రములతో నట్లే చూచుచుండిరి. ఆశ్చర్యము! ఆ మూఁడవ బాణము వేగముగబోయి, యా చిలుకను గట్టియుంచిన త్రాడును త్రెంచినది. చిలుక క్రిందబడెను. జనులు హర్షధ్వానము లొనర్చినారు. అతని హస్తలాఘవమును చూచిన ప్రజలుసమీపమునకుబరు వెత్తికొనివచ్చి యాయనను చుట్టుముట్టిరి. కొందఱాతనిని భుజములపై నెత్తికొని యా ప్రదేశ మంతయును ద్రిప్పిరి.

మా నాయనగారితో పాటు నేనుకూడ కూర్చుండి యీ వేడుకను జూచితిని. మా తండ్రిగారి మొగమునిండ యాశ్చర్యమే. ఆ చిలుక క్రిందపడినప్పుడు-అందరితో పాటు వారును తమ సంతోషమును వెలిబుచ్చిరి. ఆ యువకుని జనులు మా తండ్రిగారికడకు మోసికొనివచ్చినారు, మా తండ్రి సగౌరవముగ లేచి నిలువబడి—యాతనికి బంగారు చిలుకను బహుమానముగా నిచ్చెను. ఆ చిలుక యంతయు బంగారు. నవరత్న ముత్తెములు చెక్కబడి యుండెను. అతడు దానిని వినయముతో గ్రహించెను. ఆ సమయములో మా తండ్రి యాతని నిట్లు ప్రశ్నించెను.

"ఓ నాగరికా! మీ రెవరు? మీ పేరేమి? మీ తల్లిదండ్రు లెవ్వరు? మీవంటి వీరపుత్రులనుగని సార్థకమైన రాష్ట్రమేది?"

ఈ ప్రశ్నలాతని ముఖము నుండి వర్షమువలె దూకినవి. ఆ యువకునిపై నాయనకు గలిగిన యాదర మట్టిది!

"అయ్యా నా పేరు శివాజీ(?)... మా వూరు 'బసవా పట్టణము' 'కెళది' నాయకులకు నేను దూరపు బంధువును."

"నీవు బసవాపట్టణపు వెంకటప్పనాయకుల కొడుకువా యేమి?"

"అవునండి. వారు మా తండ్రిగారు. వారిపేరు తమ కెట్లు తెలిసినది?"

ఆ యువకు డాశ్చర్యముతో నడిగెను.

" 'కెళది' నాయకులందరును నాకు బరిచితులే. మేమును వారును జేరి విజయనగర చక్రవర్తులకై యనేక యుద్ధములలో పాల్గొంటిమి. మా తండ్రిగారైన కొండప్పనాయకులు-కెళది సదాశివనాయకుల ఆప్త మిత్రులు. వారినుండి నే నెన్నోసారులు - సదాశివనాయకుల వైభవము - ధైర్యము సాహసము మొదలైన సద్గుణములను గూర్చి వినియున్నాను. తళ్లికోట యుద్ధములో-విజయనగర సైన్యము లోడిపోయినను సదాశివనాయకులున్నచో- ముస్లిం సైన్యములు బెదరుచుండెనట! ఆ విషయములు కట్టుకథలై పోయినవి. పోనీలే! మీ తండ్రిగారైన వెంకటప్పనాయకులు నాయక పదవినుండి నివృత్తులై -వైరాగ్య నిష్ఠులై- విశ్రాంతి సుఖము ననుభవించు చున్నారని వింటిని"

"అవును. వారు దుర్గముల నన్నిటిని నా కొప్పించి-మిగిలిన యాయుర్దాయమును-పుణ్య సంచయముతో గడుపు చున్నారు. మే మిచ్చటికి వచ్చినదియు-ఆపనిపై ననే."

"అనగా"

"మేము తీర్థయాత్రలకై బయలుదేరినాము. వృద్ధులైన తలిదండ్రులవెంట నేనును వచ్చితిని. రామేశ్వర యాత్రను ముగించికొని- మధుర తంజావూర్లను జూచుకొని తిరుపతికి బ్రయాణమైనాము. మార్గమధ్యమున నిట కొంత

కాలము నిలువవలసి వచ్చినది. ఇక్కడికి వచ్చువేళకు మా తండ్రిగారి యారోగ్యము కొంత దెబ్బతినెను. అది నయమైన నేగాని ముందుకు బోవుటకు వీలులేదు. ఇంతలో నవ రాత్రిలు వచ్చినవి. మీ యొనర్చు యుత్సవములనుగూర్చి మే మెంతయో వినియుంటిమి. వానిని చూచుటకై నేను వచ్చితిని. ఇక్కడికి వచ్చినతరువాత–ఈ చిలుకను గొట్టుటకై మీ రేర్పరచిన పోటీనిగూర్చి విన్నాను. నేనేదో వినోదమునకై బ్రయత్నించితిని. ఆ పురస్కారము నాదైనది. అది నా యదృష్టము."

"నీ వాలకముజూచి యింతకు ముందే రాజ పుత్రుడవని నిర్ణయించికొన్నాను. నా యూహ వ్యర్థముగా లేదన్నమాట."

మా తండ్రిగారు నవ్వినారు.

ఆ యువకుఁ డిట్లనెనుఁ

"మేము కావలెనని యే–యీ వేషమున బయలుదేరితిమి. ఈ ప్రదేశములలో–దారి దోపిడులెక్కువ యని విన్నాము. ఆడంబరములతో బయలుదేరినచో–త్రోవలో నేమైనను బాధలు గలుగవచ్చునని యనుమానము. అంత మాత్రమే కాదు. మేము బలుదేరినది తీర్థయాత్రలకు. ఆడంబరము దేనికి!"

ఆ యువకుడు వినయముతో నవ్వినాడు. ఆ వినయము మా తండ్రిగారి నెంతయో యాకర్షించినది.

"మీారీ యూరిలో నెక్కడ కాపురము? నాకొక్క మాట తెలుపవలసి యుండెను."

"ఈ యూరిలో బ్రాహ్మణ వీధిలో నొక సత్రమున్నది. దానిలో మా బస. అక్కడ మా యనుకూలముల కేమియు తక్కువ లేదు. వృథాగా మా నుండి మీా కెందుకు కష్టము కలిగింపవలెనని మిమ్ము దర్శించలేదు."

మా తండ్రిగారి ముఖముపై నుత్సాహము కొంత తగినది. వారిటు పలికిరి.

"చాల బాగున్నది. మీా తండ్రిగారును—మా తండ్రిగారును ఆప్త మిత్రులు. ఏక కుటుంబమువారివలె మెలగిరి. అట్టిచో-మీారు మా యూరికి వచ్చినను-ఆ వృత్తాంతమును మాకు దెలుపక-యుండుట యంత సముచితముగ తోచలేదు. మీా యాగమన విషయము మాకు తెలుపకుండుట-మీారు మా యెడల నొనర్చిన యపచారము. దీనికి పరిహార మొక్కటే! మీారు వెంటనే మా యంతఃపురములోనికివచ్చి మా యాతిథ్యమును స్వీకరించి కొంతకాల ముండవలెను."

"మీా దయ కానిండు. మా తల్లిదండ్రులను విచారించి తెలిపెదను."

"ఇక సందేహము లక్కఱలేదు. మీరు వచ్చినమే తీరవలెను. ఈ విషయమున మిమ్ము బలవంత పెట్టుటకు మాకు హక్కున్నది. నా యభిప్రాయము మీ తండ్రిగారికిని తెలుపుదు."

"మీరు మా యందు గనపఱచిన ప్రేమకు మేమెంతయు కృతజ్ఞులము. మీ ప్రేమను తిరస్కరించు ధైర్యము మాకు లేదు."

ఆ యువకుడు- కొలువులో నడచిన సకల వృత్తాంతమును నా తల్లిదండ్రులకు తెలిపినాడు. వారు మా యంతఃపురమునకు విచ్చేసిరి.

వారు సుమారొక నెల రోజులు మా యింటనున్నారు.

ఆ దినములలో నే ననేక సారులు విరూపాక్షనాయకుని జూచితిని. ఒకటి రెండు సారులు మాటాడిన సన్నివేశములును గలవు. మా పరిచయము క్రమక్రమముగా-స్నేహమయ్యెను. అది ప్రణయముగ పర్యవసించినది. మేమిరువురమును బరస్పరము గాఢముగ ప్రేమించుకొనుచుంటిమి.

విరూపాక్ష నాయకున కింకను పెండ్లికాలేదు. ఈ విషయము నాతడే చెప్పెను. అతనికి పెండ్లికాలేదను సంగతి మా తండ్రికి తెలిసినపుడు-వారి సంతోషమునకు మేరలేదు. తమ కుమార్తెకు దగిన వరుడతడేనని వారు నిశ్చయించి కొనిరి. కాని వారి సంతోషమునకు గొంత యడ్డంకి యేర్పడెను. అల్లుని యిల్లటముంచుకొనవలెనని వారి

యాకాంక్ష. దానికి విరూపాక్షనాయకుని తల్లిదండ్రులు సమ్మతింప లేదు. ట్టణ రాజ్యమున్నది. విరూపాక్షనాయకుడే రాజ కార్యములు దీర్చుచుండెను. ఒక్క క్షణమైనను-రాజధానిని వదలి వచ్చుటకు వీలులేదు. కాని-తల్లిదండ్రుల యాజ్ఞను మీరలేక యాతడు తీర్థయాత్ర కరుదెంచెను. ఇట్టివాడు-"అమ్మనకోట" జాగీరు జూచుకొనుచు మా యింట నిలుచునా? ఈ మాటతో మా తండ్రిగారి యుత్సాహము కలతమైనది. వారి సంబంధము విషయమున నంత తీవ్రతను కనుపరుప లేదు.

వారి యనుత్సాహము నాకు రుచించలేదు. నా తండ్రి నన్నెంతయో ప్రేమించుచుండెను. నేను విరూపాక్షనాయకుని ప్రేమించుచుంటినని యాతఁడెఱుగఁడు వారి కెందుకీ విషయమున నుపేక్ష వహించినాడు.? నాకది పెద్ద సంకటమైనది. కాని నా తండ్రిని ప్రశ్నించు ధైర్యము నాకు లేదు. మనసులోనే బాధపడుచుంటిని. ఒక దినము తండ్రిగారితో-ఉబుసుపోక కేవో మాటలు సాగుచుండెను. ఆ మాటలలో వెంకటప్పనాయకులుంగారి వృత్తాంతముగూడ వచ్చినది. నేను మా తండ్రిగారితో నిట్లంటిని.

"అప్పాజీ! వెంకటప్పనాయకులుంగారు ఇక రెండుమూడు దినములలో ప్రయాణము గట్టనున్నారట. ఈ విషయము

మీకు దెలియునా?

"అమ్మాయీ! నేడే విన్నాను."

"మరికొంతకాలము వారి నిక్కడనే యుండుడని మీరు ప్రార్థించినచో బాగుండును."

"నేనెట్లు వారిని నిర్బంధింతునమ్మా! వారు యాత్రల్కై వచ్చినారు. మనదగ్గర నిలిచినంత కాలము మరెక్కడను నిలువలేదని యనుచున్నారు. రెండు మూడు దినములలో వారు తప్పక ప్రయాణము గావలెనట!"

ఈ మాటలతో నాముఖము వివర్ణమయ్యెను. నా భావమును మా తండ్రిగారు గ్రహించిరి.

"ఎందుకమ్మా! వారు ప్రయాణమైనచో మనకేమి?"

పై మాటకు నేనేమియు నుత్తర మివ్వలేదు. కాని నా చూపులలో దైన్యము మెదలినది. ఆ దైన్యమునాయన పసికట్టెను.

"బిడ్డా! నీ చింతకు కారణమేమో నాకు తెలియును. కాని నేనేమిచేతును? వారు నామాటలకు సమ్మతించు నట్లులేదు."

"ఏ మాటలకు?"

"నిన్ను విహారపాకనాయకునకిచ్చి వివాహమొనరింత మనుకొంటిని."

నా కన్నులలో నంతకు ముందు గన్పడిన దైన్యమును బోద్రోసి లజ్జారేఖ లలముకొన్నవి. చిఱునవ్వుతో, నాయన గారి వంక జూచినాను.

"వారు నిన్ను తమ యింటి కోడలిగ చేసికొనవలెనని యే యాశపడుచున్నారు. కాని విరూపాక్ష నాయకుడిచ్చటనే యుండి-మన జాగీరు జూచుకొనవలెనని నేనుకోరితిని. దానికి వారు సమ్మతింపలేదు."

మా యిరువురికిని కొన్ని నిమేషములు మౌనముగ గడచెను. కడకు మా నాయన గారితో నిట్లంటిని.

"అప్పాజీ! ఒక్క విషయమడుగుదునా?"

"అడుగవమ్మా! ఆక్షేపణ యేమి?

"మీరు నన్ను-ఎంతో గాఢముగ ప్రేమించుచున్నారు కాని-యీ విషయమున మాత్రము......... "

"అదెట్లు సాధ్యమగును? నిన్నత్త వారింటికి బంపినచో- నీ యిల్లు కళాహీనమైపోవును. వృద్ధాప్యమున మా కాలంబన మేదీ?"

ఈ మాటలకు నేను బదులివ్వలేదు.

"నీవులేనిది మాకు బ్రదుకెక్కడున్నదమ్మా? నిన్ను విడిచి మేము క్షణకాలము బ్రదుకలేము."

మా తండ్రిగారి కన్నులలో నీరు నిలచినది. వారి

కన్నీరు నా హృదయమున శూలపుపోటు పొడిచినది.

"అప్పాజీ! నా కొఱకై మీరు దుఃఖింపరాదు. నాకు వివాహ మక్కఱలేదు. మీ ప్రేమకు ద్రోహ మొనర్పలేను. నే నిచ్చటనే యుందును."

పై మాటలు నిర్ధారణగా నంటిని.

ఈ మాట లాతని హృదయముపై నే పరిణామమును గొని తెచ్చెనో! నా తండ్రి నన్ను గాఢముగ గౌగలించికొనెను.

"బిడ్డా! ఎంతమాటన్నావు? అయ్యో! నీవు మా కడుపున పుట్టుటకు బదులు-వే రెవ్వరికడుపుననైన బుట్టియుండ రాదా?"

ఆతఁడేడ్వ నారంభించెను.

"అప్పాజీ! మీరట్లనరాదు. మీవంటి తల్లిదండ్రు లుండుటకు పూర్వ పుణ్యము లుండవలెను. మీకు దగిన బిడ్డను గాననియే నా దుఃఖము."

మరి నేనక్కడ నుండలేక పోయితిని. వెంటనే లేచి పోయితిని.

ఆ రెండు దినములు మా యింటిలో కాళరాత్రులన వచ్చును. నా తల్లిదండ్రులు కన్నీరు మున్నీరుగా నేడ్చిరి. తిండి ముట్టుకొనలేదు. కడకు వారిర్వురును నా సుఖమునకై తమ స్వార్థమును త్యాగముచేయు స్థితికి వచ్చినారు. రెండునాళ్ళ తరువాత మా తండ్రిగారు నాతో నిట్లనిరి.

"బిడ్డా! మే మింతవఱకు మా స్వార్థమునే-గమనించి కొన్నాము. నీ సుఖమును చూడలేదు. ఇన్నాడు మా కన్నులు తెఱచి కొన్నవి. నీ మాటలతో మాకు జ్ఞానోదయ మైనట్లయినది. మా దేమున్నది? మా కాలము చెల్లి పోయినది. నీవు మా రేండ్ల పంట వు. నీ సుఖమే మా సుఖము. విరూపాక్షుని పరిణయమాడుము. లక్షణముగా నుండుము."

నా త్యాగ మాయనలో వివేకమును గల్గించినది. అల్లుడిల్లట ముండవలెనను పట్టుదలను మా తండ్రి సడలించి కొనెను. ఇక వివాహమునకే యడ్డంకియు లేకపోయెను. పది దినములలోపలనే వివాహ లగ్నము నిర్ణయింపబడినది. మహావైభవముగ పెండ్లి జరిగిపోయినది. నే నాశించిన మగడు నాకు లభించినాడు. అర్జునునివలె తీర్థయాత్రలకు వచ్చిన విరూపాక్ష నాయకుడు - సుభద్రవంటి తమ కన్యను పెండ్లాడెనని - జనులందరును సంతసించిరి. నే నత్త వారింటికి బోవలసిన దినములు సమీపించెను.

ఇది యొక హృదయ స్పృశమైన సన్నివేశము. సుమా రిరువది సంవత్సరములు నేనా తల్లితండ్రులకు కూతురనై - కొడుకునై మెలగితిని. ఇపుడాయిల్లు వదలి రావలెను. నా ప్రయాణముతో మా తల్లిదండ్రుల హృదయములు గాయము గొన్నవి. కాని తమ యింటి దీపము-మరియొక యింటిని

వెలిగిం పజాలవు మన్నదను స్వాతిశయ భావముంగూడ వారి ముఖములపై నగుపడెను. వారే స్వయముగ నిలచి నా ప్రయాణమునకు సన్నాహములు నిర్వహించిరి. నేను కోరిన వస్తువులు దీసి యిచ్చిరి. మా వెంట కొందఱు గుఱ్ఱపురౌతులు రక్షణకై వచ్చిరి. నూత్న దంపతులము మేనాలో కూర్చుంటిమి. మా వెనుక కొంత కాల్బల ముండెను. కాల్బలమునకు ముందు కొన్ని దాసీల మేనాలు. అందరికన్న ముందు గుఱ్ఱపు రౌతులు నడచిపోవు చుండిరి. ఊరు దాటు వరకును మమ్ము మా తల్లిదండ్రులు సాగనంపినారు. "బసవాపట్టణము"వైపు మా మేనాలు సాగుచుండెను. నా తల్లిదండ్రులు వెనుదిరిగిరి. నా కళ్యాణము ముగిసినది. నా బ్రదుకు కల్యాణకరము గావలెనని నా తల్లిదండ్రుల యాశ. అది మాత్రము నెరవేరలేదు. గౌరాంబ యేడ్చెను. దీక్షితులు నిశ్శబ్దముగ కథ వినుచున్నాడు. ఆమె యంతలో నోదార్చుకొన్నది. పై కథ నిట్లు చెప్పికొనుచుం బోయినది.

"అమ్మనకోట" విడిచి సుమారు రెండామడ దాటి వచ్చితిమి. ఇంతలో నీ యాపత్తు వచ్చిపడినది. ఇది— నా జీవితమునే నాశము చేసివేసినది. "అమ్మనకోట" లో నొక యువకునకు నాపై కన్నుండెను. వానికి నాతో వివాహము గాలేదు. వాడు నాపై పగదీర్చుకొన తలంచినాడు.

[illegible]
[illegible] మనుష్యులను [illegible]
[illegible]
[illegible]
[illegible]
[illegible] తక్కినవారు పరువెత్తిరి.
[illegible] చిక్కిరి.

విరాటపాత్రాయుడి యుద్ధమున నభిమన్యునివలె పోయెను. అభిమన్యునివలెనే జచ్చెను. ఆతని తల్లిదండ్రులు గుండెలు బాదుకొనుచు నచ్చటనే మరణించినారు. ఇక నాకు దిక్కెవరున్నారు? నేనాచోటనుండి తప్పించుకొన జూచితిని. నా ప్రయత్నము ఫలించలేదు. సైనికులు నన్ను బట్టుకొనిపోయి వానియెదుట నిలిపినారు. ఇక నేమున్నది? ఆ చోటనే వాని యత్యాచారమునకు బలినై-నా జీవితము ధ్వంసమైపోయినది. నా కలలు నాశమైనవి. నాసర్వస్వమును నంహాప రాక్షసుడైన పోలుగుడు-కొల్లగొనెను. ఇక నా జీవితమున నే యాశయు లేదు. నే నెన్నోసారు లాత్మహత్యకై యత్నించితిని. కాని పోలుగునకి వేయి కన్నులు; నా యే ప్రయత్నమును ఫలించినది లేదు. వాడు నా సర్వస్వమును

హరించి నన్ను గైకొనిపోయి "దేవికోట" యంతఃపుర దుర్గమున నుంచినాడు. నా కిచట సర్వ సౌఖ్యములును గల్పించినాడు. ఎట్లయినను-నా హృదయమును గెల్చికొన వలెనని వాని యాశ. నా దేహమును వాడు స్వాయత్తీకరించి కొన్నాడు; కాని నా హృదయము వానికెన్నడును వశము గాలేదు. వాడా పాషాణ చుంబనమున కదురలేదు. బెదుర లేదు. నాకుబట్టిన దురవస్థను విన్న నా తలిదండ్రులు గుండెలు బగిలి మరణించిరి. ఇక నా జీవితములో నేమి మిగిలినది? నా బ్రదుకు కుక్క ముట్టిన కుండయైపోయినది. అటుపై నేను మరణించుటకు యత్నింపలేదు. సోలగునిపై ప్రతీకారమే నా నిత్య పారాయణమైనది. వీడు మా యింటికి గిచ్చిపెట్టెను. వీని సర్వస్వమున కగ్గిపెట్టి తీరవలెనని నా యాకాంక్ష. ఈ ప్రతీకార వాంఛ నన్ను బ్రదికించినది. ఇంతలో నాకీ కొడుకు గలిగినాడు. వీనిని నా యదుపులో నుంచికొనినదియు సోల గునిపై పగదీర్చుకొనుటకే! వీడు పుట్టిన తరువాత నా మెడముపై నప్పుడప్పుడు నవ్వు పొడగట్టెడిది. నా యిచ్ఛకు విరుద్ధముగ వీడు పుట్టెను. కాని వీనిని గన్నప్పుడు నా స్త్రీత్వ మేదో సార్థకమైనట్లుండెను. ఈ ప్రేమలలో నెంతమాయ యున్నది? ఈ కుమారునిచేతనే కత్తి పట్టించి-వీనిచేతనే సోలగుని జంపింపవలెనని నా గొప్ప యాశ. వాని నట్లే పెంచితిని; వానికీనాడు తండ్రియన్నచో గిట్టదు. సోలగుడు

తన దుష్కృత్యములకు ఫలితముగ పడక బట్టినాడు. వానిచే మానభంగమందిన - హింసింపబడిన-వారి శాపములు వాని జీవితమును దహించుచున్నవి. ఈ భైరవోత్సవము ప్రతి వర్షమును జరిగెడి తంతే. ఈ సారి బలి నొసగు కార్యమును వాడు తన కుమారున కొప్పగించినాఁడు. తప్పింపరాని నరబలిని-యీసారి తప్పించివేయుదును. ఇది సోలగుని జీవితముపై నా ప్రథమ విజయము.”

## ౨౫

అంతలను అనుకున్నట్లే జరిగెను. భైరవోత్సవమునకు ముందటనాఁటి సోలగునికి పార్శ్వవాయువు పట్టుకొన్నది. దేహమునులోని యొక భాగము వాని వశము తప్పెను. ఇక వాఁడు మంచముపై జీవింపవలసినదే! ఉత్సవమును నడపవలసిన పని యంతయు భైరవ నాయకునిపై బడినది. సోలగుఁడు కోరినట్లుగనే-కుమార కృష్ణప్పనాయకుడు పూర్ణబలి యిచ్చుట కంగీకరించినాఁడు. అత డంతకు ముందటి దినమే-దీక్షను స్వీకరించెను. ఉపవాస ముండెను. భైరవు నుపాసించుచు-దేవాలయపు గర్భగుడిలోనే యున్నాఁడు. బలి యిచ్చునాటి ముందటిదినము చెన్నప్పనాయకునకు-వాని పత్నియైన మంగమ్మకు చెఱ విముక్తి యైనది. అనఁగా చెఱసాలనుండి బయటికి వచ్చిరన్న మాట! ఆ దంపతులను రక్త వస్త్ర మాల్యములతో నలంకరించి-భైరవాలయమునకు కొనితెచ్చిరి. వారు కంటికింపు విదిరించి యెన్నాళ్ళయ్యెనో? ఇన్ని రోజులుగ కడుపు నిండ తిండి తిని యెఱుగరు. వారి వదనములు నిస్తేజస్కములై యుండెను. దేహము బక్కచిక్కెను. వారికిప్పుడు ప్రాణములపై నాశలేదు. తాము బ్రతుకుట కల్లయను నిశ్చయమునకు వచ్చినారు.

మొదలు మొదలు తమ్ము అన్ని దినము లెందుకు చెఱసాలలో నుంచిరో యీ దంపతుల కర్థముగాలేదు. కాలక్రమమున నా విషయము దెలిసెను. అపుడు వారి దుఃఖమునకు మేరలేక పోయెను. ఆ దంపతులు సంతానమునకై చాలా తపస్సులొనర్చిరి. అనేకరీతుల భగవానుని ప్రార్థించిరి. వారి కోర్కె ఫలించుదినములు సమీపించునప్పటికి సోలగుడను పెనుభూతము వారిపైబడెను. విధివిలాస మెంత చిత్రమైనది! ఆ దంపతులు తమ దుర్విధికై వగచిరి. కాని యెంత దుఃఖించి యేమి ప్రయోజనము? విధికి కరుణలేదు. సోలగుడు వారి దుర్విధికి ప్రతిరూపము. బలిదినము సమీపించుకొలది యు వారి దుఃఖము తగ్గుచుండెను. ఇహలోకమునకు సంబంధించిన సర్వ దుఃఖములకును- మరణము విరామము; బలిదినమునకై వారెదురు చూడసాగిరి. ఆ దంపతులకొక మనఃశాంతి యుండెను. చచ్చునపుడు తామిర్వురు గూడ నొకేసారి చత్తుమని వారి తృప్తి. ఈ జన్మమున తమకు విడుమరలేదు. మరణమెట్లును నిశ్చయము. కాని భైరవునికి బలియగుట వారికొక సంతోషమునే గూర్చెను. రక్తాంబరములను వారు తృప్తిగ ధరించిరి. రక్తమాల్యముల నలంకరించికొన్నారు. వారిపాలిటికవి వివాహవస్త్రములై యుండెను. వివాహమున ఆ దంపతులు ఒకరిమాలను మరియొకరు మార్చికొనిరి; ఈ

మాలలనుగూడ నట్లే మార్చికొన్నారు; వ్రేళ్ళలో దర్భలతోడి పవిత్రమును దాల్చినారు. పెండ్లినాటి నాందీ జ్ఞాపకమునకు వచ్చెను. వివాహమునాడు వారు-మనోహర దాంపత్య జీవితమునకు సిద్ధపడినట్లే-మరణమునకును తయారైనారు. బ్రిదుకుపై నాశలేని యీ దంపతులకు-మరణము బిగుసుకున కంటె వేటుగ భాసింపలేదు. అంతేగాదు, సుఖముగ గూడ నుండెను; ఒక చావుతో నిహలోక యాతనలన్నియును దీరి పోవును ఇంతకుమించిన తృప్తియేమున్నది? వారిజీవన కాళరాత్రిలో-యజ్ఞనారాయణదీక్షితులు బ్రాహ్మణవేషముతో వారికి దర్శన మొసగినాడు. వారు రక్త వస్త్రములను ధరించునపుడు-అత డక్కడ నుండెను. తోడి విప్రుల నాతడు మంచిచేసికొన్నాడు. ఆ రక్త అలంకారముల నందించుచున్న దాతడే. ఆ నెపముతో వారికాతడు-తన వృత్తాంతమును సంక్షేపముగ నెఱింగించెను. తోడి విప్రుల కర్థముగానట్లు తెలుపుటలో-దీక్షితుల చాతుర్యము దాగియున్నది. రఘునాథనాయకుని ప్రయత్నములు-తిమ్మను విడిపించుటలో గౌరాంబ-కుమార కృష్ణప్పనాయకుడు మొదలైన వారికి గల యాసక్తి యీదంపతులకు కొంతకు కొంత యర్థమయ్యెను. వారు మనస్సులోనే దీక్షితులకు నమస్కరించికొన్నారు.

అర్ధరాత్రి మీరినది. భైరవనాయకుడు పహరావారిని మార్చెను. వారి నందరినాతడు జక్కగ పరీక్షించినాడు.

మరల నాతడు గర్భగుడిలో బ్రవేశించి - దీక్షితుడై యున్న కుమార కృష్ణప్ప ముందు గూర్చుండి మంత్రమును చెప్ప మొదలుపెట్టెను. ఆ గర్భగుడినిండ రక్త పరికరములే! నేలపై సోనలుగట్టిన రక్తము. కన్నులకు గావుగొట్టెడు రక్తాన్నము చాలని దాని కుప్పలై పడియున్న గన్నేరు మొదలైన యెఱ్ఱని పూలు. యాజ్ఞిక క్రియలలో పాల్గొన్న విప్రులందరును రక్త వస్త్రధారులే! గుడినిండ వెల్గింపబడిన కాచదీపములు; ఆ దీపములా చీకటిని పూర్తిగ బోగొట్ట లేకున్నవి. గర్భగుడిలో మాత్రము నందా దీపము-జాజ్వల్యమానముగ వెలుగుచుండెను. ఆ భైరవుని మూర్తి భయంకరమైనది. ధూపముల పొగలు, వాసనలు గర్భగుడి నిండ వ్యాపించినవి. ఆ పొగలలో నా మూర్తి స్పష్టముగ గోచరించుటలేదు. గోచరించినంతమేరకు-నెదుటివాని మనస్సులో-భయమునే జిమ్ముచున్నది. వేరొకవైపు హోమములు సాగుచున్నవి. ఆ హవిస్సుల వాసనలు నాసాపుటముల కసహ్యమును గూర్చుచుండెను. వారు నేతితో పాటే యే పదార్థములనో వేల్చుచుండిరి. ఆ వాతావరణమున-ప్రశాంతిలేదు. గుడి బయట కుక్కలు భయంకరముగ నరచుచున్నవి. చాలని దానికి గూబలధ్వనులు. గర్భగుడిలో నుండి వినవచ్చు బ్రాహ్మణుల వేద ఘోషలు మాత్రమే-అపుడపుడా యర్ధరాత్రిలోని భయంకర నిశ్శబ్ద

మును జీల్చునవి. గర్భగుడి కొక మూల బలి యొసగవలసిన దంపతులను నిలిపి యుండిరి.

ఉన్నటుండి యా మూలనుండి భయంకర రోదన ధ్వని వినవచ్చినది. మంగమ్మ గట్టిగా నేడ్వ నారంభించెను. భైరవనాయకుడు తాను చేయించుచున్న కలశపూజను వదలి యా మూలకు బరువెత్తుకొనివచ్చినాడు. పూర్ణాహుతి కావలసిన మంగమ్మ గట్టిగా నేడ్చుచున్నది. ఆమె ప్రసవ వేదనను నటించుచుండెను. భైరవనాయకుని కొంపమునిగినది. వానికేమిచేయుటకును తోచలేదు. వాడు వెంటనే కావలి వాండ్రను జాగ్రత్తగ నుండవలసినదని హెచ్చరించి-పోలగుని యంతఃపురమువైపు బరువెత్తినాడు. పూర్ణాహుతికి బవికి వచ్చునది గర్భిణీస్త్రీ. అంతేగాని ప్రసవించిన యాడుదిగాదు. మంగమ్మ యిప్పుడు ప్రసవించినచో-భైరవోత్సవమంతయు పాడైనట్లే; ఈ సమస్యతో భైరవనాయకునకు పిచ్చియెత్తి నట్లయినది. వాడు పోలగుని కడకు బరువెత్తెను. ఈ యనానుకూలమునకు పోలగుడు మాత్రమేమిచేయును? అది భైరవనాయకునకు తోచలేదు.

భైరవనాయకుడు గుడి వదలి పోయినదే తడవు దీక్షితుడు విప్రుల నందర నేదోయొక నెపమున-కుమారకృష్ణప్పకడకంపెను. ఆ దంపతులను విచారించుచున్న సాకుతో-వారి నా గర్భగుడిలోని నేల మాళిగకు

జేర్చినాడు. ఆ నేల మాళిగ లోనుండి - "బైరేని కొలను" లోని కొక వాకిలి యున్నది. ఆ వాకిలి నాతడు మూడు సారులు తట్టెను. అది యంతకు ముందే యేర్పరచి కొన్న సంకేతము; సరస్సులో బోయులు సిద్ధముగ నుండిరి. వారిని గౌరాంబ రహస్యముగ నియోగించినది. ఆ నేల మాళిగలోనున్న నూనెతో గలిపిన పసుపును - దంపతులు తమ శరీరమునిండ బూసికొన్నారు. వాకిలి దెరుచుకొనుటయే తడవు-నీరు లోనికి నుగ్గినది. యజ్ఞనారాయణుడా ద్వారము నందు దిగెను. ఆ దంపతుల నాతడు సరస్సులోనికి జేర్చినాడు. ఆ వేళకే నేలమాళిగ నిండ నీరు నిండెను. వారిని జీల్చివేయు టకు—ఆ ద్వారములోనికి నుగ్గిన మొసళ్ళను బోయులు బల్లెములతో బొడిచిరి. కొంచెము దూరముననున్న - మొసళ్ళు మానవుల వాసననుబట్టి - భయంకరముగ గర్జించుచుండెను. కాని బల్లెములు బట్టిన బోయులు మెలకువతో నా దంపతుల మొసళ్ళచేతికి చిక్కనివ్వలేదు. దీక్షితు డా దంపతులను బయటికి తెచ్చెను. ఆ సరస్సులోని నీరు దుర్గంధపూరితము. ఆ నీటితో వారి దేహములు కంపుగొట్టుచుండెను. వారంవరు వస్త్రములు మార్చికొనిరి. వారి సహాయార్థమచట నొక పల్లకీ యున్నది. ఆ బోయీలను గౌరాంబయే సిద్ధపరచినది. వారు మార్చికొన్న వస్త్రములనామె పల్లకిలోనుంచి పంపినవే!

బోయీలు పల్లకి నెత్తుకొని ముందుకు సాగిరి. కావలివాఁడు దారినడుమ ప్రశ్నించెను. దానికి మంగమ్మ పల్లకిలోనుండి యిట్లు సమాధాన మిచ్చెను. "మేము మహారాణిగారి యాజ్ఞతో బోవుచున్నాము. భైరవాలయమందు నొస్వాలు తినుచున్న-ఖైదీ నంతఃపురమునకు పిలిచికొని రావలసినదని రాణీవారియాజ్ఞ" వాఁడా పల్లకికి త్రోవ నొసగెను. మేనా "గిరి" దుర్గముకడకు వచ్చెను. అచ్చట నొక "యూయెల" యున్నది. అది యొక చెట్టునకు బంధింపబడి యుండెను. "మేనా" బోయీలు కావలివానిలేపి-"వీరిని కోట దాటించ వలెనని-కుమార కృష్ణప్పగారి యాజ్ఞయైన"దని తెల్పినారు. దీక్షితులు కుమార కృష్ణప్పయొక్క ముద్రాంగుళీయకమును వానికి చూపెను; దానిని కుమార సోలగుడు దీక్షితుల కొసఁగియుండెను. కావలివారు ఆ మేనాను "ఊయెలలో" నుంచి మదగజముల సాయమున కోట క్రిందికి దింపివేసిరి. అక్కడ నొక సైనికుడు నిలిచియుండెను. వానిచేత భయంకరమైన యొక శూలాయుధము. వాడిట్లు గర్జించినాడు.

"ఎవరది? ఈ అర్ధ రా లో పల్లకీ యెక్కడ బోవుచున్నది?"

"మహారాజుగారి యాజ్ఞతో-రాజవైద్యులను బిలుచుకొని వచ్చుటకు-బోవుచున్నాము." దీక్షితులు ముద్రాంగు

శీయకమును చూపినాడు. ఆ సైనికుడు వారికి తోవ నిచ్చెను.

బోయీలు వేగముగ నడువసాగిరి. వారూరు దాటి వచ్చు వేళకు, పూర్వదిగంతములు తెల్లవారినవి. ఆ తెలుపు సూర్యోదయమునకు పూర్వ పీఠికవలె నుండెను. కోటలో దంపతులు తప్పించుకొన్న వర్తమానము తెలిసినట్లున్నది. కావలివాండ్రిటు నిటు పరుగెత్తుచుండిరి. ఇది గమనించిన బోయీలు వేగముగ నడచుచున్నారు. వారు వీథులుదాటి ఊరి బయటికి వచ్చినారు. "స్థలదుర్గ" మహాద్వారమును సమీపించునప్పటికి సూర్యోదయ మగుచుండెను. స్థలదుర్గమును రక్షించుచున్న కావలివారిని యా దుర్గాధిపతి యప్పుడపుడే మార్చుచుండెను. ఆ సమయమునకు సరిగ బోయీలు కోటకడకు వచ్చిరి.

"ఎవరది? నిలబడుడు" దుర్గాధిపతి గర్జించెను. బోయీలు పల్లకిని దించిరి.

"మీరెవరు? ఇంత పొద్దుటనే కోట నెందుకు దాటుచున్నారు?"

దుర్గాధిపతి యడిగినాడు.

"అయ్యా! మేము ప్రభువుల పాదసేవకులము; వారి యాజ్ఞతోనే పల్లకిని మోసికొని వచ్చితిమి. భైరవోత్సవములు చూచుటకై జింజినుండి కృష్ణప్పనాయకులు వచ్చుచున్నారు

వారినెదుర్కొని తీసికొనిరావలసినదని-మహారాజులయాజ్ఞ."

"ఏమీ! జింజి కృష్ణప్పనాయకులు వచ్చుచున్నారా? ఈ సంగతి మాకు తెలియదే!" దుర్గాధిపతి యాశ్చర్యముతో బ్రశ్నించెను.

"వారిక్కడికి వచ్చు విషయమెవ్వరికి దెలియదు. నిన్న రాత్రి వారినుండి మహారాజులకు కమ్మవచ్చినది. మొదలు వారిక్కడికి రావలయునని యనుకొనలేదట! కాని సోలగప్ప నాయకులు మంచము పట్టినారన్నవార్త తెలిసి వారిసిచూని పోవుటకై వచ్చుచున్నారట!"

"మీమాట నిజమేనా?"

"మే మెందుల కబద్ధమాడెదము? మా మాటలుమీరు నమ్మకున్నచో - ఇదిగో కుమార కృష్ణప్పనాయకుల వ్రేలి యుంగరము. దీనిని తమరు పరీక్షించికొనవచ్చును." దీక్షితులు ముద్రాంగుళీయకమును దుర్గాధిపతి చేతికిచ్చినాడు; దుర్గాధిపతి దానిని పరీక్షించెను. అది యువరాజుల యుంగరమే.!

"మీరింక పోవచ్చును. మా నుండి మీకు తొందర యైనచో-క్షమించవలెను."

"పరవాలేదు. మీకర్తవ్యమును మీరు నిర్వహించితిరి." దీక్షితులు నవ్వుచు బదులొసగెను. పల్లకి ముందుకు సాగెను బోయీలు వేగముగ నడచి సముద్రతీరమునకు వచ్చినారు అక్కడ నిరుపురు బెస్తవాండ్రు వారికొరకై కాచుకొని

యుండిరి. దీక్షితులు దంపతుల నా దోనెలో నెక్కించెను. తానుగూడ కూర్చున్నాడు. బెస్తలా దోనెను నడపిరి. దీక్షితులు మేనా మోసికొనివచ్చిన బోయీలకు రూకలతో నిండిన ఒక సంచి బహుమాన మిచ్చుచు నిట్లన్నాడు.

"మహారాణిగారి యుపకారమును మేమీ జన్మలో మరువలేము. కుమార కృష్ణప్ప యొనర్చిన త్యాగము మా యందరకును ధ్యేయము. వీరిర్వురకును—మే మాజన్మము కృతజ్ఞులమై యుందుము. భగవంతుడు వారికి సర్వశ్రేయస్సులను ప్రసాదించునుగాక." యువరాజుల కందజేయవలయునని క్షితులు కుమార కృష్ణప్ప యుంగర మా బోయీల కిచ్చివేసినాడు; దోనె శరవేగమున సాగెను. సముద్రములో నీరు ప్రశాంతముగ నుండెను. పోటెక్కువగ లేదు. ఇది దైవము వారికిజేసిన యుపకారము. దోనె "కోలరూన్" నదీముఖ ద్వారమును సమీపించినది. బెస్తవాండ్రు దోనెను తీరమునకుఁ జేర్చి లంగరు వేసినారు; ఆ దంపతులు నేలపై పాదములు మోపిరి. నరకమునుండి స్వర్గమును జేరిన యనుభవము తొలిసారిగ వారి హృదయములలో భాసించెను. వారు సంతోషమున మైమరచిరి. కాని యిది కాలహరణమునకు వేళగాదు. తామింకను సోలగుని యాపదనుండి బయట

పడలేదు. ఏ ఘడియలోనైనను వాని సైనికులు తమ్ము తరుముకొని రావచ్చును. ఈ విషయమును దీక్షితులు హెచ్చరించినాడు.

దీక్షితులు బెస్తలకు బహుమానమిచ్చెను. వారు నమస్కరించి వెనుదిరిగిరి. తమకై సిద్ధపరచియున్న గుఱ్ఱములకై దీక్షితులు వెదుకజొచ్చెను. పది గజముల దూరమున గుఱ్ఱముల సకిలింత వినవచ్చినది. దీక్షితులు దంపతులతోగూడ నచటికి వచ్చినాడు. వారి కొరకై మూడు గుఱ్ఱములు జీను, కళ్ళెములతో తయారుగనున్నవి. వానిని దీక్షితుల కొప్పించుచు కావలియున్న సేవకు డిట్లన్నాడు.

"మీరెవరో నాకు దెలియదు. మహారాణిగారు చెప్పిన లక్షణములు మీలో గనుపించుచున్నవి. దోనెలో నుండి దిగి ముగ్గురు వ్యక్తులు వత్తురనియు, వారికీ గుఱ్ఱముల నొప్పింపవలసినదనియు మహారాణిగారు మా కొసంగిన యాజ్ఞ. ఆ చెప్పిన వ్యక్తులు మీరేనా?"

"అవును. వారి యుపకారము మరువరానిది. మహారాణిగారి యుపకారము లేకున్నచో-మేమిచ్చటికి వచ్చుటకు సాధ్యమై యుండెడిదిగాదు. నీవుపోయి మా క్షేమ సమాచారమును వారికి తెల్పుము. ఆమె యుపకారము జన్మజన్మములకును మరువలేమని మనవిసేయుము."

వాడా సందేశము గైకొని కనుమరుగయ్యెను. ఆ గుఱ్ఱముల నెక్కవలసినదని దీక్షితులు దంపతులతో నన్నాడు. అతడా ప్రాంతమున నున్న చెత్త చెదారమును కుప్పజేసెను. దానికి నిప్పంటించినాడు. ఆ ప్రకాశము, పొగ "దేవికోట" కగుపించుచుండెను. ఆ పొగలో దీక్షితులు "కోట" వైపు జూచినాడు. ఆ కోట కీ గతియే పట్టునని దీక్షితుల చూపున కభిప్రాయము; చెన్నప్పనాయకునితో దీక్షితులిట్లన్నాడు.

"ఇదంతయు నా-దేవి ప్రసాదము. ఆమె యుప కారమే లేకున్నచో మన మందర మీపాటికి భైరవున కాహుతులమై యుందుము."

"మీరీ యగ్ని నెందుకు ముట్టించితిరి?"

"మనము సుఖముగా తప్పించుకొనుట కిదియొక గుర్తు. మన మందరమును తప్పించుకొన్నమీదట నిట్లు మంట వేయ వలయుననియు దానినిచూచి వారు తప్పించికొనిరని తాను నిర్ధరించికొందుననియు, మాతృదేవియాజ్ఞ యొసగినది. ఆ నీచ సోలగునకు మన మేర్పరచుచున్న చితిగూడ నిదే!" మంగమ్మ యీ మాటలకు చెన్నప్పనాయకుని వైపు జూచి నవ్వెను.

"సోలగునినుండి తప్పించికొన్నాము. మరి వాని వధ యెన్నడు?" చెన్నప్ప దీక్షితులను ప్రశ్నించినాడు.

"అది తరువాత కథ. ఇప్పటికొక ఘట్టమైనది." దీక్షితులు "దేవకోట" వైపు చూచుచునే యనెను.

దూరమున గుఱ్ఱముల గిట్టల చప్పుడు వినవచ్చినది. చకితులైన మువ్వురు నావైపు జూచిరి. ఇరువురు రౌతులు సైన్యముతోపాటు వచ్చుచున్నారు. ఆ రౌతులలో నొకరు రఘునాధరాయలు. రెండవ రౌతు బురుష వేషముతోనున్న కళావతీదేవి. రఘునాధుడు గుఱ్ఱముదిగి దీక్షితులను గట్టిగా కౌగలించికొన్నాడు. రెండవ వ్యక్తిని గురుతుపట్టని దీక్షితులు "అతడెవ్వ"డని రఘునాధు నడిగెను.

"నీవే యడుగుము." రఘునాధుడు ప్రశ్నార్ధకముగ నా రౌతువైపు జూచినాడు.

కళావతి ఫక్కుమని నవ్వినది. ఆ నవ్వుతో దీక్షితులామె కళావతియని గ్రహించెను. రఘునాధునితో దీక్షితులిట్లనెను.

"మీాకీ వృత్తాంత మెట్లు దెలిసినది?"

"గౌరాంబ వర్తమాన మంపినది. ఈ యేర్పాటులన్నియు నామె చలువయే! ఒక వేళ తన ప్రయత్నము ఫలింపకున్నచో-సమయమునకు మీారు దేవికోటపై నెత్తి రావలసినదనియు మహారాణిగారి యాజ్ఞ." ఆ దేవిని దలచి కొని దీక్షితులు కన్నీటితో మనసార నమస్కరించెను.

"తమరు గూడ యుద్ధరంగమునకు........."

"అవును. దేవికోటతోడి యుద్ధము విపత్కరమని యెరుగుదుము. రఘునాధనాయకుల నొక్కరినే పంపుటకు

మాకు మనసొప్పలేదు. ఈ యుద్ధమున మేము వారికి తోడ్పడుటకే వచ్చితిమి."

"మీరు గొప్ప సాహసము చేసినారు."

"చేయలేదు. చేయదలచితిమి. అయినను "గౌరాంబ" యొనర్చిన సాహసమునకు, త్యాగమునకు మనమందరమును కింౕదే. చిన్ననాడు నేర్చిన కత్తి యుద్ధములోని మెలకువల నీనాఁడు చూపుదమనుకొంటిమి. తప్పిపోయినది."

"అందుకే యీ భామ కత్తి పట్టుకొని యుద్ధరంగము నకై తహ తహ లాడుచువచ్చినది

"అవును నేను సత్యభామనే."

క॥ పూనుకొని మేలుగీళ్ళకు
లోనై విహరించు వారిలోక మెఱుగదో.
యీ నరకాసుర దమనుడు
తానెఱుఁగడొ, భోజకన్య తానెఱుగదొకో.

"మరల తిమ్మనగారి పద్యమే చెప్పుచున్నది."

"మహారాణికి ముక్కుతిమ్మనగారిపై గల యభిమాన మందరకు తెలిసినదే!"

"యుద్ధసన్నాహములలోగూడ మధురవాణిని కళావతి మరచిపోలేదు."

ముగ్గురును ఫక్కుమని నవ్విరి.

జరిగిన కథ యంతయు దీక్షితులు సంగ్రహముగా తెల్పెను. అతని త్యాగమునకు రఘునాధు డాశ్చర్యపడినాడు.

మంగమ్మ ఆయాసముతో నేల కూలబడెను. చెన్నప్ప నాయకు డామెను తనతొడపై పరుండబెట్టికొని యుత్తరీయపు కొంగుతో విసరదొడగెను. మంగమ్మ మెల్లిగా కన్నులు తెరచి చిఱునవ్వు నవ్వెను. "మీరేమి యోచించపనిలేదు. బంధ విముక్తుడగుటకై – మీ కుమారు డొనర్చుచున్న సాహసమిది; దీక్షితులు తృప్తిగా నవ్వెను.

చెన్నప్ప తన భార్యవైపు జూచినాడు. ఆమె సిగ్గుతో తల వంచికొన్నది. చెన్నప్పనాయకుని హృదయ మేదో యొక మధురగీతము నాలపించుచుండెను. అది అన్నమయ్య గారి కీర్తన.



కైలాస్ పవర్ ప్రెస్, ఆళ్ళగడ్డ.